శ్రీ

# హోమియోపతి గృహవైద్యము

*60 Chief Homœo Medicines and*
*15 External Medicines*

*(With Characteristic Symptoms)*


గ్రంథకర్త:

డాక్టరు నారపరాజు కోదండరామయ్య, H. M. B.







చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచేఁ

ప్రకటితము.

1941

# PREFACE.

I have gone through a good portion of this little book. It is very well written in easy understandable language. The drugs have been carefully selected and all the important ones have been included in the book. The repertory at the end might well have been fuller but even as it is, it enables one to pick out the necessary drugs. All the drugs included in this book can be had for a few rupees. With this book in hand every householder can at least till the doctor is available select an effective remedy.

Madras.<br>23-3-42.

B. SOMAYYA.

# సారూప్యౌషధ ప్రశంస



పాఠకమహాశయులారా! మీరు హోమియోపతి వైద్యమునుగూర్చి వినియేయుందురు. ఈవైద్యవిధానమును జర్మనీ దేశస్థుడగు శామ్యుయల్ హానిమాన్ కనిపెట్టెను. ఇందలి మందులు కారము చేదు వగరు కషాయములు కావు. తియ్యనివి. లోగడ నొకసారి రుచిచూచియున్నచో పసిపిల్లలు మందు సీసాను చూచినవెంటనే బారలుచాపి పరుగిడివచ్చి మందును యివ్వుమని పోరుపెట్టుదురు. తీయదనమువలన పిల్లల నాకర్షించుట యొక్కటేకాదు. తరుణబాధల నివారించును. తీవ్రమగు వాపులను హరించును. రక్తస్రావములను కట్టించును. కంతులను కరగించును. వ్రణములను మాన్పును. ఆనువంశికవ్యాధులను, సాంక్రామికవ్యాధులను దూరముననే నిలుపును. వ్యాధిపరిమితిదినములు తగ్గించును. ఇట్టి అద్భుతగుణములు చూచియే అన్యవైద్యవిధానముల నారితేరిన పెక్కండ్రువైద్యులు సహితము హోమియోపతివైద్యులుగా మారిరి. ఈమందులు నిరపాయకరమైనవి. వ్యాధిని మొదలంట రూపుమాపునవి.

ఈయౌషధములు కుక్కలపైనను గుఱ్ఱములపైనను ఎలుకలపైనను వాడిచూచి గుణముగ్రహించి మానవులపై ప్రయోగముచేయునవి కావు. కుందేలు నాభిని తినును. మాన

వుడు తినగలడా?. ఏపర్వతగుహాయందో దాగియున్న ఏమహా మహుడో యెవరికో యొకసారిమందిచ్చి వ్యాధి నిర్మూలింప జేసెననియు మీారనువాడిన మేలుచేయుననియు గొప్పగా చెప్పెడి యోగములును గావు. నల్లమందునో పాషాణమునో కైనానో నరములకు ధాతువులకు రక్తమునకు బలమిచ్చునని గ్రహించి వానిరుచి వాసనలను కప్పిపుచ్చుటకు మరికొన్ని తీయనివియు సుగంధయుతమగునవియు ద్రవ్యములను పైవా నితోజేర్చి ఆకర్షించునట్లు పెద్దపెద్దపేర్లతో బజారునందు విక్ర యింపబడు పేటెంటుమందులవలె శరీరతత్వమును నరముల పటుత్వమును జీర్ణకోశబలమును నాశనముచేయునవి కావు. ఆరోగ్యవంతులపై నొక్కొక్క ద్రవ్యమును లేక మూలికను వాడి ఎద్దానివలన యేలక్షణములుపుట్టునో గమనించి అట్టి లక్షణములచే బాధపడుచుండువానికి దానిని సూక్ష్మపరిమాణ ములో వాడిన వ్యాధితగ్గునని గ్రహించిరి. నాభి వకవెయ్యి మందికి ఆరోగ్యవంతులుగా యున్నవారికి యిచ్చిరనుకొనుడు. వారందరికిని జ్వరము, చలి, అతిదాహము, ఆదుర్దా, విశ్రాంతి లేమి, ఎట్టనివాపు, చావుభయము యిట్టిలక్షణములు బయలు దేరును. పైవెయ్యిమందిలోను ఒకేరకముగా (Common) యేయేలక్షణములు కనుబడుచున్నవో వానిని వ్రాసుకొని యట్టిలక్షణములు కలబాధలు ఆవస్తువువలన నిర్మూలింపబడునని సారూప్యౌషధవస్తుగుణదీపికను రచించిరి. జ్వరము, చలి, అతి దాహము, ఆదుర్దా, విశ్రాంతిలేమి, చావుభయము యిట్టిలక్ష

ణము లన్నిటితోగాని కొన్నింటితోగాని బాధపడుచున్న వానిని చూచినవెంటనే వాని కీవ్యాధిలక్షణములు యేకార ణమువల్ల వచ్చినను, (గాలిమార్పుగాని, ఆహారముమార్పు గాని, అజీర్తివల్లగాని) యేయితరవ్యాధిలో వచ్చినను, (జ్వర ముగాని, అజీర్తిగాని, దగ్గుగాని, పడిశముగాని, ప్రమేహ ముగాని, మేహవాతపు నొప్పులుగాని) ఎకోనైట్ను సరియైన పవరులో వాడవలెను. పవరును, మందుపరిమాణమునుగూర్చి యీగ్రంథములో ఉపక్రమణికయందు వ్రాసితిని. ఇట్టిపద్ధతి ప్రపంచమున యుత్తమవైద్యమని పేర్వడియున్న ఆయుర్వేద వైద్యమునందును కలదు. వేడి, ఒడలంతయు విరుగగొట్టినట్లు నొప్పులు, తలభారము మొదలగు లక్షణములతో బాధపడు చుండువానికి మిరియాలకల్కమును యిత్తురు. ఈకల్కమునే యారోగ్యముగా నున్నవానికి యిచ్చుచో వేడి, ఒడలంతయు విరుగగొట్టినట్లు నొప్పులు తలభారము కల్గుచున్నది. దీనికే వస్తుగుణ రోగగుణసామ్యత యనియు సారూప్యతయనియు పల్కుదురు. కనుక రోగనామముకొరకును, రోగకారణముకొర కును కాలమును వృథసేయక రోగలక్షణములకు సారూప్యలక్ష ణములు గలమందును యీసారూప్యౌషధగృహవైద్యమున గమనించి యవసరసమయమున వాడి ఫలితము పొందుడు.

బజారున విక్రయించు పేటెంటుమందులకు మీాధన మును వ్రయపర్చుకుడు. మెగ్నీషియా, ముసాంబరము, నేపాళము, ఎప్సంసాల్టు, గ్రేపౌడరు, సునాముఖి, జాలప్పౌడరు,

కాల్ మెల్ మొదలగువానిని వాడి మీశరీరమును పాడుచేసు కొనకుడు.— ఒకవిరేచనబద్ధకము గలవానికి కొంతనేపాళమో సునాముఖియో కలిసినమందును (యితరవైద్యులు) వాడుదురు. వానికి పెక్కుమార్లు విరేచనము నీళ్లగానగును. అందేమియు సందేహములేదు కాని విరేచనములగుటకు అతని కాలేయము నుండి పైత్యరసమును, పొట్టనుండి జాఠరరసమును, ప్రేవుల నుండి ఆంత్రరసమును, మిక్కుటముగ ఖర్చుపడును. ఇట్లు ఖర్చుపడినరసములు మరల పూర్తియగుటకు కొన్నిదినములు పట్టును. ఈసమయమున సామాన్యముగ మనము తినుయాహార మును తీసుకుందుమా సక్రమముగా జీర్ణమగుటకు కావలసినరస ములు తరుగుపడి యున్నందున అజీర్తియేర్పడును. విరేచన మును సక్రమముగా వెడలించుటకు తగినద్రవపదార్థము తరుగు పడియుండుటచే విరేచనబద్ధకము లోగడకంటె రెట్టింపుగా నేర్పడును. ఇట్లు తరుచుగావాడుటచే జీర్ణకోశ మేపాడగును.

ఒకనికి విరేచనబద్ధకముగా నున్న నక్సువామికా, లైకో పోడియం, బ్రయోనియా, ఎల్యూమినా, సిలీషియా, ఓపియం, మెర్క్యూరియస్, హైడ్రాస్టిస్ మొదలగువాని ప్రత్యేకలక్షు ణములను గుర్తునకుతెచ్చుకొని యేమందు యందు హరించిన మలబద్ధకచిహ్నములు వానికిగలవో గమనించి ఒక్కమోతాదు వాడుచో చక్కగా కాలవిరేచన మగును. నక్సువామికా వాడదగినవాడు విరేచనమునకు పదేపదే వెళ్లును. విరేచనము తినికితినికి యగును, అనుమానరహితముగా కాదు. లైకో

పోడియం రోగికి విరేచనము పల్చగానుండియు కష్టముమీాద వెడలును. అపానవాయువులు విస్తారము వెడలును. బ్రయో నియారోగికి విరేచనమునకు వెళ్లవలెనని తొందరయే కలుగదు. మలము గట్టిగ ఉండలవలె నల్లగ వెడలును. ఈతడు దాహము పుచ్చుకొనినపుడు విస్తారముగా పుచ్చుకొనును. ఎల్యూమినారోగి సన్నముగా యెండుకొనియుండును. మలము ఉండలుగా ఎండుకొనియుండును. సిలీషియా వాడవలసిన వానికి మలము వెడలుచు కొంతభాగము మాత్రము వెడలి కొంత నిలచిపోయి మరల లోపలికిపోవును. ఓపియం రోగి మలము గొఱ్ఱెపెంటికలవలె నల్లగానుండి పెక్కుదినముల కొక సారి యగును. ఈవిధముగా లక్షణములననుసరించి మందు వాడిన చక్కని పనిచేయును.

ఈమందులు యింజక్షనులకంటె వడిగా పనిచేయును. (Light is not more nicely adjusted to the eye nor sound to the ear than Aconite to circulation Belladonna to the brain and congestion generally, Phosphorus to the lungs, and Pulsatilla to the stomach and bronchail tubes. J. Laurie. M. D.) రక్తప్రసరణమునకు ఎకోనైట్, మెదడువ్యాధులకు వాపులకు బెల్లడోనా, ఊపిరితిత్తులకు ఫాస్ఫరస్, జఠరమునకు శ్వాసనాళ ములకు పల్సటిల్లాయును సంబంధము కలిగియున్నట్లు—కంటికి వెలుతురునకును- చెవికి శబ్దమునకునుగూడ గ్రహించుటలో నంతసంబంధము లేదట

ఈసందర్భమున నొకవిషయము తెలుపవలసియున్నది: ఎకోనైట్ రక్తప్రసరణముపై పనిచేయునని వ్రాసిరిగదా. రక్త ప్రసరణమునకు ఎకోనైట్ ఒక్కటేమందనియు యితర మందులు లేవనియు కాదు. ఫెరంమెటాలికం, చైనా, ఆర్సెనికం మొదలగు పెక్కుమందులు కలవు. ఒకానొకరోగమునకు యిదేమందని నిర్ణయింప వీలులేదు. కాని ఒకానొక ప్రత్యేక లక్షణమునకు ఫలానామందని మాత్రము నిర్ణయింపబడి యున్నది. దగ్గు అనువ్యాధినిగూర్చి విచారింతము. దీనికి వాడదగుమందులు—ఎకోనైట్, బెల్లడోనా, హాయోశ్యామస్, కాలీబైక్రోమికం, ఇపెకాక్, ఫాస్ఫరస్, బ్రయోనియా, సల్ఫరు, నక్సువామికా మొదలగునవి. ఒకవైద్యశేఖరుడు దగ్గుపై వాడదగుమందులను లక్షణములతో సక్రమముగా వ్రాయుచు ఇపెకాక్ కఫహారి యని వ్రాసిరి. కొందరువైద్యులు ఇపెకాక్ కఫహారియని వ్రాసిరిగదా యని యేలక్షణములతో నుండుదగ్గునకైనను వాడుచు ప్రయోజనమును పొందకుండిరి. ఎడతెగనివోకరింత, వాంతులతో కూడియున్నదగ్గును తగ్గించుటకు ఇపెకాక్ కఫహారియని వ్రాసిరిగాని అన్నిరకములగు దగ్గులను తగ్గించుటలో ముఖ్యమైనది యనికాదు. ఇట్టిప్రత్యేకలక్షణములను గ్రహింపలేక కొందరువైద్యులు దగ్గుచే బాధపడువానికి ఉదయము శీతోఫలాదిచూర్ణమును మధ్యాహ్నము ఇపెకాక్‌ను సాయంత్రము పగడభస్మమును వాడుచుండుటయు, చలిజ్వరమునకు ఉదయము శీతాంకుశరసము మధ్యాహ్నము

ఆర్సెనికంఆల్బం, సాయంత్రము అర్క లేక అమృతారిష్టం రాత్రిసమయమున నైనా యిట్లు కలగలపులుగా వైద్యములు చేయుచు రోగమును మహోపద్రవస్థితికి తెచ్చుచున్నారు. ఎల్లోపతిమందుల మధ్య వీనిని పెక్కండ్రు వాడుచున్నారు. ఇట్లు వాడుచుండు ఆఘనులు తమరోగులకు వ్యాధి నివారణ కానందున హోమియోపతి-వైద్యము పసిపిల్లలకు మాత్రము పనిచేయునని కొందరును, సుకుమారులకే పనిచేయునని కొందరును, శీతలదేశవాసులకు ఉప్పుకారము తిననివారికి పనిచేయునని కొందరును, యిట్లు పెక్కురకముల పల్కుచు యీవైద్యమునకు కళంకము గలిగించుచున్నారు. కాని అగ్నిని, భాగ్యవంతుడైనను బీదవాడైనను పెద్దయైనను పిన్నయైనను స్త్రీయేని పురుషుడేని అంటుకొనిన తనవెచ్చదనమును చూపునట్లు రోగికి గల లక్షణములతో సారూప్యలక్షణములు గలమందును వాడుటచే రోగము తప్పక నివారింపబడును. ఆరెంటిసారూప్యత కుదురువరకు రోగము కుదరదు. ఈవిషయమును పెక్కుమార్లు వ్రాయుచుంటిని. ఏలనన, ఈవిషయము మీామనస్సులో నాటుకొనునట్లు చేయవలె ననియే.

లోకములో నన్నివ్యాధులను నయముచేయుమందని యొకటి యుండదు. అట్టిదియున్నదని యెవరైన పల్కిన నది బూటకమనియే నమ్ముడు. మానవప్రకృతులు భిన్నములు. అటులనే వస్తువులగుణములందును భిన్నత్వము గలదు. "పొట్లకు

పొరుగుగిట్టదు. కాకరకు కంపుగిట్టదు." అనినట్లు మనుష్యులలో కూడా యీరకమువా రున్నారు. ఒకడు వంటరిగా యేమూలనో కూర్చుండును ఒకచెట్టు యేవృక్షములు లేనితావున యొంటరిగా పెరుగును. ఒకడు తన్నితరులు తాకిన సహింపలేడు. ఒకచెట్టు యితరులస్పర్శతగులగనే తనపత్రములను ముడుచుకొనును. వీటిని తెలిసికొని హోమియోపతిశాస్త్రజ్ఞులు వస్తుగుణములను విచిత్రలక్షణములతో వస్తుగుణదీపికయందు వ్రాసియున్నారు. ఒకడు 102, 103 డిగ్రీలజ్వరము, దాహము, మంట వీనిచే బాధపడుచుండును. ఇట్టివానికి వేడికాపడము, వెచ్చనిప్రదేశము, వేడిపదార్థములవలన వ్యాధిఉపశమనము కనుపించును. ఇతడు ఆర్సెనిక్ ఆల్బంరోగి ఒకనిశరీరము చల్లగా నీటికుండవలె నున్నది. మంటలతోకూడిన బాధలును కలవు. ఇతనికి చల్లదనమువల్ల నుపశమనము కనుపించుచున్నది. ఇతడు లెడంరోగి మాదిరికి ఈపైరెండురకముల లక్షణములను వ్రాసితిని. వీరివ్యాధియందు విచిత్రతలేదా. అట్టివిచిత్రలక్షణములను వైద్యుడు శ్రద్ధగా గమనింపవలెను.

రోగికి మందు నిర్ణయించునపుడు పైనపేర్కొనబడిన విషయములేగాక బాధలు ఉద్రేకించుసమయమును ఉపశమించు సమయమును కనిపెట్టి అవేలక్షణములు తాను రోగికివ్వదలచుకున్న మందుయందుండునట్లు ప్రధానముగా చూడవలెను—

మనదేశము కడుబీదస్థితికి వచ్చినది. వృత్తులా సన్నగిలుచున్నవి సంపాదనలా తగ్గినవి. పెద్దలు సంపాదించిన ఆస్థులా

హెచ్చులకుపోవుటచే తరిగినవి. విరుద్ధాహారములు, విరుద్ధ చేష్టలు,మలినచిత్తము వీటివలన ఆరోగ్యమూ ప్రతివారికిని తరుగైనది. డాక్టర్లబిల్లులూ హెచ్చుచున్నవి.ఇట్టిమనకు యీహోమియోపతివైద్యము దయాస్వరూపుడగు భగవంతునిచే హానిమాన్ ద్వారా వెల్లడిచేయబడెను. మందులూ కొద్దివెలకే లభింపగలవు. కొంచెముశ్రద్ధవహించి లక్షణానుగుణముగ మందును వాడుచో వ్యాధులనుండి తప్పించుకొనవచ్చును.

బొద్దుగానున్నవానిని చూచి వాతరోగియనియు ప్రొద్దుగ్రుంకగనే వాతకాలమనియు అర్థములేని వ్యర్థపుమాటల పల్కుచు గ్రహణిరోగికి నల్లమందు కలిసినమందులను కుప్పించి వాడి మత్తుగల్గ, కొంచెము దేహముచెమర్చిన శీతలస్థితికి వచ్చుచున్నదని గ్రహణిలో ఆంత్రములందు పుండుపడునని గ్రహింపులేక గరళముకలిసిన సింహప్రతిపాలనాది మందుల వాడుచు అనేకవంశాంకురములను యమధర్మరాజు పట్టణమున పాతకాపులుగా జేర్చు వైద్యులసంబంధము తొలగించుకొనుడు. నే నిటులవ్రాయుటలో ఆయుర్వేదమునుగూర్చి దూషించుటకై కాదు. ఆయుర్వేదము మహాసముద్రమువలె అంతులేనిది. దానిని చక్కగ చదువక, మూలసూత్రములైనను గ్రహింపక మోటువైద్యము చేయువారినిగూర్చి హెచ్చరించితిని—

మీకు యీగ్రంథమున ముఖ్యముగా దోచు పది మందులనే ముందుతెచ్చుకొని వానిని వాడిచూడుడు. వాని

ఫలితమును చూచి మరల పదితెచ్చి వాడుడు. క్రమముగా వస్తుగుణమంతయు మీకు మనస్సున నాటుకొని మీరే చక్కని వైద్యులుగా తయారు కాగలరు.

మందులసంఖ్య యింకను తక్కువగానుండి వైద్య సౌకర్యము వలయునన్న నాచేరచింపబడిన జర్మనీ నవీనచికిత్స లోని మందులను వాడుకొనుడు.

ఈహోమియోపతి గృహవైద్యములోని చికిత్సాభాగ ముకంటె మొదటిరెండుభాగములను, కొంచెము శ్రద్ధగ గమనించగోరెద. చికిత్సాభాగము చదువ శక్తిగల గృహిణీమణులు కూడ వైద్యావసరసమయమున మందును వాడుకొనగలుగునట్లు సులభముగ వ్రాసితినని తలచుచున్నాడను—

ఇట్లు,

డాక్టరు: నారపరాజు కోదండరామయ్య,

హెచ్. యం. బి.

# విషయసూచిక.

# తప్పొప్పులపట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 12 | 9 | బెల్ గ్రాప్, | బెల్, గ్రాఫ్, |
| 17 | 1 | రూస్ | రూస్టా |
| 18 | 3 | విడం | లెడం |
| 20 | 9 | రూస్ | రూస్టా |
| 23 | 21 | రూస్ | రూస్టా |
| 26 | 15 | రూస్ | రూస్టా |
| 26 | 16 | రూస్ | రూస్టా |
| 28 | 7 | పూసరపొట్ట | శరీరము చిక్కి తల పెద్దదిగా కను[పించుట. |
| 29 | 10 | విడుచు | విడుచువారి |
| 31 | 2 | ఫాస్ రూమెక్సు, | ఫాస్, రూమెక్సు, |
| 32 | 19 | పాన్ నకువాం, | పాన్, నక్సువాం |
| 34 | 3 | జెల్సురియం. | జెల్సు, రియం. |
| 38 | 10 | ఇగ్దేషియా, | ఇగ్నేషియా, |
| 39 | 16 | సెట్రికం | నైట్రికం |
| 40 | 16 | మెర్కు, రియం | మెర్కు, ? |
| 48 | 4 | అది | ఇది |
| | 15 | ఎలోస్ ఆర్నికా | ఎలోస్, ఆర్నికా |
| | 16 | పల్సుసెబీనా | పల్సు, సెబీనా. |
| 50 | 1 | హాయాశ్యామస్. | హాయోశ్యామస్. |
| 52 | 19 | వెడిగనుండు, | వేడిగనుండును, |
| 54 | 5 | Ipocacuanha | Ipecacuanha |
| 55 | 4 | బెల్, బ్రై, | బెల్, (?) |
| 59 | 11 | Coeulus | Coculus |
| 66 | 11 | ఆదుర్దా | ఆదుర్దాతో |
| 67 | 13 | ఆసిడ్ పాస్ | ఆసిడ్ ఫాస్ |
| 83 | 5 | Est | Edn |
| 86 | 10 | హరించును | పుట్టించును. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 94 | 12 | నల్లని | నల్లనిరక్తము |
| 96 | 17 | కారాలియం | కొరాలియం |
| 97 | 4 | గంటి | గంజి |
| 100 | 15 | ఫెరంమెట్ స్టేనం, | ఫెరంమెట్, స్టేనం, |
| 102 | 4 | పొడిదగ్గులో | పొడిదగ్గు, లోకాక |
| 110 | 9 | వేడికానుండి | వేడిగానుండి |
| 112 | 2 | ఎడమభాగములయందు | (ఎడమభాగములయందు) |
| 117 | 15 | జెల్సీమియా బట్టలిప్పివే యుట, | జెల్సీమియం బట్టలువిప్పివేయుట, |
| 119 | 9 | Grave | Gravel |
| 133 | 4 | హిల్. | హిప్. |
| 142 | 2 | ఆసిడ్ ఒక్ రిక్ | ఆసిడ్ పిక్ రిక్ |
| 148 | 1 | ఎటిక్ | ఎసెటిక్ |
| | 3 | కొడెయిదం | కొడెయినం |
| 156 | 9 | యామ్కులన్ | యాస్కులన్ |
| 158 | 1 | గాగ | గాగల |
| 159 | 3 | ఏర్పడుట, | ఏర్పడును. |
| | 17 | ఎసఫిటిలా, | ఎసఫిటిడా, [ద్రు. 3 గం॥ |
| 160 | 3 | లెకెసిన్, 3 గం॥ | లెకెసిన్, 1-2 గం. మధ్య. ఆ |
| 161 | 9 | సల్ఫ. | సల్ఫు. |
| 165 | 1 | (1—1) | (1 : 1) |
| 166 | 11 | (1—10) | (1 : 10) |
| | 12 | (1—4) | (1 : 4) |
| 167 | 9 | (1—10) | (1 : 10) |
| | | (1—4) | (1 : 4) |
| | 20 | పుప్పి, పంటినొప్పి, | పుప్పి పంటినొప్పి |

శ్రీ ర స్తు.

# హోమియోపతి గృహవైద్యము

## ఉ ప క్ర మ ణి క.

చంద్రకౌముదులంబలె జంట నిలిచి
ప్రాణికోటికి నౌషధప్రతతి నిచ్చి
హాయి గూర్చెడి ప్రకృతిచైతన్యములను
తల్లిదండ్రుల సేవింతు ధర్మనిరతి.

చైతన్యశక్తియొక్క పరమాణువు శరీరమున బ్రవేశించి చైతన్యము కలిగించుచుండును. ఈపరమాణువునే జీవమనియు, ప్రాణమనియు పల్కుచున్నారు.

శరీరమందలి చైతన్యపరమాణువుయొక్క మార్పువలన కనుపించు అస్వాభావికలక్షణములే **రోగము.**

1. విరుద్ధాహారవిరుద్ధచేష్టలవలన శరీరమున అన్యపదార్థము వేరుకొనును. అట్టిదానిని వెలువరించుటకు చైతన్యశక్తి ప్రయత్నించును. అట్టిప్రయత్నముచేయుటలో కొన్నిమార్పులు చెందును. ఈమార్పునే **ఆత్మరక్షణకు చేయుపోరాట** మందురు (Resistance Power). చైతన్యశక్తి చేయుప్రయత్నమును వైద్యుడు కనిపెట్టి దానికి తోడుపడవలెను. కాని ఆమలములను బహిర్గతముచేయక కప్పిపుచ్చుచో నయ్యవి శాఖాగతములై దుస్సాధ్యము లగువ్యాధులు కల్గును. (శమనచికిత్సవలన

ఫలితము లివియే. Allopathy.)రోగము కుదుర్చుటలో చైతన్య శక్తి చేయు ప్రయత్నములను చక్కగ గమనించి యట్టిపనినే చేయగలమందుల నిచ్చి అన్యపదార్థవిమోచనము త్వరితముగ జరుగునట్లు చేయుటయే సాయపడుట. వస్తి (ఎనిమా), విరేచనము, వమనము, స్నేహము (ఒడలుపట్టించుట), స్వేదము (చెమటపోయించుట) ఈపంచకర్మలును దేహాంతర్గతమలములు వెడలించుటకు ఆయుర్వేదమున చెప్పబడియున్నవి.

2. ఏయేమందులు ఎట్టి అస్వాభావిక (లేక విచిత్ర) లక్షణములయందు వాడదగినవియు జర్మనీదేశస్థుడైన డా॥ శామ్యుయల్ హానిమాన్ స్వయముగా కనుగొని వెలిబుచ్చెను. ఈయన వైద్యసిద్ధాంతమును సారూప్యౌషధసిద్ధాంతమందురు (Law of similars). మన పూర్వఋషులు ఆయుర్వేదవైద్యమున. "ఉష్ణం ఉష్ణేన శీతలం" అను సూత్రముతో నీసారూప్యౌషధచికిత్సను పేర్కొనియే యుండిరి.

ఆరోగ్యవంతునకు ఏమందును ప్రయోగించిన ఏ విచిత్రలక్షణములుగల రోగము జనించునో ఆలక్షణములు కలరోగికి దానినే వాడి వ్యాధిని తొలగించుటయే సారూప్యౌషధ సిద్ధాంతము. (రోగిలక్షణములు మందులక్షణములు ఒకటిగానుండుట.)

రోగహేతువులవలన కల్గురోగలక్షణముల బలముకంటె మందులయందుండు రోగోత్పత్తిశక్తి ప్రబలమైనది.

స్వల్పమోతాదులు వెంటవెంట వాడుటవలన శరీరమున రోగోత్పత్తి కాబడును. సహజముగ శరీరమున జనించురోగ

బలముకంటె అదేరోగలక్షణములను పుట్టించు మందుశక్తివలన కలుగురోగలక్షణములు బలము హెచ్చుకలవి గనుక కొద్ది బలముగల శరీరజనితరోగచిహ్నములను త్రోసివేసి మందు లక్షణములు ఆక్రమించుకొనును. కాని ఔషధరోగశక్తి శరీర మున స్థిరముగా నిలచియుండక కొద్దికాలమునకే తగ్గిపోవును. అప్పుడు చైతన్యశక్తికి చురుకు గల్గి తన ప్రతీకారశక్తి (Re-action) వలన యథాస్థితిని చెందును. దీనినే రోగవిముక్తి యందురు.

హోమియోపతివైద్యునకు రోగనామములతో నెంత మాత్రము నిమిత్తము లేదు. ఆయుర్వేదమున సహితము వాత పిత్తశ్లేష్మములు స్థానాశ్రయభేదమునుబట్టి నామములు వ్యవహ రింపబడును. ఉ:—శ్లేష్మ ముక్కునుండి వెడలిన జలుబనియు, గుదమునుండి వెడలిన గ్రహణియనియు, కర్ణమునుండి వెడలిన చీమనియు పిలువబడును. అయినచో చికిత్సాభాగమున రోగ నామము లేల చెప్పబడు నందు రేమో. లోకములో వ్యవహ రింపబడు యొకానొకవ్యాధియందు వాడదగు విచిత్రలక్షణ ములుకల మందులన్నియు ఒకచోట వ్రాయుటకు సౌకర్య ముగా నుండుటకుమాత్రమే వ్యాధినామములు లిఖింపబడును. ఇంతియేగాక హోమియోపతివైద్యపుస్తకములోని ఎకొనైట్ వగైరా వస్తుగుణములు వ్రాసిన వన్నియు ఈలక్షణములుగల రోగము అని చెప్పుట కడుసమంజసము.

పొట్ట గాలిచే నిండియుండుట, తలపై వెంద్రుకలు తాకినను నొప్పికల్గుట, అతిఆకలి, లోతునబడినకన్నులు, చలి వచ్చుటకుముందు వెనుకల దాహము, జ్వరము రోజుమార్చి

రోజువచ్చుట యీలక్షణములు కలరోగిని చూపి యితడే రోగి యని ప్రశ్నించిన హోమియోపతివైద్యులు చైనారోగి యందురే కాని మన్యపుజ్వరరోగి యని చెప్పరు.

వైద్యుడు మందును నిర్ణయించుకొనుటకు రోగిచెప్పు లక్షణముల గుర్తుంచుకొనవలెను.

1. మనోలక్షణములు, ఆకలిదప్పికలు, వ్యాధికారణాములు ఉద్రేకఉపశమనములు. (Subjective symptoms)

2. శరీరఉష్ణము, నాడి, శ్వాస, నాలుక, ముఖము, చర్మము, శబ్దము, విరేచనము, మూత్రము వీనిని వైద్యుడు పరీక్షించి (objective symptoms) ఈరెండువిధములగు లక్షణములకును సరిపోలెడు లక్షణములు కలమందును నిర్ణయించుకొనవలెను.

రోగి లక్షణములన్నియు నొకేమందునం దుండుట తటస్థింపనిచో మిక్కుటముగ బాధపెట్టుచున్నట్టియు రోగి నొక్కిచెప్పునట్టియు ప్రమాదకరముగా తోచునట్టియు లక్షణములను గైకొని మందును నిర్ణయించి వాడవలెను.

హోమియోపతిమందులను రెంటిని కల్పిగాని ఒకదాని వెనుకనొకటి మార్చిగాని వాడరాదు. కాని హానిమాన్‌మహాశయుడే యవసరమునుబట్టి మేహవాతపునొప్పులలో బ్రయోనియా రూస్టాక్సులను, డా॥ ఇ. బి. నాష్ మైకములో హయోశ్యామస్, రూస్టాక్సులను రోజున కొకటివంతున మార్చియు, డా॥ లారీ రక్తపుగడ్డలలో మెర్క్యూరియస్, బెల్లడోనాలను, చలిజ్వరములో ఇపెకాక్, ఆర్సెనికములను పూటకొకటివంతున మార్చియు, డా॥ ముల్లరు ప్రసవవేదనలో ఆర్నికా,

బ్రయోనియా, రూస్టాక్సులను 5, 10 నిమిషముల కొకటి వంతున మార్చియు, గజ్జికి కేంథారిస్, సల్ఫరు, తూజాలను దిన మున కొకటివంతున మార్చియు వాడినట్లు తెలియుచున్నది. వీనిని నేనును వాడి చూచితిని. వాడుకలోనున్న మరికొన్నిటిని వ్రాసియుంటిని. దీనికై నిరసింపకుడు.

ఒకమందు వాడుటచే కొన్ని లక్షణములు తగ్గి యింకను కొన్ని లక్షణములు నిలచియున్న దానికి తగుమందును నిర్ణయిం చుకొని వాడవలెను.(వాడుటలో యీపుస్తకములో వస్తుగుణ భాగమున వ్రాయబడిన సహచరులు మొ॥ నవి గమనించునది.)

ఒకమందు రోగలక్షణము లన్నిటికి సరిపడియుండియు రోగికి కొద్ది ప్రయోజనమే కలిగించి యూరకున్నచో నేనీ గ్రంథము చివర పొందుపరచిన రీతిని రోగితత్వము కనుగొని తత్వానుగుణముగా పనిచేయుమందును మధ్యమధ్య తగునంత విరామముతో వాడి మొదటిమందును మరల వాడిన చక్కగ పనిచేయును.

ఇతరమందులు తిని శరీరము మరింత వ్యాధిగ్రస్తమై హోమియోపతిమందు సేవింపవలెనని వచ్చినవారికి ముందు విరుగుడుమందు వాడవలెను.

ఒకమందు వాడుటచే రోగోద్రేకమై మరల తగ్గకున్నచో అది సరియైనమందు కాదని యెరింగి దానికి విరుగుడుమందు వాడవలెను.

ఏమందిచ్చిన ఆమందులక్షణములు వచ్చుచున్నను రోగో ద్రేకము దినదినమునకు హెచ్చుచు రోగి క్షీణించుచున్నను ఆరోగము కుదరదని తలంచవలెను.

రోగము మహోద్రేకములో నున్నప్పుడు (ప్రాణాపాయము కల్గుసమయమున తప్ప) మందివ్వరాదు.

ఒకసారి మందు వాడుటచే సుగుణము కనుపించినచో ఆమందు చేయుపని ఆగిపోయినదని తోచువరకు అదేమందును గాని మరొకమందునుగాని వాడరాదు. అటుల వాడుచో రోగము కుదురకపోవుటయేగాక ప్రమాదము కూడ సంభవించును.

పొటెన్సీ—తరుణవ్యాధులలో తక్కువ పొటెన్సీలును (3, 6, 12, 30) దీర్ఘవ్యాధులలో హెచ్చు పొటెన్సీలును (60, 200, 1000 మొ॥) ప్రమాదకరమగు తరుణవ్యాధులలో హెచ్చు పొటెన్సీలును వాడవలెను.

తక్కువ పొటెన్సీవలన రోగోద్రేకము కల్గును. కనుక తరుణవ్యాధులందు కూడ హెచ్చు పొటెన్సీలే గుణకరములని కొందరిమతము.

ఒక పొటెన్సీ వాడునపుడు రోగోద్రేకము కల్గిన ఆయుద్రేకము తగ్గువరకు మరల వేరొక పొటెన్సీగాని దానినిగాని వాడరాదు. ఉద్రేకము శుభసూచకము—ఉద్రేకము తగ్గుటతో వ్యాధియు తగ్గును.

1, 2, 3, 6, పొటెన్సీలు 5, 10, 15, 30 నిమిషముల కొకసారియును అవసరమునుబట్టియు, 12 ను రోజుకు 3, 4 పార్లను, 30 ని దినమునకు 2 సార్లును, 200 ను మూడుదినముల కొకమారును, 1000 ని వారమున కొకతూరియును, అంతకుపై మందులు నెల, మూడునెలలు, ఆరునెలల కొకపర్యాయమును వాడవలెను

ఒక పొటెన్సీ వాడుటచే కొంత సుగుణము కలిగించి ఆగినచో పైపవరును వాడవలెను.

(క్రింది పొటెన్సీ వాడుచో కలిగిన సుగుణము కూడ చెడును.)

హెచ్చు పొటెన్సీలు సాధారణముగా రోగోద్రేకము కలిగింపవు.

హెచ్చు పొటెన్సీలు వాడునపుడు మధ్య వ్యవధి తగినంత హెచ్చుగ నుండవలెను, గాన వ్యవధికాలమున ప్లాసిబో (వట్టిపాలపంచదారమాత్రలు) మాత్రలు రోగియొక్క సంతృప్తికొరకు వాడవలెను.

రోగలక్షణములను తక్కువపొటెన్సీ బయటికి తెచ్చును.

(నోరు పుక్కిలించి కడిగి మందు చప్పరించి సేవించవలెను.)

మోతాదు.

| | మాత్రలు. | టించరు. | పొడుము. |
|---|---|---|---|
| పెద్దలు | 2 మాత్రలు | 1 చుక్క | 1 గ్రెయిను |
| పిన్నలు | 1 మాత్ర | $\frac{1}{2}$ చుక్క | $\frac{1}{2}$ ,, |
| పసివారు | $\frac{1}{2}$ మాత్ర | $\frac{1}{4}$ చుక్క | $\frac{1}{4}$ ,, |

1 మాత్రగాని చుక్కగాని భాగములు చేయవలసినచో ఒక $\frac{1}{2}$ ఔన్సు శుభ్రమగు నీటిలో దానిని కరిగించి కావలసినన్ని భాగములుగా ఆనీటిని వాడుకొనవచ్చును.

మందులు ఉంచవలసినపద్ధతి—మందులకు హారతికర్పూరము, ఇంగువ, ఉల్లి మొదలగువాసనలు ఎప్పుడు తగులనివ్వరాదు. ఎక్కువ వేడిగ నుండుచోటను మిక్కిలి చెమ్మగనుండు

చోటను ఉంచరాదు. ఎండగాని మనము విడుచు గాలిగాని మందులకు తగులనివ్వరాదు. వాసనవేయు కొయ్యలతో చేయబడిన పెట్టెలలో పెట్టరాదు. ఒకమందు వాడినసీసా, మరొక మందునకు మరొక పొటెన్సీ మందునకు పనికిరాదు. సీసాను శుభ్రపరిచి వాడవలెను.

పథ్యము.—

యదన్నం ద్వేష్టి యదపి ప్రార్థయేతావిరోధితు,
తత్తత్త్యజ౯ సమశ్నంశ్చ తౌతౌ వృద్ధిక్షయౌ జయేత్. 1
కుర్వాతే హి రుచిం దోషా విపరీతసమానయోః,
వృద్ధాః క్షీణాశ్చ భూయిష్ఠం లక్షయం చ బుధాస్తు న. 2

1. రోగి ద్వేషించునాహారమును విడిచిపుచ్చి రోగికోరునట్టి ఆహారములో శరీరమునకు విరుద్ధముకాని పదార్థములను భుజించుచు దోషముల వృద్ధిక్షయములవలన కలిగిన వికారములను తగ్గించుకొనవలెను.

2. వాతవృద్ధియందు వాతహారములగు స్నిగ్ధ, అమ్ల, మధుర రసపదార్థములయందు కోరిక గల్గును. పిత్తవృద్ధియందు పిత్తహారములగు శీత, మధుర, రూక్ష, తిక్త, కషాయ పదార్థములయం దిచ్ఛ కల్గును. శ్లేష్మవృద్ధియందు శ్లేష్మహారములగు రూక్ష, అమ్ల, కటు, తిక్త రసపదార్థములయందు వాంఛ కల్గును. వాతక్షయమున వాతవృద్ధిచేయు రూక్ష, కషాయ, రసపదార్థములయందును పిత్తక్షీణమున పిత్తమునుపెంచు అమ్ల లవణపదార్థములయందును శ్లేష్మము క్షీణించిన స్నిగ్ధ, అమ్ల, లవణరస పదార్థములయందును విశేషముగ ప్రీతిని కలుగజేయును. కనుక వైద్యుడు రోగియొక్క కోరికలను గమనించి

దోషములకును, రోగికోరు పదార్థములకును కలసంబంధమును విచారించి పథ్యనిర్ణయము చేయవలెను.

దోషగతులు విచిత్రము లగుటవలన ఒకానొకప్పు వాతాదిదోషములు క్షీణించియున్నను ఇంకను క్షీణింపజేయు విరుద్ధవస్తువులయందు కోరిక గల్గును. ఇటులనే దోషవృద్ధి యందు కూడ ఇంకను వృద్ధిపరుచు సమానగుణద్రవ్యముల యందు కోరిక జనించును. కాన వైద్యుడు జాగరూకుడై దోష వికారములు శాంతింపజేయవలెను. కనుకనే తరుచుగా అను అర్థమిచ్చుపదమును సూత్రమున చేర్చబడియుండెను.

వాతాదిదోషములకును, ఈ వైద్యసిద్ధాంతమునకును సంబంధమేమి? పథ్యనిర్ణయమున వాతాదిదోషము లేల చెప్ప బడియె నని సందేహింపకుడు. ఈవైద్యము విచిత్ర, ప్రత్యేక లక్షణములమీాద ఆధారపడియున్నను, వాతాదిదోషములును సోరా, సైకోసిస్, సిఫ్లిస్‌తత్వములును, విచిత్రలక్షణములును సమన్వయముచేసుకొని పథ్యము నిర్ణయించుకొన దలచువారి యొక్క సౌకర్యార్థమై వ్రాసితిని. అటుల సమన్వయముచేసి నిర్ణయింపజాలనివారు కారము మొదలగు విదాహిపదార్థము లను, ఉల్లి యింగువ మొ॥ ఉగ్రగంధిపదార్థములను, కర్పూ రము చందనము పుష్పసారము మొదలగు పరిమళలేపములను, సారా కాఫీ నల్లమందు పొగాకు గంజాయి మొ॥ మాదక ద్రవ్యములను నిషేధించి, రోగియిష్టప్రకారము రోగితత్వము నకు లోగడ సరిపడి సుఖమును కల్గించునవియు, సులభముగా జీర్ణమగుచు పుష్టినివ్వగలపదార్థములను గైకొనవలెను.

---

## ఈ పుస్తకములోని సాంకేతికములు.

<రోగఉద్రేకసమయమును తెలుపు గుర్తు.

>రోగఉపశమన సమయమును తెలుపు గుర్తు.

పో—ఈమందుయొక్క లక్షణములకు సరిపోలునట్టి పెక్కులక్షణములు గల యితరమందులు.

స—సహచరి అనగా ఒకమందుయొక్క గుణములకు రోగలక్షణములన్నియు చాలనపుడు వాడుమందునకు విరుగుడు కాకుండా ముందు వెనుకల వాడుటచే రోగము మాన్పుటకు తోడుపడుమందు.

అ—అనుచరి అనగా ఒకమందు వాడుకవలన కొన్ని లక్షణములు తగ్గి మిగతాలక్షణములపై పనిచేయుటకు వెనుక వాడినమందు సుగుణములను చెరుపక పనిచేయుమందు.

వి—విరుగుడు మందులు.

మొ॥ మొదలగునవి.

ఇవి గాక బెల్లడోనా అనుదానికి "బెల్", ఆర్సెనికం అనుదానికి "ఆర్స్" అని యిట్లు కొన్నిచోట్ల పేర్లు క్లుప్తపరిచి వ్రాయబడెను.

---

శ్రీ ర స్తు.

# హోమియోపతి గృహవైద్యము

## 1 వ భాగము—వస్తుగుణదీపిక



### 1. Acid Nitric ఆసిడ్ నైట్రిక్.

[రక్తము, శ్లేష్మవాహికలు, గ్రంథులు, ఎముకలు, చర్మము, నవరంధ్రములు వీనిపై పనిచేయును.]

ఏవ్యాధియందైనను ముల్లుగ్రుచ్చుచున్నట్లు పొడుచుచున్నట్లు మంటలతో కూడియుండుబాధలు, బాధలు ఆకస్మికముగవచ్చి తగ్గుట, చెమట, మూత్రము గుఱ్ఱపుమూత్రమువలె దుర్వాసన, విరేచనమగుటకు ముందువెనుకల గుదమున తీవ్రమగుబాధ, బాధ విరేచనమైన గంటదనుకనుండి రోగి స్వస్థత లేకుండుట, తనజీవితమునం దసహ్యతచెందుట, తరుచుగా రొంపపట్టుచుండుట, ఈలక్షణములు కలరోగులకును; రసవిషములు మిక్కుటముగ సేవించుటచేతను, సుఖసంకటములవలనను, నిద్రలేకపోవుటచేత, రోగికి ఉపచారము చేయుటవలన, ఆతురతవలన, ప్రియమిత్రనష్టమువలన, ఋతుదినములకు పూర్వముకల్గు విచారముచేతను కల్గువ్యాధులకును; భగందరము, గళక్షతము, పురాణయకృత్ వ్యాధి, రక్తపుమొలలు, రక్తముకారు గోకుడుపుండ్లు, నలువైపుల విస్తరించు నల్లని

పుండ్లు, గ్రహణి, పురాణశ్వేతప్రదరము, నోటిలో పుండ్లు చొంగ దుర్వాసన, తియ్యనిరుచి, అతిఆకలి, సుద్దమన్ను బొగ్గు మొ॥ తిన కోరికగల్గుట ఈవ్యాధులకు మంచి పనిచేయును.

దీనిని లెకెసిస్‌కు ముందువెనుకల వాడరాదు.

<గాలిమార్పు, నడచుట, తాకుట, చెమట, పరుండుట, రాత్రి, సాయంకాలము.

>బండిప్రయాణము, స్వారిచేయుట, కప్పుకొనుట.

పో— ఆసిడ్ మూర్, ఆసిడ్ ఫాస్, ఆరం, ఆర్సు, బెల్‌గ్రాఫ్, అయోడ్, కాళిబైక్రో, లైకో, సేపియా, సిలికా.

వి—కాల్కు-కార్బ, కేంఫర్, హెపార్, లెకె, మెర్కు, సల్ఫ.

## 2. Acid Phos ఆసిడ్ ఫాస్.

[స్నాయుమండలము, మూత్రాశయము, లింగేంద్రియ ముయొక్క ఎముక, చర్మము వీనిపై పనిచేయును.]

మగత, నిర్లక్ష్యము, ఎదుటనున్న వారిని తెలుసుకొొన లేకపోవుట, హెచ్చరిక చేసిన సర్వమును తెలుసుకొనగల్గుట— వడివడిగా పొడుపుగా పెరుగుట, కృశించినరూపము, అకాల మున వెండ్రుకలు నెరియుట,—మూత్రము తెల్లగ లేక పాలవలె నుండి పెక్కుమార్లగుట. రాత్రివేళ యింకను హెచ్చుసార్లు మూత్రమువిడుచుట —నీటివలె గుడగుడలాడుచు తెల్లనివిరే చనములు, విరేచనములగుచున్నను రోగి నీరసింపకుండుట— ఈలక్షణములు కలరోగులకును; దుఃఖము, శారీరమానసికపరి

శ్రమలు, అధికసంభోగము, ముష్టిమైథునము ఇంద్రియస్ఖలనములవలన కల్గువ్యాధులకును; చదువుట, సన్నని కుట్టు మొదలగువానివలన బాలికలలో వచ్చుతలనొప్పి, స్నాయుమండల జననేంద్రియ సం|| వ్యాధులు, మిక్కుటమగు చెమటవలన శారీరకదుర్బలత, రక్తస్రావము, శుక్రమేహము, సంభోగానంతరము వచ్చుబాధలు, బలహీనతవలన ధ్వజభంగము, వెంద్రుకలూడుట, శ్వేతకుసుమలపైనను ఈమందు అమోఘముగ పని చేయును.

< పరసంభాషణ, వెచ్చని ఆహారము.

> వెచ్చదనము, కొలదినిద్ర, కదలిక, నొక్కుట.

పో—చైనా, కాస్టికం, జెల్సు, ఫాస్, ఓపియం.

అ—ఆర్సు, బెల్, కాల్కు-కార్బ్, కాస్టికం, లైకో, పల్సు, సేపియా.

వి—ఆర్నికా, కేంఫ్, కాఫీ, లెకె, నక్సవామ్, స్టాఫిసేగ్రియా.

## 3. Aconite ఎకోనైట్.

[హృదయము, రక్తప్రసరణము.]

వేడి, వాపు, భయము, దాహము, అస్థిమితము—ఇవి ప్రధానలక్షణములు. ఇది పెక్కుజ్వరములలో ప్రథమావస్థయందు పనిచేయును.

1. వేడి దాహము ఆదుర్దా అస్థిమితముతో కూడిన జ్వరము, 2. ఎఱ్ఱనివాపులు, 3. జనసమూహమును చూచుట

వలనను, బయటికిపోవుటకును, చావునుగూర్చియు భయము. రోగి ఫలానాగంటలో చనిపోవుదునని పల్కును. 4. చల్లని నీటిని కోరును పదేపదే త్రాగినను దాహము తీరదు. (5) విశ్రాంతిలేక అటునిటు పొర్లుచు దేహసంబంధముగను మానసికముగను బాధపడును.

ఆకస్మికముగ వ్యాధికల్గుట, భరింపలేనంత బాధలు, శరీరమున నొకయంగము లేనట్లుభావము. మలము పుచ్చకాయనీటివలె నగుట, మూత్రము ఎఱుపు, ఋతువు ఆగుట, రోగిముఖము ఎఱ్ఱగానుండి లేచి కూర్చుండిన పాలిపోయినట్లు కనుపించుట, కప్పుకొనినగుడ్డ త్రోసివేయుచుండుట, నాడి కఠినముగాను వేగముగాను నిండుగాను ఉండుట—ఇవి ఎకోనైట్ రోగిలక్షణములు. N. B. దీనిని రోగికి చెమటపోసిన పిమ్మటను, పెక్కుసార్లును వాడరాదు.

<ఎడమవైపు పరుండుట, వెచ్చనివస్త్రములు, వెచ్చని ప్రదేశము, సాయంత్రము.

>విశ్రాంతి, చెమటపట్టుట, కప్పుకొనకుండుట.

పో—బెల్, బ్రై, కేక్టస్, జెల్సు, లైకో, విరేట్రంవిరిడి.

స—ఆర్నికా, కాఫీ, ఇపెకాక్, సిలికా, స్పాంజి, సల్ఫ.

వి—కెమో, కాఫీ, నక్సువామ్.

## 4. Antimonium Crudum ఆంటిమోనియం క్రూడం.

[జీర్ణావయవములు, నాలుక]

నాలుకపై తెల్లని దట్టమగు పూత. మిక్కుటముగ భుజించుటవలన కలుగువ్యాధులు (రొట్టె మొ॥ కొవ్వుపదార్థ

ములు) ముసలివారిలో మలబద్ధకము కొన్నాళ్లు, నీళ్లవిరేచనములు కొన్నాళ్లు, ఒకదానిపిమ్మటనొకటి కల్గుచుండుట. పిల్లలు కోపము భయము గలవారై తమవంక యెవరు చూచినను ముట్టుకొనినను యేడ్చుస్వభావము కల్గియుండుట. విరేచనమున కొంతభాగము గట్టిగను కొంత నీళ్లగను ఉండుట. జ్వరము రాత్రివేళ హెచ్చుగుట. రోగి తనవ్యాధి చన్నీట స్నానము చేయుటవల్ల ననిగాని, నీటిలో పడితిని అప్పటినుండి యనిగాని చెప్పుచుండుట. ఎండవేడిమి సహింపలేకుండుట. వెన్నెలయందు వ్యాధి ఉద్రేకించుట.

గోళ్లు బీటలుతీయుట, పుప్పిగోళ్లగుట, గోళ్లపై కాయలు, అరికాళ్లలో కంతులు, ఆనికాయలు, నేలమోపిన బాధ కల్గుచు నడుచుటకు కష్టముకల్గుట—చీముమొలలు, వేసవిలోవచ్చు అజీర్ణరోగము, నాలుకపై తెల్లనిపూతగలవారికి గల్గు పెక్కు వ్యాధులకు ఇది ముఖ్యమగుమందు.

< చన్నీళ్లస్నానము, పుల్లనిపానీయములు, భోజనానంతరము వేసవి.

> బహిరంగమైనగాలి, వేడినీటిస్నానము, విశ్రాంతి.

పో—ఆర్సు, కాలీబైక్రో, పల్సు, మెర్కు, సల్ఫ.

స—సల్ఫ అ—పల్సు మెర్కు, సల్ఫ.

వి—బ్రై, కాల్కు-కార్బ, హెపార్, ఇపెకాక్, మెర్కు.

## 5. Antimonium Tart ఆంటిమోనియం టార్టు.

[యకృత్, శ్వాసకోశము, పక్వాశయ సం॥ శ్లేష్మనాడులు.]

రోగి తనఛాతీయంతయు శ్లేష్మముతో నిండియున్నట్లు తలంచును. ఛాతీలో గడగడశబ్ద ముండునుకాని దగ్గినను శ్లేష్మము వెడలదు. నిద్రించుటకును వాంతిచేసుకొనుటకును యత్నించుచుండును. మిక్కిలి బలహీనత చెమట దీనిముఖ్య లక్షణములు. రక్తవహానాడులలో శైత్యముచేరుట, వాంతియైనపిమ్మట రోగి బలహీనతజెంది నిద్రించుట, కుడివైపునతప్ప వేరొకవైపునకు మరలుటవలన వాంతిచేసుకొనుట, తెల్లనిపూతగలనాలుక మధ్యమధ్య యెఱ్ఱనిమచ్చలుండుట, ఎక్కువ చిరచిరలాడు పిల్లలకును ఉపయోగించును.

ఇది కఫమును కరిగించుటలో మిక్కిలి ప్రయోజనకారి. మరియు నిది ముఖము చల్లగాను నీలిరంగుగాను, పాలిపోయి చల్లని చెమటతో కూడియుండి ఊపిరికొరకు పెనగులాడునట్టియు చర్మముపై చీముకురుపులు లేచునట్టియు వారలకు పని చేయును.

<గాలిమార్పు, రాత్రిపరున్నపుడు.

>బహిరంగమైనగాలి, శ్లేష్మము వెడలుటవలన, కుడివైపు పరుండుట, నిబ్బరముగా కూర్చుండుట.

పో—ఎథూజా, బ్రై, ఆంటిక్రూడ్, ఇపెకాక్, హైడ్రాస్టిస్, ఫాస్, విరేట్రంవిరిడి.

స—ఇపెకాక్. అ—పల్సు, సల్ఫ.

వి—ఎసఫ్, కాక్యులస్, ఇపెకాక్, రూస్, సేపియా, ఓపియం.

## 6. Apis ఆపిస్.

[మూత్రావయవములు, మర్మావయవములు, ఆమత్వచలు, ప్రేవులు.]

మంట, కుట్టుచున్నట్లుండు బాధలు, దాహము లేక పోవుట, కనురెప్పలక్రింద ఉబ్బు, తాకిన ఓర్చుకొనలేకపోవుట, చర్మము ఒక్కొక్కప్పుడు మైనపురంగునకు మారుట, బద్ధకము, శరీరమున నేభాగమునందైనను ఎట్టిని వేడివాపులు దీనిముఖ్య లక్షణములు.

వేడియాహారమును భుజించుటచే కల్గిన దోషములను, గొంతులో పుండు. పైత్యపుదాగర, నంజు, ఆకస్మికముగ మోకాలున తెల్లనివాపు కల్గుట, కంటికలకలు, సర్పి, ప్లూరసీ, తలకు నీరుపట్టుట, మధ్యాహ్నము 3 గం. లకు చలిజ్వరము వచ్చుట, గర్భస్రావదోషములు,మూత్రకోశము మూత్రపిండములలో కల్గుబాధలు, మూత్రము అణచిపెట్టబడుట, అండాశయమున కంతులు బయలుదేరుట, ఋతుశూల, ఋతువు అణచిపెట్టబడుట, కాచబింబమువాపు, విషపురుగులు కుట్టుటచే కల్గుబాధలు తగ్గించును.

<వెచ్చనిగది, రాత్రి, నొక్కుట, పరుండుట, కుడివైపు.

>బహిరంగమైనగాలి, చల్లదనము, నడుచుట.

షో—ఆర్నికా, ఆర్సు, బెల్, కేంథార్, హెల్లిబోర్.
స—నేత్రం మూయు. అ—ఆర్సు, గ్రాఫ్, సల్ఫ.
వి—ఇపెకాక్, విడం, ప్లాటినా, చైనా, డిజిట్, అయోడ్ నేత్రం మూరు.

## 7. Argentum Nitricum అర్జెంటుం నైట్రికం.

[కండ్లు, అన్నకోశము, ప్రేవులు.]

యువకులు ముసలివారివలె కనుపించుట, ఎత్తైనగృహములు చూచిన తలతిరుగుట, ఎప్పుడు పంచదార తినగోరుచుండుట, పనులు తొందరగాచేయుట, మంచిగాలిని కోరుట, వెలుతురును స్నేహితులను ద్వేషించుట, రోగభీతి, ఏటేట చిక్కుట, తినినఆహారపురుచితో పెద్దశబ్దము కల్గుత్రేనుపులు, నాలుకకొన ఎఱ్ఱగానుండుట దీనిముఖ్యలక్షణములు.

ఇది నరముల సం॥ వ్యాధులు, మద్యపానమువలని వ్యాధులు, మంచుగడ్డ కలిసిన ఆహారము తినుటవలనివ్యాధులు, మిక్కుటముగ తీపితినుటవలన, అతిసంభోగము, ముష్టిమైథునము, హెచ్చుగా పొగాకు ఉపయోగించుటవలన కల్గువ్యాధులును, అజీర్ణము, అన్నకోశములో పుండు, నీళ్లుత్రాగగనే నీళ్లవిరేచనము లగుట—దృష్టిమాంద్యము, నల్లనిమచ్చలు సర్పములు మండుచున్నవస్తువులు కండ్లయెదుట కనుపించుట, అంతరకుసుమ, పచ్చనిపుసివెలువడు కండ్లకలక, కన్నులెఱ్ఱబడుట వెలుతురు చూడలేకపోవుట, తలవిచ్చునట్లుతోచు తల

నొప్పి, గాయకులబొంగురుతనము పొగత్రాగువారిజలుబు వీటికి మంచిది.

<చల్లనిఆహారము, చల్లగాలి, మానసికపరిశ్రమ.

>త్రేనుపులు, చల్లనినీరు.

పో—అర్జెంటం మెట్, ఆరం, కుప్రం, కాలీబైక్రో.

అ—లైకో.

వి—ఆర్సు, ఆసిడ్ నైట్రిక్, కాఫీ, పల్సు, ప నేట్రం మూరు.

## 8. Arnica ఆర్నికా.

[రక్తము, కీళ్లు, కండరములు.]

మాటలాడుచు మగత జెందుట, నలుగగొట్టి నొప్పులు, పరున్నచోటు మెత్తనిదైనను గట్టిగానున్న భావన, కురుపులు మానుచు లేచుచు విడువకుండుట, త్రే పులువచ్చి వెంటనే నోటినుండి నీరుస్రవించుట, సన్నిపాత మున మలమూత్రములు రోగికి తెలియక వెడలుట, న దుర్వాసన, శరీరమున పైఅవయవములయందు వెచ్చదనవ క్రిందిభాగముల చల్లదనమును పొందుట, చిన్నచిన్న ద గుంపులుగా లేచుట, దెబ్బతగులుటచే కమికినచర్మము, వలన రక్తస్రావము.

మాట్లాడుట, పాడుట, అరచుటవలన కల్గు గొంతు బొంగురుతనము, ఆమవాతము, దెబ్బతగులుటచే కల్గు ప్రతి వ్యాధికిని ఇది దివ్యౌషధము.

దీనిని మర్మావయవమున దెబ్బతగిలినవారికిని ప్రసవించిన వారికిని వెంటనే వాడుచో ధనుర్వాతము, సూతికజ్వరములు రావు.

<పరుండినవైపు, పైను త్రాగుట, విశ్రాంతి.

>తాకుట, కదలుట.

పో—బ్రై, బెలిస్, రూస్, రూటా.

స—ఎకోనైట్.

వి—ఆర్స్, ఎకోనైట్, కాఫీ, కేంఫర్, చైనా, ఇపెకాక్, ఇగ్నేషియా, సెనీగా.

## 9. Arsenic Album ఆర్సెనిక్ ఆల్బం.

[ఇది శరీరములోని ప్రతిఅంగ, యంత్రకోశములపైనను పనిచేయును.]

మంట బాధ రోగము ప్రారంభింపగనే ప్రాణశక్తులు తరుగుట, సొమ్మసిల్లుట, మానసిక అస్థిమితము, కదలలేనంత నీరసము, రోగి యొకచోటనుండక చోటుమార్చుచుండుట, లేక మార్పుగోరుట, చావునుగూర్చినభయము, చల్లనినీరు త్రాగుటకు ప్రబలమైన యిచ్ఛ, కొద్దినీరు త్రాగుటచే కొద్దికాలము రోగ శాంతి, నీరు త్రాగినవెంటనే వాంతి విరేచనములగుట, పగలు రాత్రి 1-2 గంటలమధ్య రోగోద్రేకము కల్గుట,స్రావములు కుళ్లిన

వాసన వేయుట, చెడినఆహారము తినుటవలన విరేచనములు, ఒకేరోగము ప్రతిసంవత్సరము వచ్చుట (మన్యపుజ్వరము, ఉబ్బు), నాడి వడిగానుండుట, కలరాయనిన భయపడుట, రోగము ఆకస్మికముగ ప్రబలముగవచ్చుట, పుల్లనివస్తువులు తినగోరుచుండుట, ఊపిరి అందదనుభయముచే పరుండుటకు భయపడుట, పుండ్లు, రక్తదోషములు, ఉబ్బసము వీనిపై పని చేయును. ఈరోగిబాధలు మంటతో గూడినవైనను వెచ్చదనముచే తగ్గును. శిరోవ్యాధులు మాత్రము చల్లదనమువలన తగ్గును.

<చలి, చల్లనియాహారపానీయములు, పరిశ్రమ, అర్ధ రాత్రి.

>పరుండుట, చీకటిగది, వెచ్చదనము.

పో—ఆసిడ్ మూర్, బాప్టు, కార్బోవెజ్. లెకె, ఫాస్, విరేట్రం ఆల్బం.

స—కార్బోవెజ్, ఫాస్ అ—అయోడ్, నక్సువామ్, సల్ఫు.

వి—చైనా, కార్బోవెజ్, ఇపెకాక్, గ్రాఫ్, లెకె, ఓపియం ప్లంబం, శాంబూకస్, విరేట్రం ఆల్బం.

## 10. Aurum met ఆరం మెట్.

[మనస్సు, మర్మావయవములు, మాంసగ్రంథులు, రక్తము, ఎముకలు.]

ఆత్మహత్య చేసుకొనవలెనను కోరిక ప్రపంచములో తనవలన కలుగు మేలేమియు లేదని తలంపు.

వస్తువుయొక్క క్రిందిభాగమే కనపడుట, (లైకోపోడి యం, లిథియంకార్బులు ఎడమసగము చూడగల్గును.)

చేతివ్రేళ్లకీళ్లసంధులలో చీల్చుచున్నట్లు బాధలు ముఖ్య లక్షణములు.

ఇది రసదోషములకును, సవాయివ్యాధికిని, నరముల వ్యాధులకును బాగుగ పనిచేయును. కోపము భయము విచా రము ప్రేమభంగములవలన కల్గినరోగములు ఆల్కాహాలు పొటాసియం అయోడైడ్ లను సేవించుటచే కల్గురోగములు— ఎముకలు పుచ్చిపోవుట, ఎముకలలో నొప్పులు, గర్భాశయము గట్టిబడుట,వృషణములు వాచుట, గట్టిబడుట, సవాయిబిళ్లలు, అడ్డగఱ్ఱలు, మూత్రము మజ్జిగవలెను చిక్కనిమడ్డితోను వెడ లుట, కామెర్లు, విరేచనబద్ధకము, రాత్రివేళ నీళ్లవిరేచన ములు, ఉదయమున లేచుసరికి పసుపుపచ్చని శ్లేష్మము వెడలుట, దగ్గువచ్చుటను మాన్పును.

<చలిగాలి, చలువచేయుట, మనోవేదన, శీతాకాలము సూర్యోదయము మొదలు సూర్యాస్తమయమువరకు.

>ఉదయము, వేడి, వేసవి.

పో—ఆసిడ్ నైట్, ఆర్సు, ప్లాటినా, ఫాస్, ఎసఫి టిడా.

అ—సింఫైటం.

వి—జెల్, చైనా, కాఫీ, కుప్రం, మెర్కు, పల్సు, సైప్రజీలీయా.

## 11. Baptisia బాప్టీషియా.

[మనస్సు, హృదయము, చర్మము, ప్రేవులు.]

ఇది అన్నిరకములైన సన్నిపాతజ్వరములపైనను పని చేయును. మలము మూత్రము రక్తస్రావము మొ॥ అన్నియు దుర్వాసనతోనుండుట, శరీరము శ్వాసదుర్గంధముగానుండుట, నీరసము, సంధిలోగొణుగుట, క్రిందబడుట, నాలుకపై తెల్లని పూత (మధ్యయెఱ్ఱనిమచ్చలు) గాని గోధుమరంగు (నాలుక వెనుకభాగమున పగుళ్లు పుండ్లు) గాని యుండుట, పొట్టలో గుడగుడలాడుట, మగత, తాను ముక్కలైపోతినని తలంచి ఆముక్కలను చేరదీయుటకు పక్కమీద కదలుచుండుట, శరీరము చితుకగొట్టినట్లు నొప్పిగానుండుట, గుదమున బాధకల్గని అతిసారము, సమాధానమిచ్చుచు నిద్రించుట, సన్నిపాతములో చెవుడువచ్చుట, కడుపునిండుగాను వెచ్చగాను ఉండుట, రక్త దోషములు, పుట్టవ్రణము, మశూచకపుపొక్కులు ఆలస్యముగ బయటికివచ్చుట, రోగికి వెంట్రుకలు కాలినవాసనవేయుచున్నదని చెప్పుట దీనిలక్షణములు. ఈమందు వాడినయెడల జ్వరము సన్నిపాతములోనికి మారదు.

<చలిగాలి, వేసవి, కదలిక, మెలుకువజెందుట.

>విశ్రాంతి.

పో—ఆసిడ్‌మూర్, ఆసిడ్‌ఫాస్, ఆర్నికా, ఆర్సహైడ్రాస్, మెర్కు, రూస్.

అ—క్రోటలస్, హెమామిలిస్, నైట్రిక్ ఆసిడ్, టెర్బెంత్.

## 12. Belladonna బెల్లడోనా.

[మెదడు, శ్వాసాశయము, రక్తము.]

తేమగాలి దగిలిన తలవెండ్రుకలు కత్తిరించినను జలుబు చేయుట, మెదడునకు రక్తము హెచ్చుగా చేరుట, నుదురు వేడి, ముఖము నేత్రములు ఎఱ్ఱబడుట (పరుండిన తెల్లబడును), కాళ్లు చేతులు చల్లబడుట, తలనొప్పి కొంచెము కదలిన వృద్ధియగుట, రోగి కదలుటకు మెదలుటకు ఇష్టపడకుండుట, సంధిలో పిచ్చివానివలె చేష్టలుచేయుట, పారిపోవుటకును కొరుకుటకును కొట్టుటకును సిద్ధపడుట, దయ్యములు భూతములు కుక్కలు తోడేళ్లు (నల్లనిజంతువులు) చూచినట్లు భ్రమపడి భయము చెందుట, పక్కగుడ్డలు పోగుచేయుట, అప్పుడప్పుడు కేకలు వేయుట, అకారణముగ నవ్వుట, పండ్లు పటపట కొరుకుట, ఏస్థానమునందైనను మెరుపు మెరసినట్లు బాధకల్గి తగ్గిపోవుట, (అబ్బాయని కేకవేయగనే తగ్గిన కాలికార్చు) తాకుట సహింపలేకపోవుట, బాలపాపచిన్నెలు, గర్భాశయములోని అవయవములు యోనినుండి క్రిందికి నెట్టుకొనివచ్చుచున్నట్లుండుట, నిద్రమత్తుగానున్నను నిద్రపట్టకపోవుట, చర్మము ఆర్చుకొనిపోయి వెచ్చగా యెఱ్ఱగానుండుట, కప్పినభాగమున చెమర్చుట, దద్దుర్లు, రక్తపుగడ్డలు లేచుట, యివి ముఖ్యలక్షణములు.

ఈరోగినుదురు కప్పుకొనుచుండును. ఈమందు రక్తపు గడ్డలకు వాడిన వాపు వేడి బాధ తగ్గి చీముపట్టక హరించును. ఇది వెఱ్ఱికుక్క కాటుకు మంచిది.

ఈరోగి పుల్లనివస్తువులు కోరునుగాని రుచింపవు. పిల్లలు క్షణము కులాసాగా మరుక్షణము రోగపీడితులుగా నుందురు.

<ధ్వని, రాత్రి, సూర్యుడు, వేసవి, పరుండుట, తాకుట.

>విశ్రాంతి, నిబ్బరముగా కూర్చుండుట లేక నిలుచుండుట, వెచ్చనిగది.

పో—కాల్కుకార్బ, కోనియం, హయోశ్యామ్, స్ట్రెమోన్, విరేట్రం విరిడి.

స—కాల్కుకార్బ.

వి—కేంఫర్, కాఫీ, ఎకోనైట్, ఆసిడ్ఎసెటిక్, హెపార్, హయోశ్యామస్, పల్సు, ఓపియం.

## 13. Bryonia బ్రయోనియా.

[కీళ్లు, శ్వాసకోశము, రక్తము, మస్తావయవములు.]

కదలికవలన రోగమువృద్ధి, నొక్కుటవలన ఉపశమనము, నవరంధ్రములు ఎండుకొనియుండుట (Bry is dry), ఎక్కువ కాలవిరామముతో హెచ్చునీరుత్రాగుట, కుట్టుచున్నట్లు చీల్చుచున్నట్లు బాధలు, స్తనములు బరువుగాతోచుట, ఋతువునకు

బదులు ముక్కునుండిగాని లేక నోటినుండిగాని రక్తము స్రవించుట, సంభోగేచ్ఛ యెప్పుడును కల్గియుండుట, నల్లని దృఢశరీరులవ్యాధులు, కృశించిన సన్ననివారివ్యాధులు, బొగ్గు వలెనల్లనై గట్టిగ పొడిగానుండువిరేచనము. సన్నిపాతప్రారంభ దశ కుడివైపువచ్చురోగములు, నాలుకచేదు, పొడిదగ్గు, దగ్గు నపుడు తనచేతిని ఛాతీపైకి చేర్చుట, దగ్గుటచే తలనొప్పి ఛాతీ నొప్పి కల్గుట, భోజనానంతరము కడుపులో రాయిపెట్టినట్లు బరువు, పసరువాంతి, ఆకలియైనప్పుడు భోజనమైనపిమ్మట తల నొప్పివచ్చుట, ఎక్కిళ్లువచ్చుట, మేహవాతపునొప్పులు, పైత్య లక్షణములు, నెమోనియా, ప్లూరసీవ్యాధులందు సైతము దీని పని యమోఘము.

<కదలిక, దగ్గుట, ఊపిరిపీల్చుట.

>విశ్రాంతి, బాధగానున్నవైపు పరుండుట.

పో—ఆర్నికా, బెల్, సిమిసి, హెపారు, మెర్కు, పోడోపై, రూస్.

స—ఎల్యూమినా, రూస్.

అ—ఎల్యూమినా, కాల్కుకార్బ, నక్సువామ్, రూస్, సల్ఫ.

వి—ఎకోనైట్, కెమో, కేంఫ్, ఇగ్నే, నక్సువామ్ పల్సు సెనీగా.

## 14. Cactus కేక్టస్.

[హృదయము, శుద్ధరక్తనాళములు, తల.]

ఇనపబద్దీతో బిగించి కట్టబడియున్నట్లు బాధతోను హృదయచలనమునకు ఖాళీలేనట్లు కనుబడు హృదయవ్యాధులలో నిది చక్కని పనిచేయును. హృదయము, ఛాతీ, మూత్రపుసంచి, గుదము యోని మొ॥ బిగింపు, నాడినీరసము, గుండెదడ, బాధ, హృదయమునుండి ఎడమచేతిలోనికి ప్రవేశించుట.

తలనొప్పి, అగ్నిమాంద్యము, నరములనొప్పులు మొ॥ వ్యాధులు హృదయవ్యాధికి సంబంధించియుండినను నడినెత్తి బరువు రక్తస్రావము కల్గియున్నను దీనివలన కుదరగలవు.

రోగి చావునుగూర్చి భయపడును. తనవ్యాధి కుదరదని భావించును. ఇవి కేక్టస్ ప్రధానలక్షణములు.

<నడుచుట, ఎడమవైపు పరుండుట, రాత్రివేళ, బహిష్టు దినములు సమీపించిన.

>నొక్కుట.

పో—ఎకోనైట్, బ్రై, బెల్, డిజ్, జెల్సు, సైప్రజీ. విరేట్రం విర్.

స—డిజ్.

వి—ఎకోనైట్, కేంఫ్, చైనా, యూఫ్ పెర్సు.

## 15. Calcarea Carb కాల్కేరియా కార్బ.

[చర్మము, ఎముకలు, నరములు, శ్వాసకోశము.]

నిద్రలో తలకు చెమటపట్టుట, ఆడపిల్లలు త్వరగా పెరుగుట, అధికపరిశ్రమవలన నిస్త్రాణ, శరీరమున కొవ్వు పెరుగు సూచన, కాళ్లు చేతులు తల చల్లగానుండుట, మలము చెమటలు పుల్లనివాసనవేయుట, ఎముకలు సరిగా వృద్ధినొందకపోవుట, మాంసగ్రంధులు గట్టిబడుట, వూసరపొట్ట, అపస్మారలక్షణములు, ఎముకలు పుచ్చుట, శరీరపోషణ తక్కువగుటచే వచ్చు వ్యాధులు, తియ్యని ఉప్పనివస్తువులు. సుద్దమట్టి బొగ్గు మొ॥ తినగోరుట, చర్మవ్యాధులు, పాలవలెనుండుకుసుమ, మధ్యాహ్నము 2గం॥ లకు పొట్టలో చలిబయలుదేరి జ్వరమువచ్చుట, సులభముగా జలుబుచేయుట, చిక్కిపోవుట, దంతములు వచ్చు సమయమున వచ్చువ్యాధులు, నీటిలోనానుటవలన మేహవాతపు నొప్పులు హెచ్చుట దీనిలక్షణములు. శరీరమున కొవ్వు హెచ్చుగాచేరిన(వూబశరీరులు) వారికిని తరుచు శరీరమంతయు చల్లగనుండువారికిని మిక్కిలి పనిచేయును.

< చల్లగాలి, తేమగాలి, చన్నీళ్లు, పౌర్ణమి.

> వేడికాపడములు, వేడిమి, బాధవైపు పరుండుట.

పో—బెరీటా, బెల్, గ్రాఫ్, ప్లాటినా, సేపియా, సిలికా, సల్ఫ, ఎల్యూమినా, చైనా, కాలీకార్బ, తూజా.

స—బెల్.

అ—లైకో, నక్సువామ్, ఫాస్, సిలికా.

వి—ఆసిడ్ నైట్, బ్రై, చైనాసల్ఫ, డిజ్, కేంఫ్, ఇపెకాక్, నక్సువామ్, ఫాస్, సల్ఫ.

## 16. Cantharis కేంథారిస్.

[ఇది మూత్రకోశముపై పనిచేయును]

సహింపరాని మూత్ర వేగము, మూత్ర ద్వారమున మంట, కోయుచున్నట్లు నొప్పి, బొట్లుబొట్లుగా మూత్రము విడుచుట, మూత్రమున రక్తము కలిసి వెడలుట, అధికసంభోగేచ్ఛ, స్వప్నమున రక్తముతో కలిసిన శుక్రము స్ఖలనమగుట, బొట్లు బొట్లుగా మూత్రము విడుచు ఉబ్బసమును ప్రమేహమును తొలగించును.

కాలినబొబ్బలకు దీని మదరుటించరును పైకివ్రాసి 3 పొటెన్సీ లోపలికి వాడిన మంచి పనిచేయును.

<కాఫీత్రాగుట, చన్నీరుత్రాగుట, తాకుట, సమీపించుట, మూత్రమువిడుచుట.

>మర్దించుట.

పో—ఎపిస్, ఆర్సు, కాస్టిక్, మెర్క్, మెర్క్కర్.

స—కేంఫ్.

అ—బెల్, మెర్క్, ఫాస్, పల్సు, సేపియా, సల్ఫ.

వి—ఎకోన్, ఎపిస్, కేంఫ్, కాఫీ, పల్సు.

## 17. Carbo Veg కార్బోవెజ్.

[అన్ని అవయవములమీదను విశేషముగ హృదయము
పక్వాశయము చర్మములపైనను పనిచేయును.]

ఎల్లప్పుడు విసనకఱ్ఱతో విసరమని కోరుట.

మిక్కిలి బలహీనత, జీవశక్తి తరుగుపడినట్లు కనుబడుట, చల్లనియుచ్ఛ్వాసనిశ్వాసములు, క్షీణించి ఆగియాగినడుచునాడి, శరీరమంతటను చెమట, రోగి శవాకృతి దాల్చుట, ముఖము గోళ్లు నీలవర్ణముగ మారుట,కలరారోగములో మలము వాంతి మూత్రము కట్టుబడి పొట్టయుబ్బుట, సన్నిపాతజ్వరముపడి లేచినపుడు కలుగుదౌర్బల్యము, చిగుళ్లనుండి రక్తము స్రవించుట, దంతములు కదలుట, పొట్టయుబ్బుట,(పైభాగం)ఛాతీలో నిప్పుంచినట్లు మంట, రక్తచలనము నిలచిపోవుట, దుర్వాసన స్రావములు, ముక్కువెంట రక్తముకారుట, రక్తస్రావములవలన కల్గినవ్యాధులు, గొంతు బొంగురుతనము. ఉబ్బసము, పుల్లని త్రేనుపులు, అగ్నిమాంద్యము, తనవ్యాధి ఫలానానాటినుండి కలిగినదని చెప్పుచుండుట యిట్టిలక్షణరోగముల కిది యమృత తుల్యము.

<కొవ్వుగలపదార్థములు, క్వైనా, రసము, వెచ్చని తేమగాలి, గట్టిగాపాడుట, చదువుట.

>త్రేనుపులు, విసరుట.

పో—ఆర్సు, కాల్కు-కార్బ, చైనా, కాస్టికం, గ్రాఫ్, లెకె, ఫాస్ఫరూ మెర్కు, యూఫ్ పెర్ఫు.

స—కాలీ కార్బ, చైనా, డ్రోసిరా.

అ—ఆర్సు, బెలె, బ్రై, చైనా, డ్రోసిరా, నక్సువామ్, సేపియా, సల్ఫు.

వి—ఆర్సు, చైనా, కేంఫ్, కాఫీ, ఫెరయెట్, లెకె, మెర్కు.

## 18. Caulophyllum కాలోఫైలం.

[స్త్రీమర్మావయవములు, కీళ్లు.]

స్త్రీల వ్రేళ్లసంధులలో భరింపరానిబాధ, వాపు. (ఈలక్షణము ముఖ్యముగా గర్భవతులందు కనుపించును.) ఒరుపుగలుగునట్టి కుసుమ, ఋతుశూల, అపస్మారము, మేహవాతరోగము, మొదటినెల గర్భస్రావము, గొడ్డుతనము, ప్రసవమున నొప్పులు సక్రమముగా రాక మెల్ల మెల్లగావచ్చుట, దొంగనొప్పులు, అలవాటుగా గర్భస్రావమగుట, అతినిస్త్రాణ గలిగించుకుసుమ వీనికీమందు పాశుపతాస్త్రమువంటిది. దీనిని ప్రసవవేదనలో వాడిన యెడల ప్రసవమునకు పిమ్మట కల్గు అతిరక్తస్రావములు కానివ్వక మావిని సక్రమముగ వెలువరించును.

>బహిరంగమగుగాలి, రాత్రి, కాఫీ.

<అపానవాయువు వెడలినపిమ్మట.

పో—ఎలెక్ట్రిస్ ఫెర్, జెల్సు, పల్సు, సెబీనా.

వి—కాఫీ.

## 19. Causticum కాస్టికం.

[మూత్ర, శ్వాసకోశములు, ముఖము, కండ్లు, నాలుక.]

దగ్గినను తుమ్మినను మూత్ర మప్రయత్నముగా వెడలుట, దగ్గులో శ్లేష్మము వెడలింపలేకపోవుట, మూత్రము ఆపుదలచేయుటచే కల్గు సర్వవిధములగు మూత్రపుసంచివ్యాధులు, పిల్లలును ముసలివారును పక్కలో మూత్రము విడుచుట, ఒక్కొక్కయవయవమునకు వచ్చుపక్షవాతము, గొంతు బొంగురు, కను రెప్ప పడిపోవుట, కంటిలో ఇసుకపోసినట్లుండుట, నిలుచుండిగాని మలవిసర్జనము చేయలేకపోవుట, ఏస్థానముననైనను పచ్చిపుండుపడినట్లు నొప్పి మంట బిగింపు,కడుపులో కాల్చిన గవ్వ యుడుకుచున్నట్లు మంట, గాలి మార్పుకలిగినప్పుడెల్లను నరములబాధ, పిల్లలు త్వరలో నడవలేకపోవుట, చీలమండల బలహీనము, వీనిపై పనిచేయును.

<పరిశుభ్రమైనగాలి, చల్లనిగాలి, చల్లబడుట, తేమ.

>తేమగాలి, వేడి.

పో—ఎకోన్, ఎసఫ్, బెల్, కాఫీ, కార్బోవెజ్, డల్కు, పల్సు, ఫాస్‌నకువాం, సల్ఫు.

స—కార్బోవెజ్, కోలోసింథ్, పెట్రోసిల్.

అ—ఆంటిటార్, నక్సువాం, పల్సు, రూస్టా, సేపియా, సిలికా, సల్ఫు.

వి—ఎసఫ్, చైనా, కోలో, కాఫీ, మెర్కు, నక్సువాం, ఫాస్, ప్లంబం.

## 20. Chamomilla. కెమోమిల్లా.

[నరములు, ప్రేవులు.]

కోపము, చిరచిరలాడుట, బాధలు ఓర్చుకొనలేక పోవుట, పిల్లలు భయపడుచుండుట, పోరుబెట్టి యేడ్చు చుండుట, ఎల్లప్పుడు చంకలోనుండుటకే కోరుట, ఎదోయొక వస్తువును కోరుచు తెచ్చియిచ్చిన త్రోసివేయుచుండుట, మగత జెందుట, ఒకబుగ్గ ఎఱ్ఱగను మరొకటి తెల్లగనుండుట, అతి సారము, శూల, ఆకుపచ్చనివిరేచనము, పక్కనుండిలేచి విశ్రాంతికై అటునిటు తిరుగువారి మేహవాతపునొప్పులు, వేడి, దాహము, పొట్ట గాలిచే పూరింపబడి కల్లుశూల, చర్మము చెమర్చుచు వెచ్చగానుండుట, పిల్లలు నిద్రపోవక పోవుట, కాఫీ వేడినీరు త్రాగుటవలన పంటిపోటు, దంతములు వచ్చు కాలమున కల్లునీళ్లవిరేచనములు, ఋతుశూల, కప్పుకొనినచోట ఎక్కువ చెమటపోయుట, శరీరమంతయు చల్లగనుండి, ముఖము కండ్లు శ్వాస వెచ్చగానుండుట, ఛాతీలోబిగింపు.

<బహిరంగమైనగాలి, సాయంకాలము, త్రేనుపులు, వేడి, కోపము.

>ఎత్తుకొనుట, వెచ్చనితేమగాలి.

పో—ఆంటిక్రూడం, బెల్, ఇపెకాక్, ఇగ్నేషియా, జెల్సెరియం.

స—బెల్, మెగ్ కార్బ.

వి—ఎకోన్, బ్రై, కాఫీ, కోలోసిం, కేంఫ్, హెపార్, ఇగ్నేషియా, నక్సువాం, పల్సు.

## 21. Chelidonium. చెలిడోనియం.

[తల, నరములు, కాలేయము, మలాశయము, చర్మము.]

పసుపుపచ్చని మూత్రము, కన్నులు పచ్చగనగుట, కుడికాలు చల్లగనుండుట, మలము మేకపెంటికలవలె చిన్నచిన్న గట్టియుండలుగా వెడలుట, (ప్లంబం, ఓపియం) కుడి అంసఫలకమున దిగువవైపు లోభాగమున నొప్పి, కుడియూపిరితిత్తిలోను కుడివైపు వ్యాధులలోను పనిచేయును. కాలేయము వాచుట, పచ్చకామెర్లు, పైత్యదోషములు, వేడిపానీయములుతప్ప మిగిలినవన్నియు వాంతిచేసుకొనుట, తలనొప్పి, బుడ్డ, గాలిమార్పువలన కలుగు రోగములు, రోగి మత్తుగానుండుట, పాపపుపని చేసితి ననుకొనుట, మూత్రమున రాళ్లు.

<కుడివైపు, కదలిక, తాకుట, ఉదయము, గాలిమార్పు.

>నొక్కుట. **భోజనానంతరము.**

పో—ఎనకార్డియం, కాల్మియా, కేక్టస్, సైపెజీ, సల్ఫ.

స—బ్రై, లైకో.
వి—ఎకోనైట్, కాఫీ, కెమోమిల్లా, కేంఫర్.

## 22. China చైనా.

[రక్తము, కీళ్లు, మలాశయము, మర్మావయవములు.]

శరీరమున ఏవిధస్రావమువల్లనైనను కల్గిన బలహీనత, రోగము నిర్ణయముచేయబడినట్లు వేళకు వచ్చుట, (సాబడిల్లా, సెడ్రన్) రోజుమార్చి రోజువచ్చుట, నల్లని లేక ముద్దలుముద్ద లుగ రక్తస్రావమగుట, చెవిలో గింగురుమనుధ్వని, పొట్ట గాలిచేనిండుట, త్రేనుపులు వచ్చినను అపానవాయువు వెడలి నను పొట్టలోనిగాలి కొంత తగ్గుట, పండ్లుతినుటవలన కల్గిన నీళ్ల విరేచనములు, తాకిన సహింపలేకపోవుట, వెంద్రుకలు ముట్టు కొనినను నొప్పిగల్గుట, కాలేయము ప్లీహము వాచుట, మన్యపు జ్వరము, రోజువిడిచిరోజు వచ్చుజ్వరము, అతిఆకలి, అధికస్త్రీ ప్రసంగమువలన కల్గునపుంసకత్వము, పాలిపోయినముఖము, లోతునబడినకన్నులు, కన్నులచుట్టు చర్మము నల్లబడుట, బాధ లేని యతిసారము, రక్తక్షీణత, చలివలన దేహము వణుకుట, చలివచ్చుటకు ముందువెనుకల దాహమగుట, నీరుత్రాగిన చలిహెచ్చుట, ఆకలి ఆతురత గుండెదడలుగలిగి పిమ్మట చలి ప్రవేశించుట, వీనిపై పనిచేయును. జబ్బుపడిలేచినవారికి పుష్టి నిచ్చును.

< తాకుట, గాలి, స్రావములు, టీత్రాగుట.
> గట్టిగా నొక్కుట, శరీరము వంచుకొనుట.

పో—ఆర్సు, చైనాసల్ఫు, కాఫీ, హైడ్రాస్, లైకో, సెడ్రన్.

స—ఫెరంమెట్.

అ—ఆర్ని, ఆర్సు, లెకె, మెర్కు.

వి—ఆర్సు, కుప్రం.

## 23. Cicuta Virosa సిక్యూటా విరోసా.

[నరములు, అన్నకోశము, చర్మము.]

విపరీతమైన తెరలు, వెంటవెంటవచ్చు కంపములు, ఫిట్టు లేక కంపముతోకూడిన రోగములు. (అపస్మారము, మూర్ఛ, చిన్నబిడ్డగుణము) రోగి అవయవములు ముడుచుకొనుట చాచుకొనుట, మెడవెన్నెముకలను వెనుకకు విరుచుచుండుట, మూలుగుట, కేకలువేయుట, అవయవములు కంపించుట, దీని ప్రధానలక్షణములు.

పిల్లలకు దంతములు వచ్చుకాలముననుు, నులిపురుగుల వలనను, సూతికాదోషమువలనను, కలుగుకంపములు, ఎక్కిళ్లు, ధనుర్వాతము, పండ్లుకొరుకుట, తల ప్రక్కకు తిరిగి బిగుసుకొనుట, రాత్రివేళ పొట్టకు చెమటపోయుట, తనపేరు మరచిపోవుట, అపానవాయువు వెడలినపిమ్మట తలనొప్పి తగ్గుట, విపరీతమగు కోర్కెలు కోరుట, రాక్షసిబొగ్గు సుద్ద మొ॥ తినుట, మంత్రమువంటి చర్మరోగముల నిది తొలగించును.

<పొగచుట్ట, అదురు, చల్లదనము, తాకుట.

> వెచ్చదనము.

వి—ఎకోనైట్, ఎసారం, హెపార్, సేపియా.

## 24. Cimicifuga Racemosa సిమిసిఫ్యూగా రెసిమోనా.

[మెదడునరములు, కండరములు, గర్భాశయము.]

నాడి దుడుకుగ వడిగనుండుట, ఆత్మహత్య చేసుకొనవలెనని కోర్కె, వెక్కుహాంశములు ఒకటియు పూర్తికాకుండా ఎప్పుడును మాట్లాడుచుండుట, సూతికసంబంధమగు పిచ్చి, మానసికపరిశ్రమచేసినను హెచ్చుగ చదివినను వచ్చుతలనొప్పి, గర్భాశయరోగముతోకూడిన తలనొప్పి, సంభోగానంతరము తలబరువు, నొప్పి ముచ్చిలగుంటలో బయలుదేరి నడినెత్తికి వ్యాపించుట, కనుగుడ్లు పోటు, వెలుతురు చూడలేకపోవుట, తలత్రిప్పు, వమనము, కంపము, కొరుకుచున్నట్లు బాధ, కడుపులోతుకుపోవుచున్నట్లు తోచుట (సేపియా, సల్ఫరు), కొన్నాళ్లు మలబద్ధకము కొన్నాళ్లు నీళ్లవిరేచనములు, విరేచనము పల్చగాను నల్లగానుండుట (లెప్టాండ్రా) అప్రయత్నముగా మూత్రమువిడుచుట, నడుము, మూత్రపిండములు, నొక్కుచున్నట్లు నొప్పిగానుండుట, ఋతువు త్వరగాను స్రావము హెచ్చుగాను నల్లనిముద్దలతోను వెడలుట, లేక **ఋతువు అణచిపెట్టబడుట,** (పల్సటిలా) బహిష్టులో అపస్మారము ఫిట్టు వచ్చుట, ఋతుశూలల, బహిష్టుదోషమునకు సం॥ బహువిధరోగములు, దొంగనొప్పులు, ప్రసవానంతరము గజ్జ

లలోనొప్పులు, 3వ మాసగర్భస్రావము, కష్టపుకాన్పు, జీవము లేని శిశువులుపుట్టుట, స్తనములలో మంట, హృదయములో నొప్పి, దడ, హృదయ మాగిపోయినట్లుండుట, మెడనరము పట్టుట, మెడ నడుము సం॥ మేహవాతపునొప్పులు, కీళ్లసంధులలో వెచ్చదనము వాపుగల్గుట, నిద్రపట్టకపోవుట, (కాఫీ) త్రాయునపుడు వ్రేళ్లు వణుకుట (జెల్సు) నడుము కరుక్కుమను శబ్దము యివి సిమిసిఫ్యూగా రోగలక్షణములు.

<చల్లదనము, ఉదయము, బహిష్టులో.

>వెచ్చదనము, ఆహారము తినినపిమ్మట.

పో—ఎకోనైట్, జెల్సిమియం, ఇగ్నేషియా, సెకేలే.

## 25. Cina సినా.

[ప్రేవులు, అన్నకోశము, మెదడు, మూత్రావయవములు.]

రోగి చిరచిరలాడుచుండును.

ఒకప్పు డతి ఆకలియు, మరొకప్పుడు లేకపోవుటయు, దంతములు పటపట కొరుకుచుండుటయు, ముక్కు, ఆసనము దురదగల్గి గోకుటయు దీనిముఖ్యలక్షణములు.

క్రిముల కిది ప్రధానమగుమందు. క్రిములవలన కలుగు అపస్మారము చిన్నబిడ్డగుణములను మాన్పును. పిల్లలు నిద్రలో యులికిపడుట యేడ్చుట, పాలవంటిమూత్రము వెడలుట, అప్రయత్నముగా మలమూత్రములగుట, పిల్లలు యితరులు తమవంకచూచినపు డేడ్చుట, యెత్తుకొనమని యేడ్చుట, వస్తు

వులు ఇమ్మనికోరుచు ఇచ్చిన పారవేయుట యీపైలక్షణ ములు గలయేవ్యాధినైనను కుదుర్చును.

< వేసవి, సూర్యరశ్మి, క్రిములు.

> కదలిక, బోర్లగిలపరుండుట.

పో—యాగ్నస్‌కేక్టస్, కెనబిస్ ఇండికా, ఇగ్నేషియా, మెర్క్యూరియస్, శాంటోన్, సెలీనియం.

## 26. Cocculus కాక్క్యులస్.

[మెదడు, వెన్నెముక, నరములు.]

రోగప్రారంభమున నడుములో బలహీనతయు, క్రింది అవయవముల బలహీనతయు కనుపడును. తలతిరుగుట, జ్ఞాపక శక్తి లేకపోవుట, అవయవములు లేనట్లు తోచుట, పడవ బండి ప్రయాణములవలన తలత్రిప్పుగల్గుట, సముద్రప్రయాణికుల యాత్రికుల పైత్యవికారము, ఎప్పుడును చదువువారియొక్కయు వ్యభిచారస్త్రీలయొక్కయు శరీరము వ్యాధిగ్రస్తమగుట, ఆకలి లేకపోవుట, రుచింపకపోవుట, కాలక్షేపము త్వరగానగుట (కాలక్షేపము కాకపోయిన అర్జెంటం నైట్రికం) గట్టిగా మాట్లాడలేకపోవుట, ఆహారపురుచి వాసనగిట్టకపోవుట, (కోల్చి కంలో వండుచున్నపదార్థముల వాసనయేగిట్టదు) నిద్రలేక పోవుటచే వ్యాధికల్గుట దీనిలక్షణములు.

<భోజనము, నిద్రలేకపోవుట

> జేర్లబడి కూర్చుండుట, కదలుట.

పో—ఆర్సు, బ్రై, జెల్సు, ఇగ్నేషియా, నక్సువాం.

వి—కాఫీ, కేంఫ్, కెమో, ఇగ్నేషియా, నక్సువాం.

## 27. Colocynthis కోలోసింథిస్.

[నరములు, పొత్తికడుపు, స్త్రీమర్మావయవములు.]

విపరీతముగ పొడుచుచున్నట్లు నరముల సం॥ నొప్పులు శూల పొత్తికడుపులో పుట్టుటచే రోగి పొత్తికడుపును దేనికైనను ఆనించి వత్తుకొనుట, లేదా పొత్తికడుపు ముడతబడి వత్తిడి గల్గునట్లు ముందుకు వంగుట, ఇట్టి శూలతో వాంతులు విరేచనములుండిన నుండవచ్చును, లేకపోవచ్చును. నరముల సంబంధమగునొప్పులు పొట్టయందు లేక ముఖమున కల్గుట, తొంటిశూల, కటిస్నాయువాతము (సయాటికా) ఋతుశూల, ఆహారపానీయములు తీసుకొనినవెంటనే నొప్పితోగూడిన జిగట విరేచనములగుట వీని కిది ప్రసిద్ధమగు మందు.

<సాయంకాలము.

>వత్తుటచే.

పో—బ్రై, కెమో, సిమిసిఫ్, పొడొఫై, మెర్క్యురియం.

స—మెర్కు.

అ—మెర్కు.

వి—కేంఫ్, కాస్టికం, కెమో, కాఫీ.

## 28. Cuprum Met కుప్రం మెట్.

[కండరములు, నరములు, ఊపిరితిత్తులు.]

కంపించుట, బిగుసుకొనుట, కొంగర్లుపోవుట దీనిప్రధాన లక్షణములు.

వడివడిగా కొంగర్లుపోవుట, పేసీలు ముడుచుకొనుట, విస్తరించుట, చేతివ్రేళ్లు కాలివ్రేళ్లు వీనియందు కొంగర్లు ప్రారంభించి శరీరమంతటను వ్యాపించుట, గర్భిణీస్త్రీలలోను ప్రసవించినస్త్రీలలోను కలుగుతెరలు, కొంగర్లు, కలరారోగములో కల్లుకొంగర్లు.

శరీరము చల్లగనుండువారికి, విడిచివిడిచి జ్వరమువచ్చుట, తెరలుతెరలుగా వచ్చుఉబ్బసము, కోరింతదగ్గు వీటిపై దీని ప్రభావ మమోఘము.

<అమావాస్య, రాత్రి, చల్లగాలి, కదలిక.

>చల్లనిపానీయములు, చెమటపట్టుట విరేచనానంతరము

పో—ఆర్సు, బెల్, సిమిసిఫ్, జెల్సు, హామోశ్యాం, నక్సువాం, ప్లంబం, స్ట్రేమో, విరేట్ ఆల్బం.

స—కాల్కు—కార్బ్.

వి—ఆరం, మెర్కు, ఓపియం.

## 29. Digitalis డిజిటాలిస్.

[హృదయము, కాలేయము.]

నాడి నెమ్మదిగను సవిరామముగను కొన్ని దెబ్బలను విడిచిపెట్టుచుండును.

హృదయచలనము వడితగ్గుట, సవిరామముగ నుండుట, సరియైననడకలోనికి రావలెనని ప్రయత్నము చేయుచున్నట్లు కనుబడుట.

హృదయము, నాడి యొకప్పుడు దూకుడుగా నుండ వచ్చునుగాని పైముఖ్యలక్షణములు మాత్రము కనుపించుచునే యుండును.

శరీరపరిశ్రమవలన నూపిరి సల్పకుండుట కాలేయము వాచి పెద్దదై బాధపెట్టుచుండుట, జిగురువలెనుండు తెల్లని విరేచనములగుట, అవయవములకు నీరుపట్టుట, ముఖము నీలిరంగుగానగుట, రోగి కదలిన హృదయచలన మాగిపోవునను భయముతో కదలకయుండుట, (కదలకున్న నాగునని తలంపు జెల్సీమియం) ఈలక్షణములు గలవ్యాధులందు పనిచేయును.

<సంగీతమువినుట, భోజనానంతరము కూర్చుండుట, కదలుట.

> బహిరంగమైనగాలి, నొక్కుట, తరుచు మూత్రము విడుచుట.

పో—ఆర్సు, ఆరం, కేక్టస్, సైకోపన్, విరేట్రం ఆల్బం.

అ—బెల్, బ్రై, కెమో, లైకో, ఫాస్, పల్సు, సెపియా.

వి—ఎపిస్, ఆసిడ్నైట్రిక్, కాల్కు-కార్బ, కేంఫ్, నక్సువాం, ఓపియం.

## 30. Drosera డ్రోసిరా.

[ఊపిరితిత్తులు, రక్తము.]

ఒకానొక ఋతువులో నత్యధికముగ బయలుదేరుదగ్గు కోరింతదగ్గు. కోరింతదగ్గులో తెరలు వెంటవెంట వచ్చుచు ఊపిరిసల్పకుండుట, పరుండగనే ధ్వనితోగూడినదగ్గు బయలు దేరుట, గొంతుకలో పక్షియీకయున్నట్లు తోచుట, గొంతు నొప్పి, కాలికపుదగ్గు, గొంతు బొంగురుతనము, వమనమై దగ్గు తెరతగ్గుట, గ్రంధులు చీముపట్టుటను మాన్పును చర్మవ్యాధి తొలగినపిమ్మట పడినమచ్చను చర్మముయొక్క రంగులోనికి మార్చును.

< పడకవేడిమి, త్రాగుట, నవ్వుట.

> గోకుకొనుట, నడచుట, కదలిక.

పో—కుప్రం, జెల్సు, ఇపెకాక్, శాంబూకస్, స్పాంజియా.

స—నక్సువాం.

అ—కాల్కు-కార్బ, కోనియం, సల్ఫ

## 31. Dulcamara డల్కామరా.

[చర్మము, రక్తము, శ్వాసావయవములు.]

ఏవ్యాధియైనను వేడిగానున్నసమయమున వర్షము కురియుటచే గాలి చల్లగా మారి వీచుటచేగాని మిక్కిలి తేమగాలి సోకుటచేగాని పగలు ఎండ రాత్రి వర్షముకురియు దినములలోగాని కలుగువ్యాధులు

జలుబు, నరములబాధలు, మేహవాతపు నొప్పులు, దగ్గు, అతిసారము, తలనొప్పి, మెడనరముబిగింపు, చల్లనిపానీయములు మిక్కుటముగకోరుట, బొడ్డువద్ద కోయుచున్నట్లుబాధ, రసదోషములు.

<చల్లనితేమగాలి, రాత్రి.

>అటునిటు తిరుగుట, ఉష్ణోపచారము.

పో—సిమిసిఫ్, హెపార్, పల్సు, రూస్టా, సల్ఫు.

స—బెరీటాకార్బ.

వి—బెల్, బ్రై, కేంఫ్, కుప్రం, ఇపెక్, మెర్కు, రూస్టా.

## 32. Eupatorium Perf యూపటోరియంపెర్ఫ.

[ఎముకలు, కండరములు, రక్తము.]

అధికమైన యెముకలనొప్పులు, శరీరమంతయు చితకగొట్టినట్లు నొప్పి, కీళ్లు తొలగినట్లు తోచుట, జ్వరములో చలికి ముందు వెనుకల ఎముకలోనొప్పులు, చలి ఉదయం 7 గంll లు

మొదలు 9 గం॥లవరకుండుట, చలివచ్చుటకు ముందుగను చలి వేయుచున్నప్పుడును దాహము కల్గుట, ఎముకలు పగిలినట్లు బాధతోకూడిన జ్వరము, రోగికి చెమట తక్కువగానుండి స్థిమితములేకుండుట, (చెమట హెచ్చు స్థిమితము, బ్రయోనియా) పై లక్షణములతో వచ్చు మన్యపుజ్వరము, డింగీజ్వరము, ఇన్ ఫ్లూయంజాజ్వరము మొదలగువాటిలోను నడుమునొప్పి కాలేయమువద్ద నొప్పులకును ముఖ్యమైనమందు.

<వెల్లగిలపరుండుట, బహిరంగపుగాలి, నియమిత కాలము.

>ప్రస్తావించుట, ముడుచుకొని కూర్చుండుట.

పో—చెలిడోనియం, కోల్చికం, లైకో, పోడోఫైలం.

అ—నేత్రంమూరు, సేపియా.

## 33. Ferrum Met ఫెరం మెట్.

[రక్తము, అన్నకోశము, ప్రేవులు, నరములు]

రక్తక్షీణము, పెదవులు ముఖము తెల్లబడుట, శరీరము పాలిపోవుట, కొద్దిబాధలవలనగాని, కొద్దిపరిశ్రమవలనగాని, ఆందోళనమువలనగాని ముఖ మెఱ్ఱబడుట, ముఖముపై వేడి గాలివీచుచున్నట్లు తోచుట, నుదుట యెక్కువరక్తము చేరుటచే కర్ణరంధ్రము లుబ్బుట.

తలనొప్పి, అత్యధికమగు ఎఱ్ఱని లేక నీటివంటి రక్త స్రావములు, నీటివలె ఋతువు వెడలుట, అతిఆకలి లేక ఆకలిలేక పోవుట, (చైనా) పొట్టలో గుడగుడత్రేనుపులు, పగలుతినిన

యాహారము పగలంతయు జీర్ణముకాక నిలువయుండి రాత్రి వమనమగుట, అజీర్తివిరేచనములు, వాపు, మంటలతో కూడిన బాధలు, నాడి దుడుకుగానుండుట, చలివేయుసమయమున ముఖమెఱ్ఱబడుట, కాళ్లు చల్లగనగుట, దగ్గినపిమ్మట ఆహారము వాంతియగుట, మూత్రమునకు వెళ్లినపుడు మలము కూడ వెడలుట, పగలు మిక్కుటమగు దగ్గు, ఊపిరి పీల్చుటకు బాధగనుండుట దీనిలక్షణములు. దీనివాడుకచే రక్తవృద్ధియగును.

N. B. ఉదయము దీనిని సాయంత్రము ఫాస్ఫరసును వాడిన నిక్కాక శరీరరోగములన్నియును తగ్గును. (వేడి, జ్వరము) వగైరా.

<స్థిమితముగా కూర్చుండుట, చెమటపట్టుట, అర్ధరాత్రి.

>నెమ్మదిగా అటునిటు నడుచుట.

పూ—బోరాక్సు, గ్రాఫ్, రూమెక్సు, జింకం.

స—ఎల్యూమిన్, చైనా, హెమామిలిస్.

అ—ఎకోనైట్, బెల్, చైనా, కోనియం, మెర్కు, ఫాస్.

వి—ఆర్సు, అయోడియం, మెర్కు, టీ.

## 34. Gelsemium జెల్సీమియం.

[నరములు, కండరములు, రక్తము.]

కొద్దినిస్త్రాణ, బలహీనత, మగత, బద్ధకము, చేతులు దేహము వణకుట, కండరములలో నీరసము, దీని ముఖ్య లక్షణములు.

ఈరోగి వణుకుట కండరములనీరసముననేగాని వణికించు నంతటి చలికల్గి కాదు. సామాన్యజ్వరము, జ్వరములో కొద్ది దాహము, చలి వీపునుండి బయలుదేరి పైయవయవములకు ప్రాకుచు శరీరమంతయు బాధ,అతితుమ్ములు,నిప్పువద్దకూర్చుండ వలె ననుకోర్కె ఈలక్షణములు గల యిన్‌ఫ్లూయంజా జ్వరము. కనుబొమ్మలలో నొప్పిప్రారంభించి చెవిలోనికి ముక్కులోనికి వ్యాపించుట, వేసవికాలమున పట్టుపడిశెములు, వీణ వాయించువారికిని వ్రాతగాండ్రకును చేతులు వణకుట, ఒక్కొక్క అవయవమునకు పక్షవాతమువచ్చుట, నరములబల హీనత, విరామజ్వరము, వేణుదండమున దుష్టనీరుచేరుట, కంటి రెప్పలు పక్షవాతముచెందుట, సన్నిపాతజ్వరసూచనలు.

< తేమగాలి, దుర్వార్త, పొగత్రాగుట, బాధలను తలచుకొనుట.

> ముందుకు వంగుట, బహిరంగమైనగాలి, ఎక్కువ మూత్ర విసర్జనము.

పో—ఎకోనైట్, బెల్, కాస్టికం, ఇపెకాక్, ఓపియం, స్ట్రేమో, విరేట్రంవిరిడి.

అ—బాప్టీషియా, కేక్టస్, ఇపెకాక్.

వి—చైనా, కాఫీ, డిజ్, మెగ్నీషియా, ఫాస్.

## 35. Hemamelis హెమామెలిస్.

[రక్తవాహినీ సిరలపై పనిచేయును]

శరీరములోనేయవయవముయొక్క సిరనుండి రక్తము స్రవించినను అది అమోఘముగా పనిచేయును. చర్మమునందు శ్లేష్మనాడులయందు రక్తముచేరుట, సిరలలో మంట, సిరలుబ్బుట, సిరలయందు తేలుకుట్టినట్లు బాధ, రోగస్థానమున మర్దించుచున్నట్లుబాధ, సంధులలోను మాంసపేశీలలోను కల్లువాతము, గాయములు, దెబ్బలు వీటియందు కల్లు ఎఱ్ఱని లేక నల్లని రక్తస్రావములు దీనిముఖ్యలక్షణములు.

దీనిమూలార్కమును పైనపూయుటవలన రక్తస్రావము కట్టును.

<వెచ్చనిగాలి, తేమగాలి, తాకుట, పరిశ్రమ, కదలిక, మధ్యాహ్నము.

>బహిరంగమైనగాలి, సాయంకాలము.

పో—ఎలోస్ఆర్నికా, బ్రై, కాల్కుఫ్లోరు, ఇపెక్, పల్సుసెబీనా.

స—ఫెరంమెట్.

వి—ఆర్నికా, చైనా, కేంఫర్, పల్సటిల్లా.

## 36. Hepar Sulph హెపార్ సల్ఫ్.

[చర్మము, గ్రంధులు, రక్తము, శ్వాసకోశము]

అనేకవిధములైన చర్మరోగములు వ్రణములు గ్రంధులలో బాధ, మంటలెక్కువగుట, చల్లగాలిని భరింపలేకపోవుట, గుడ్డకప్పుకొనవలెననుకోర్కె, సులభముగా పడిసెము పట్టుట, స్పర్శను భరింపలేకపోవుట, పులుపువస్తువులు తినగోరుట, అనారోగ్యమైనచర్మము, కొద్దిగాగోకినను చీముపట్టుట, దీర్ఘకాలమునుండి నిలువయున్న జలుబు, ముక్కులు బిగించినపుడు ఇంటిలోనుండి వెలుపలికి వచ్చిన హాయి చిక్కుట, దగ్గినపుడు కొద్దికళ్లె వెడలుట, ఊపిరిసల్పకుండుట, తేమగాలిలో నుపమించు ఉబ్బసము, పుల్లనివస్తువులుకోరువారి యగ్నిమాంద్యము, మూత్రము నాపలేకపోవుట, మూత్రము వెడలించుటకు కష్టపడుట, గోరుచుట్లు వీనియందు పనిచేయును. ఇది తక్కువపవరులో వాడిన చీము పుట్టించును, హెచ్చుపవరులో హరించును.

< చల్లనిపొడిగాలి, చల్లగాలి, తాకుట, ఉదయము, రాత్రి, పాదరసము.

> తేమగాలి, వెచ్చదనము, భోజనము.

పో—డల్కె, మిరిస్టికా, స్పాంజియా, సల్ఫ్.

స—బెల్, బ్రై, కేలెండ్యులా, లెకె, మెర్కు, సిలికా, అయోడ్.

వి—ఆసిడ్ నైట్రిక్, మెర్కు.

## 37. Hyosyamus హాయాశ్యామస్.

[మెదడునరములు వీనిపై పనిచేయును.]

అనుమానము, ప్రలాపము, దగ్గరనున్నవారిని కొట్టవలెనని కోయవలెనని యత్నించుట, అరచుట, కేకలువేయుట, లేనివస్తువులు కంటిముందు నిలచియున్నట్లు పల్కుచు భయపడుట, తీవ్రకోపము, అతివాగుడు, బలహీనతవలన ప్రలాపము తగ్గిపోవుచు మరలకల్గుచుండుట, మాటిమాటికి మగతజెందుట, మెల్లమెల్లగా గొణుగుచుండుట, ప్రశ్నలకు సరియైనజవాబివ్వకపోవుట, కంఠము ముఖము ముడుచుకొనిపోవుట, కట్టుకొనిన వస్త్రమును తీసివేసి దిగంబరియై యుండుట, స్మృతి తప్పుట, ఎవ్వరిని నమ్మకపోవుట, దంతములకు మిక్కిలి పాచి పట్టుట, నాలుక తడియారుట, రోగికి మలమూత్రములగుట తెలియకపోవుట, పక్కగుడ్డతో ముక్కును నోరును తుడుచుకొనుచుండుట, తెరలు, శరీరకంపము, రాత్రివేళ పొడిదగ్గు వచ్చుట దీనిలక్షణములు. ఇది క్రొత్తగా పిచ్చిపట్టి సిగ్గువిడిచి మాట్లాడుట, మాటిమాటికి దిగంబరియగుట, గుహ్యేంద్రియముపై చెయ్యిపెట్టుకొనుట యీలక్షణములు గలవారికి మిక్కిలి మేలుచేయును.

< రాత్రి, ఋతుస్రావసమయము, భోజనమైనపిమ్మట, నిద్రించుటవలన.

> నిబ్బరముగా కూర్చుండుట, వాంతియైనపిమ్మట.

పో—బ్రై, బెల్, జెల్సు, హెల్లిబోర్, ఇగ్నేష్, ఓపియం, ఫాస్, స్ట్రెమో, విరేట్రం విర్.

అ—బెల్, పల్సు, స్ట్రెమో, విరేట్రం ఆల్బం.

వి—బెల్, కేంఫ్, చైనా, మెర్క్యు, ప్లంబం, స్ట్రెమో.

## 38. Ignatia ఇగ్నేషియా.

[మెదడు, నరములు, జీర్ణావయవములు.]

జ్వరములో దాహము వేయును, వేడివల్ల చలితగ్గును, రోగి జ్వరము తగిలిన కప్పుకొనగోరును, గొంతులోనికి ఉండ వచ్చుచున్నట్లుండి గుటకవేసిన తగ్గును. గొంతులో బంతి యున్నట్లు భావన, అంతులేనిదుఃఖము, మనస్తాపము, మిక్కుటముగా నవ్వుట, అంతలో నవ్వు అంతలో ఏడ్పు వచ్చువారి హిస్టీరియారోగము, శరీరము అదురుట, తలలోనికి మేకు దిగ గొట్టినట్లు తలనొప్పి, గుదము బయటికి పొడుచుకొనివచ్చుట, మలము విడుచునప్పుడు కల్గుచుండుబాధకు వెరపుజెందుట, చల్ల గాలితగిలిన వచ్చు కటిస్నాయువాతము, కడుపు ఖాళీగానున్నట్లు తోచుట, భోజనమువలన సంతృప్తి లేకపోవుట, ఘనపదార్థములు తినుట సులభముగను, ద్రవపదార్థములు మ్రింగుటకు కష్టముగ నుండుట, గవదకాయలపై పుండ్లుపడుట, పొగాకు వాసనవలనను త్రాగుటవలనను రోగోద్రేకము కల్గుట, ప్లేగు, వెక్కిళ్లు వీనిపై చక్కగ పనిచేయును.

< కాఫీ, తీపి, వాసన, వెచ్చదనము, శీతలము, నిలుచుండుట, తాకుట, వంగుట.

> వేసవి, విశ్రాంతి, చలి, నొక్కుట, పరుండుట, కూర్చుండుట.

పో—సిమిసి, జెల్సి. హయోశ్యామ్, లెకె, నక్సువాం, స్ట్రమో.

స—నేట్రం మూరు.

అ—ఆర్సు, బెల్, లైకో, రూస్టా, సిలికా, సెపియా, సల్ఫ.

వి—ఆర్నికా, పల్సు, సెలీనియం, జింకం, బ్రాంది, టీ, పొగాకు.

## 39. Iodium అయోడియం.

[మాంసగ్రంథులు, (థైరాయిడ్, మెసంటిక్ లమీదముఖ్యము) చర్మము, జీర్ణావయవములు, శ్వాసాశయములు.]

అతి ఆకలి, పెక్కుమార్లు మిక్కుటముగ తినుచుండినను చిక్కిపోవుట, స్తన్యగ్రంథులు తప్ప మిగిలినవన్నియు వాచుట, (స్తన్యగ్రంథివాపు-ఫైటోలక్కా) ఈరోగి ఆదుర్దా విచారము కల్గియుండును. త్వరితముగ కదలుటకు, ఏదియో చేయుటకు, ఎవరినైనను చంపుటకు కోరుచుండును. రక్తము వేడిగనుండు, చిక్కిపోవుచుండును. తాను ఆలోచించుకొనుటకు పనిచేసుకొనుటకు తిరుగుటకు చల్లనిగది కావలెనని కోరును. శరీర

మంతటను నాడియొక్క చలనము కంటికే కనుపించుచుండును. (బెల్.) హృదయము ఇనుపహస్తముతో చిక్కబట్టిన ట్లుండును. నల్లనిశరీరము నల్లనివెంద్రుకలు గలవారికి కల్లు గండమాలరోగము, చీమువళ్లు గలవారు మేడమెట్లెక్కునపుడు శ్వాసయాగిపోవుట బలహీనముజెందుట.

యోనినుండి యధికరక్తస్రావము, యోనియందు వ్రణము, చాలకాలమునుండి నిలువయున్న కుసుమ, కుసుమ యధికముగ నగుట, కుసుమ గుడ్డలకు సోకిన గుడ్డలు చిల్లులుపడుట.

ఈలవేసినట్లు, రంపపుకోత కోయుచున్నట్లు ధ్వనితో (స్పాంజియా) శ్లేష్మపుతరకలు వెడలు కింకవాయిదగ్గు లేక పొడి దగ్గు—దగ్గునపుడు పిల్లలు గొంతుక పట్టుకొనుట, నల్లబడు చుండుట యీలక్షణములతో కూడిన లోకాక, క్షయ, అతి మూత్రము, పీనస, వాసన తెలుసుకొనలేకపోవుట, కంఠరోహిణి, న్యూమోనియా, మేహవాతపునొప్పులు, కుసుమ, ప్రాస్టేటు గ్రంధివాపు (లంజదుంప) మొదలగువ్యాధులపై పనిచేయును.

అయోడియమును గ్రంధులు వాచినపుడు పైకివ్రాయుట యర్థములేని యపాయకరమగు చికిత్సాపద్ధతియని డా॥ ఇబినాష్ నుడివెను.

< నిశ్శబ్దము, నొక్కుట, వెచ్చనిగది, కుడివైపు, కదలిక, పరిశ్రమ, తాకుట, తేమగాలి.

> నిబ్బరముగా కూర్చుండుట, భోజనము, పరుండుట, చల్లనిపాలు త్రాగుట, బహిరంగమైనగాలి.

పో—బెల్, లెకె, సెలీనియం, శాంగ్వినేరియా.

స—లైకో, బేడియాగా.

వి—ఆర్సు, యాపిస్, బెల్, చైనా, కాఫీ, కేంఫ్, హెపార్, మెర్కు, ఫాస్, సల్ఫు.

## 40. Ipocacuanha ఇపెకాక్.

**వికారము. వమనము** నాలుక పరిశుభ్రముగనుండుట, పొట్ట వ్రేలాడుచున్నట్లుండుట, తలయెముకలలో నొప్పులు, పండ్లలోనికి నాలుక మొదటికి వ్యాపించుట, ఒకకంటిపైభాగమున నొప్పి, ఊపిరితిత్తులలో శ్లేష్మము నిండియున్నట్లు ధ్వనితోగూడిన పొడిదగ్గు, ఉబ్బసము, కోరింతదగ్గు, అజీర్ణపదార్థములు తినిన పిమ్మట వమనము, (జీర్ణముకాక ముందైనచో పల్సటిల్లా) జిగటవిరేచనములు, ఆకుపచ్చని విరేచనములు, రక్తస్రావములు.

వడుమునొప్పి, కొంద్దిచలి, దాహము, వేడి, తలనొప్పి, వికారము, జ్వరమువిడుచువేళకు చెమటపోయుట యీలక్షణములు గల చలిజ్వరముపైనను పనిచేయును. ఇది చలిజ్వరములకు క్వైనాకంటె చాలమంచిది అధికముగా క్వైనావాడుటచే కల్గిన దుర్గుణముల తగ్గించును.

< శీతగాలి, పొడిగాలి, వెచ్చనితేమగాలి, వెచ్చనిగది, వమనము, దగ్గుట, భుజించుట, తాకుట.

> త్రాగుట, విశ్రాంతి, చన్నీళ్లు.

పో—ఆర్సు, కెమో, ఫెరంమెట్, హైడ్రాస్, లొబీ
లియా, పల్సు, విరేట్రం ఆల్బం, విరేట్రం విర్.

స—ఆర్నికా, కుప్రం.

అ—ఆంటి టార్, యాపిస్, బెల్ త్రై, కేక్టస్.

వి—యాపిస్, ఎల్యూమిన్, ఆర్నికా, కుప్రం, చైనా,
డల్కం.

## 41. Iris ver ఐరిస్ వెర్.

[జీర్ణావయవములు, థైరాయిడ్ గ్రంథి, ప్రేవులలోని మాంస గ్రంథులు వృక్వకము.]

నోరు నాలుక గొంతు ఆహారనాళముమంట, అతిసార విరేచనములలో గుదమునమంట, నోటినుండి భూమివరకు దారములవలె త్రాళ్లవలె తీగలుసాగు శ్లేష్మముకక్కుకొనుట, చొంగకారుట, పుల్లని లేక చేదురుచిగల వాంతులు, వికారముతో కూడిన తలనొప్పి, తలనొప్పి మామూలుగానుండువారి విరేచనబద్ధకము, పైత్యశూల వాంతులతో కూడియుండుట, కుసుమ, వేవిళ్లు, ఒకచోటినుండి మరొకచోటికి మారుచుండు నొప్పులు, కటిస్నాయువాతము (జాలునొప్పి) మంత్రపుహొక్కులు రాత్రివేళ దురదగల్గుట వీటిని మాన్పును.

< విశ్రాంతి, చల్లనిగాలి, వెచ్చనిగది, అతికదలిక.

> కొద్దికదలిక, వెనుకకు వంగుట, బహిరంగమగుగాలి.

పో—ఎలోస్, ఆర్సు, బ్రై, ఇపెకాక్, పోడోఫైలం, సల్ఫ.

వి—మెర్కు, నక్సువాం, ఫైటోలక్కా.

## 42. Kali Bichromicum కాలీ బైక్రోమికం.

[శ్వాసకోశము, జీర్ణకోశము, మర్మావయవములు, ముక్కు, నోరు.]

చిక్కని జిగురువంటి స్రావము తీగవలె సాగుచు వెలువడుట, (హైడ్రాస్టిస్) జీర్ణకోశరోగము మేహవాతరోగములు ఒకటి తగ్గిన నొకటి మొదలిడుట, ఒకప్పుడు మేహవాతరోగము మరొకప్పుడు జిగటవిరేచనములు కల్గుట, బహిరంగమగు గాలిచే జలుబుచేయుట, తలనొప్పివచ్చుటకుముందు చూపు మధ్యమగుట, నొప్పికల్గిన చూడగల్గుట, ముక్కు నోరు వీటిలో పుండ్లు, కండ్లు నాలుక చర్మము పసుపువర్ణముగా నగుట, శీతము వలన వృద్ధియగు మేహవాతపునొప్పులు, స్థూలశరీరుల మేహవాతపునొప్పులు, ఏబాధలైనను ఆకస్మికముగ వచ్చి వెంటనే మాయమగుట, బీరుత్రాగువారిలో కల్గు అగ్నిమాంద్యము, శరీరమున మిక్కుటముగ క్రొవ్వు చేరుటచే కల్గువ్యాధులు, బ్రోంకాయిటిస్, ఉబ్బసము, జలుబు, కంటినుండి పచ్చనిపుసి వెడలుట, శరీరమున నేభాగమందేని వ్రేలుమోపినంతస్థలమున కల్గునొప్పి, ముఖము ఉబ్బరించుట, గొంతుపుండు, కంఠరోహిణి, పుండ్లు గుండ్రముగా లోతుగా నగుట, పొట్టలో బరువుగా నుండుట-గాలిపోసుకొనుట దీనిలక్షణములు.

< వేసవి, వెచ్చనిగది, దుస్తులనుతీసివేయుట, ఉదయము.

> కప్పుకొనుట, వెచ్చదనము, కదలిక, భోజనానంతరము.

పో—ఆసిడ్ నైట్రిక్, హెపార్, హైడ్రాస్, మెర్క్యు, ఫైటోలక్కా, స్పాంజి, కాస్టికం.

స—ఆర్స్.

అ—ఆంటిటార్, బెర్ బెరిస్ వల్, పల్స.

వి—మెర్క్యు.

## 43. Lachesis లెకెసిస్.

[స్త్రీమర్మావయవములు, చర్మము, కండరములు.]

రోగలక్షణములు ఎడమవైపు ప్రారంభించి కుడివైపునకు వచ్చును. రోగికంఠముచుట్టును నడుముచుట్టును ధరించియుండు గుడ్డలను వదులుచేసుకొనును. నిద్రనుండి లేచునపుడు బాధలుద్రేకించునుగాన నిద్రించుటకే భయపడును. ఎండలో తిరుగుటవలన తలనొప్పివచ్చును. చెవిరంధ్రములనిండను గుబిలి చేరును. పుండ్లు వ్రణములు ఊదారంగుగా మారును. ముట్లుడిగినకాలమున రోగములు వచ్చును. చెమట వెచ్చగనుండును. త్రాగుబోతులలో శరీరకంపము, భగందరము ఈలక్షణములన్నియు లెకెసిస్ వాడదగినరోగియందు కనుపించును.

< మత్తుమందులు, రసదోషము, నిద్ర లేచినప్పుడు, ఉదయము, చలిగాలి.

>భోజనముచేయుచున్నపుడు, ఋతువు అగుచున్నపుడు, బట్ట వదులుచేసుకొనుటవలన.

షా—ఆర్సు, బెల్, బాప్టీషియా, ఆంత్రసైనం, ఫెర్రోజీనియం, పల్సు, ఫాస్ఫారికాసిడ్.

స—హెపార్.

అ—ఆసిడ్ ఫాస్, కేక్టస్, కాష్టికం, నేట్రం మూరు.

వి—క్రోటేలస్, రూస్టాక్సు.

## 44. Lycopodium లైకోపోడియం.

[పురుషమర్మావయవములు, జీర్ణకోశము.]

జ్ఞాపకశక్తితగ్గుట, మాటలు పొరబడుట, పెక్కువిషయములు కలగలుపుగా మాట్లాడుట, వ్యాధులు కుడివైపున ప్రారంభించి యెడమవైపునకు చేరుట, మిక్కుటమగు ఆకలియుండియు కొద్దిముద్దలు తినినవెంటనే పొట్ట నిండుట, పొట్టయుబ్బరముగానుండి యెడమవైపున నధికముగా గుడగుడలాడుచు అపానవాయువులు హెచ్చుగా వెడలుచు నటులవెడలుటవలన బాధ యుపశమించుట. మూత్రమున నెఱ్ఱని గసియుండుట, మూత్రము విడిచినపిమ్మట నడుము మూత్రకోశము నొప్పిగానుండుట.రోగియొక్క పైయవయవములుచిక్కి క్రిందివియుబ్బుట, శరీరమున కండరములు తక్కువగానున్నను తెలివి హెచ్చుగానుండుట, వయస్సుకంటె ముదురుగా కనుపించుట, అకాలమున వెండ్రుకలు నెరయుట, ఒకకాలువెచ్చగ మరొకటి

చల్లగనుండుట, ఎదురుమాటచెప్పిన సహింపలేకపోవుట, తీపి పదార్థములు తిన్న వెనుక హెచ్చుదాహము, దేహమున నెడమ భాగమున 3-4 గంటలమధ్య చలివేయుట (carbo veg), చలి మధ్య పుల్లని వమనము, చలి తగ్గినవెంటనే చెమటపోయుట, చెమట తగ్గగనే దాహమగుట, పుల్లని త్రేనుపులు, పుల్లనిరుచి, పుల్లని వమనములు, పురుషాంగము చల్లబడి నీరసించి ముడుచుకొని లేపనశక్తిలేక పోవుట, స్త్రీని కౌగలించుకొని వెంటనే నిద్రించుట, శీఘ్రస్ఖలనము, నపుంసకత్వము, ముష్టిమైథునము వలన కలుగు వ్యాధులు. క్రిమిదోషములు, చర్మముదురద, నెమోనియావ్యాధిలో శ్లేష్మము హెచ్చుగా వెడలుట, వస్తువులు కుడివైపుసగముమాత్రమే కనుపించుట (coeulus) పిల్లలు పగలంతయు నేడ్చి రాత్రి నిద్రించుట, (సోరినం దీనికి వ్యతిరేకం) పంటిసలుపు ఉష్ణోపచారమున తగ్గుట, కుడివైపు వరిబీజము, పిల్లలు మలమూత్రములు విడుచుటకుముందు ఏడ్చుట, యోని యార్చుకొనిపోయి సంభోగమునందును తరువాతను మంటగానుండుట దీనిలక్షణములు

< సాయంకాలము 4-8గం॥ నిద్రించినపిదప చల్లని పానీయములు.

> కదలిక, అర్ధరాత్రికి పిమ్మట వెచ్చనియాహారపానీయములు, వెల్లగిల పరుండుట.

పో—ఆంటిటార్టు, ఆర్సు, బాప్టీ, బెలిడోన్, కార్బొవెజ్, హైడ్రాస్, మెర్కు, సల్ఫ.

స—గ్రాప్, అయోడ్, లెకె.
అ—ఎనకార్డియం, బెల్, బ్రై, నక్సువాం, పల్సు.
వి—చైనా.

## 45. Mercurius మెర్క్యూరియస్.

[జీర్ణావయవములు, మర్మావయవములు.]

దంతములు చిగుళ్లు ఉబ్బుట, దానినుండి రక్తముకారుట (చిగురు తినివేయబడుచు రక్తము కారుచున్న—మెర్క్యూరియస్ వివస్) నాలుక లావుపారుట, చొంగ కారుట, పాలిపోయిన ముఖము, ముఖము పొంగరింపు, మిక్కిలి దాహము, శ్లేష్మము వంటి యుప్ప నిలాలాజలము, నోరు శ్వాస మిక్కిలి దుర్గంధముగా నుండుట, నాలుకమీద నెట్టనిరంగుపుండ్లు, తెల్లనిపూత, దంతములయందు చీల్చుచున్నట్లు గ్రుచ్చుచున్నట్లు బాధ కల్గుట, ముఖమునుండి చెవివరకు నీబాధ వ్యాపించుట. మిక్కిలి చెమటపట్టుట, చెమటపట్టినను బాధ లుపశమింపకపోవుట. రక్తగ్రహణి, కడుపులో మెలిబెట్టినట్లు నొప్పి (మెర్కు-కర్.), మలము విడుచునప్పుడును తరువాతను అపానవాయువు వెడలుట. శ్వేతప్రదరముతో గూడినయోనిలో మంట, దురద పుండు కల్గు స్రావము వెడలుట, సంభోగశక్తి నశించుట, అంగముమీద పొక్కులు (మెత్తని కొరుకు, కొరాలియం, వంచలు గట్టిగా నుండుకొరుకు మెర్కు-ప్రోటో అయోడైడ్) శెగలో స్రావము చిక్కగా ఆకుపచ్చగా పసుపుపచ్చగా వెడలుట, రాగిరంగువంటి

రంగుతో గుండ్రటి మచ్చలు చర్మముపై నేర్పడుట, సవాయి సంబంధమగు పుండ్లు, ఎముకలవ్యాధులు, రాత్రియం దుద్రేకించుట, కుడియూపిరితిత్తి యడుగుననుండి బాధ వెన్నునకు పోడుచుచుండుట. స్రావములన్నియు మొదట పల్చగనుండి క్రమముగ చిక్కబడుట (పల్సటిల్లా) ఈలక్షణములు గల వ్యాధులందును, సవాయివ్యాధియొక్క ప్రథమ ద్వితీయావస్థలయందును పనిచేయును. ఇది తక్కువ పవరులో వాడుటచే చీము పుట్టును. హెచ్చు పవరులో వాడిన చీమును హరించును.

< రాత్రి, పడకవేడిమి, చల్లగాలి, చెమట, కుడివైపు పరుండుట.

> ఎడమవైపున రుండుట.

పో—ఆంటిటార్, బెల్, తూజా, సిలికా, సల్ఫు

అ—బెల్, చైనా, డల్కు, ఆసిడ్ నైట్రిక్, సల్ఫ.

వి—ఆంటిక్రూడం, ఆర్సు.

## 46. Natrum Mur నేట్రం మూరు.

పాలిపోవుట, చిక్కిపోవుట, రక్తక్షీణతవలన పనిపాటలు చేయుటకు ఇష్టములేకపోవుట, పుష్టికరమగు భోజనపదార్థములు తినుచున్నను కృశింపుజెందుచుండుట, సరియైన ఆకలి గల్గియుండుట.

సుత్తితో తల బద్దలుకొట్టినట్లు తలనొప్పి, స్వల్పమగు రజస్సు వెడలినను మిక్కిలి దుర్బలత, ఇతరులు చూచి జాలిపడు

నట్టి రూపు కల్గుట, ఏడ్పుస్వభావము ఓదార్చినకొలది హెచ్చు దుఃఖము కల్గుట. మూత్ర మప్రయత్నముగ నగుట, మనస్సు స్థిమితము లేకపోవుట, పురుషాంగము దుర్బలతజెందుటవలన సంభోగసమయమున శుక్రము స్ఖలనము కాకపోవుట. విడిచి విడిచివచ్చుజ్వరములో పెదవిపై ముత్యములవంటి మచ్చలు ఏర్పడుట, చలిజ్వరమున చలివచ్చుటకు ముందు వెనుకల దాహము, (జ్వరములోనుండదు) దౌడలాడించినపుడు చెవిలో ధ్వని గల్గుట, వ్రేలాడుగోళ్లు, అతిపుసికారు కండ్లకలక, కను రెప్ప లెత్తినను నొప్పిగల్గుట, భోజనముచేసినవెంటనే గుండెలో మంట కల్గుట, ఉదయము తల పగులుచున్నట్లు తలనొప్పితో 10-11 గంటలకు మధ్య జ్వరము తగులుట నేత్రంమూరులక్షణ ములు. ఈరోగి కూరలలో ఉప్పు హెచ్చుగా వేయమనికోరును. గొంతులో బంతి పెట్టినట్లుండి ఘనపదార్థములు మ్రింగుటకు కష్టముగనుండి ద్రవపదార్థములు సులభముగ మ్రింగుచుండును.

< ఉదయము, శీతగాలి, సముద్రపుటొడ్డు, సూర్యరశ్మి.

> బహిరంగమైనగాలి, సాయంకాలము, ఉపవాసము, కూర్చుండుట.

పో—ఫాస్ఫరస్.

స—యాపిస్, బ్రై, హెపార్, పల్సు, సేపియా.

అ—సేపియా, తూజా.

వి—యాపిస్, కైనా.

## 47. Nux Vomica నక్సు వామికా.

[జీర్ణావయవములు, మలాశయము, నరములు.]

పట్టుదల, జాగ్రత్త, ద్వేషము, అస్థిమితము, కోపము, కంగారు ఈలక్షణములు కల్గియుండుట.

అతిచురుకు, కొద్దివిషయమునకే నొచ్చుకొనుట, కొద్ది ధ్వనికే యులికిపడుట, తనకు సరిపడుమందైనను వికటించుట, వాసనలవలన స్మృతితప్పి పడిపోవుట. శరీరమున కొద్దిభాగ మదురుట, తెరలు, కొంకర్లు తాకిన వృద్ధియగుట, జ్వరము హెచ్చుగా నుండినను చలివేయుట, ముఖమెఱ్ఱబడుట, కప్పుకొనినగుడ్డ కొంచెము తొలగినను చలివేయుట. నరముల కుత్తేజమిచ్చు మందులు పేటెంటుమందులు. విరేచనముగావించుమందులు నల్లమందు చేర్చబడినమందులు మిక్కుటముగా సేవించుటచే కల్గువ్యాధులు. వ్యభిచారపురుషులవ్యాధులు (స్త్రీలకు-కాక్యులస్) తరుచు విరేచనానుమానము కల్గుట, విరేచనము పూర్తిగ వెడలకపోవుట, కొద్దికొద్దిగానగుట, చక్కగ విరేచనమైన హాయిగనుండుట. సహింపలేకపోవుట, నరములనిస్త్రాణ, చలి, చిరచిరలాడుట, ఆదుర్దా, ఆత్మహాత్యచేసుకొనవలెననుయూహా (కాని చావుకు భయపడును.) సాయంకాలము నిద్రమత్తు, వేకువజామున 3-4 గంటలకు నిద్ర మెలుకువ కల్గి మరల నిద్ర పట్టక (1, 2 గంటలు నిద్రపట్టకయుండి) పిమ్మట నిద్రపట్టి యుదయమున నాలస్యముగా లేచుట, నిద్ర లేచినపుడు అలసట బల

హీనత రోగోద్రేకము జెందుట పొట్టలో భోజనమైన యొకటి రెండుగంటలకు రాయిపెట్టినట్లు బాధ గల్గుట, (వెంటనే కల్గిన కాలీబై క్రోమికం, నక్సువోమికా ) ఫిట్టు వచ్చి పడియున్నను చుట్టుపట్ల జరుగునది సర్వమును గ్రహించుశక్తి కల్గియుండుట. (స్టిచిన్నం).

కొన్నాళ్లు మలబద్ధకము, కొన్నాళ్లు నీళ్లవిరేచనములు, ఋతువుదినములు జరుగకమునుపే బహిష్టయగుట, హెచ్చుగా నగుట, స్నానముచేసినతరువాత పెక్కుదినములవరకగు చుండుట, అట్లు ఋతువగుచున్నదినములలో వ్యాధు లుద్రేకించుట.

కాఫీ టీ ఆల్కహాలు హెచ్చుగా సేవించుటచే కల్గు వ్యాధులు, దురభ్యాసములు కలవారికి కల్గువ్యాధులు, త్రాగుడు వల్లను పైత్యమువల్లను కల్గు తలనొప్పులు, ఆకలిలేకపోవుట, అగ్నిమాంద్యము, పైత్యము, కాలేయముచెడుట, విరోచన మెన్నడును సరిగా కాకుండుట, తినికి తినికి మలవిసర్జనచేయుట, మొలలు, నడుమునొప్పి, ప్రత్యూదయము నరములబాధలు, వరిబీజము, లేపనశక్తి నశించుట, ప్రసవవేదనలో బాధలు మెల్లగావచ్చుచు మలద్వారములోనికి జొచ్చుచుండి తేపతేపకు విరేచనానుమానము కల్గుట ఈరోగలక్షణములపై పని చేయును.

< వెచ్చనిగది, ఉదయం, తెల్లవారగట్ల 3-4 గం॥ భోజనము.

>పరుండుట, బహిరంగమైనగాలి, తాకుట, నొక్కుట, తోముట.

హా—ఎసఫ్, బ్రై, కాక్యులస్, కెమో, ఇగ్నే, హైడ్రాస్, మోస్కస్, ఓపియం, పల్సు, సిలికా.

స—సేపియా, సల్ఫ, అ-బ్రై, పల్సు.

వి—ఎకోనై, ఆర్సు, బెల్, కేంఫ్, కాఫీ, కెమో, పల్సు, జింకం. జింకంమెట్ దీనికి ముందువెనుకల వాడ రాదు.

## 48. Opium ఓపియం.

[ఆంత్రములు, నరములు.]

రోగి మగతగాలేక నిద్రమత్తుగా నుండుట, ఏయౌషధము వాడినను పనిచేయకుండుట, బాధలేమియు కనుపడకుండుట, నీతిబాహ్యత, అసత్యవాదిత్వస్వభావము. మలము గట్టిగాను నల్లగా నుండవలెనుండి కష్టముమీద వెడలుట, నల్లని దుర్వాసనగల నీటివిరేచనములు, అవయవములు చల్లబడుట, మొద్దుబారుట. నోటివెంట మలపుముద్దలుపడుట. భయపడుట. మగతగానున్నను నిద్రపట్టకపోవుట. శబ్దము కడుదూరమందైనను వినబడుట, (గడియారపుగంటలు, కోడికూత) కండ్లు సగము మూతబడియుండుట, నోరుతెరచి గుఱ్ఱుపట్టుట, దగ్గిన చెమటపోయుట, పక్క వేడిగానుండి చల్లనిప్రదేశముకొరకు అటునిటు కదలుచుండుట, కప్పుకొనుట కిష్టపడకుండుట, ముసలివారి విరేచనబద్ధకము, రుద్రవాతము.

<నిద్రలోను, నిద్రకు పిమ్మటను, ఉద్రేకపదార్థముల వలన గర్భిణిలో, భయమువలన.

>చల్లగాలి, నడుచుట, వమనానంతరము.

పో—బెల్, జెల్సు, హయోస్, స్ట్రమో.

అ—ఎకోనై, ఆంటిటార్, బెల్, బ్రై, నక్సువాం.

వి—ఆంటిటార్, బెల్, లెకెసిస్.

## 49. Phosphorus ఫాస్ఫరస్.

[నరములు, కన్నులు, స్త్రీమర్మావయవములు.]

రోగి పొడవుగా పల్చగా నుండును. సన్నని ఛాతీ గల్గి క్షయరోగచిహ్నములతో నుండును. ముఖము పాలిపోయి గాని పచ్చబారిగాని యుండి నూనెగారుచుండును. ఆదుర్దా, విశ్రాంతి లేకుండును. విశ్రాంతిగా కూర్చుండుటకుగాని నిలుచుండుటకుగాని శక్తిలేకుండును. చీకటిగదిలోను ఉరుములతో గూడిన గాలివానయందును, ఒంటరిగానుండుటకును భయపడును. చల్లనివస్తువులను కోరును. చల్లనినీరు త్రాగిన ఆనీరు కడుపులో చేరి యుష్ణమును పొందగనే వాంతియగును. ఐస్ క్రీమ్ మాత్రము వెళ్లిపోదు. పెక్కుమార్లు భోజనము చేయుచుండును. ఆకలియై యర్థరాత్రి భోజనముచేయుటకు నిద్రనుండిలేచును. తినకున్న శోషవచ్చును. తల రొమ్ము పొట్టపొత్తికడుపు ఖాళీయైనట్లు తోచును. దగ్గు సంధ్యాసమయమున ప్రారంభించి అర్థరాత్రివర కుండును. దగ్గు ఎడమవైపు

పరుండిన హెచ్చును, కుడివైపు పరుండిన తగ్గును. నీళ్లవిరేచన ములు సగ్గుబియ్యపుజావవలె పంపునుండి నీరుకారున ట్లగు చుండును గ్రహణివిరేచనములు, నోటిపూత, రక్తస్రావ ములు, స్వరపేటికనొప్పి, వెచ్చనిగదినుండి చల్లనిగాలిలోనికి వెళ్లిన దగ్గు హెచ్చును. నవ్వుట మాట్లాడుట చదువుట భోజ నముచేయుటలవలన దగ్గువచ్చును. మెత్తగా పొడువుగా లేక ఎండుకొని కుక్కపెంటికలవలె కష్టముమీద మలమువెడలును. నోరు పొట్ట చిన్నప్రేవులు గుదము వేణుదండము అరచేతులు చేతులు వీటియందు మంట, మంట చేతులలో ప్రారంభించి ముఖమునకు ప్రాకును.

<తాకుట, కదలుట, బాధగనున్నవైపు పరుండుట.

>చల్లనియాహారము, విశ్రాంతి, బహిరంగపుగాలి.

పో—ఎకోన్, యాపిస్, ఆసిడ్‌పాస్, ఆసిడ్‌నైట్, బెల్, బ్రై.

స—ఎల్లియంసేపా, ఆర్స, అ–ఆర్స, కార్బొవెజ్, రూస్టా.

వి—కేంఫ్, అయోడ్, టెరిబెంత్.

## 50. Podophyllum పోడోపైలం.

[జీర్ణావయవములు, గర్భాశయము, కాలేయము.]

ఇది యుదరవ్యాధికి ప్రధానమైనది. దుర్వాసనగల మలము, శరీరమందలి జలమంతయు పోవుచున్నదా యని భయ ముకల్గునంత విరేచనము, విరేచనమైన మరుక్షణముననే పొట్ట

పరుండిన హెచ్చును, కుడివైపు పరుండిన తగ్గును. నీళ్లవిరేచనములు సగ్గుబియ్యపుజావవలె పంపునుండి నీరుకారునట్లగుచుండును గ్రహణివిరేచనములు, నోటిపూత, రక్తస్రావములు, స్వరపేటికనొప్పి, వెచ్చనిగదినుండి చల్లనిగాలిలోనికి వెల్లిన దగ్గు హెచ్చును. నవ్వుట మాట్లాడుట చదువుట భోజనముచేయుటలవలన దగ్గువచ్చును. మెత్తగా పొడువుగా లేక ఎండుకొని కుక్కపెంటికలవలె కష్టముమీాద మలమువెడలును. నోరు పొట్ట చిన్నప్రేవులు గుదము వేణుదండము అరచేతులు చేతులు వీటియందు మంట, మంట చేతులలో ప్రారంభించి ముఖమునకు ప్రాకును.

<తాకుట, కదలుట, బాధగనున్నవైపు పరుండుట.

>చల్లనియాహారము, విశ్రాంతి, బహిరంగపుగాలి.

పో—ఎకోన్, యాపిస్, ఆసిడ్ పాస్, ఆసిడ్ నైట్, బెల్, బ్రై.

స—ఎల్లియంసేపా, ఆర్స, అ–ఆర్స, కార్బోవెజ్, రూస్టా.

వి—కేంఫ్, అయోడ్, టెరిబెంత్.

## 50. Podophyllum పోడోపైలం.

[జీర్ణావయవములు, గర్భాశయము, కాలేయము.]

ఇది యుదరవ్యాధికి ప్రధానమైనది. దుర్వాసనగల మలము, శరీరమందలి జలమంతయు పోవుచున్నదా యని భయముకల్గునంత విరేచనము, విరేచనమైన మరుక్షణముననే పొట్ట

మలముతో నిండి గుడగుడధ్వని కలుగ ప్రారంభించును. ప్రాతః కాలమున 9 గంటలనుండి యుదరవ్యాధి ప్రారంభించి క్రమముగా 10 గంటలకు పిమ్మట వృద్ధినొందును. సాయంకాలము 3 గంటలకు స్వాభావికమైన మలము వెడలును. ఈరోగిమలము పచ్చగానుండి నీటివలె హెచ్చుపరిమాణములో నగును. అప్పుడప్పుడు గుదము బయటికి పొడుచుకొని వచ్చుచుండును.

రోగి నేత్రములు సగము మాత్రము తెరువబడియుండును. తల దిండుపైనుంచుకొని యిటునటు కదల్చుచుండును. గొనుగుచుండును. దంతములను బిగ్గబట్టుచుండును.

పలుమారు తేమలుచుండునుకాని వాంతికాదు. పగలు 9 గంటలకు జ్వరము తగులును. జ్వరము వచ్చుటకు ముందు కాళ్లుచేతులు నడుములలో నొప్పి కల్గును.

రోగి అసంబద్ధముగ ప్రలాపించుచు కొంతసేపటికి నిద్రించును. నిద్రించినపుడు హెచ్చుగ చెమట పట్టును. (శాంబూకస్ దీనికివ్యతిరేకము) నిద్ర లేచినపిమ్మట తాను మాట్లాడిన విషయములు చెప్పలేకపోవును. ప్రసవించినపిమ్మట గర్భాశయము తన స్వస్థానమునుండి తొలగును. కుడిడింబకోశమున నొప్పి కల్గును. రోగికి స్వస్థత లేనట్లు కనుబడును.

< వేడిగాలి, తెల్లవారగట్ల, దంతములు వచ్చుకాలము.

> తోముట, నొక్కుట.

షో—ఎలోన్, ఆసిడ్ నైట్, బ్రై, చెలిడోన్, క్రోటన్‌టిగ్, మెర్కు, నక్సువాం, పల్సు, సల్ఫు విరేట్రం ఆల్బం.

వి— మెర్క్యూరియస్.

## 51. Pulsatilla పల్సటిల్లా.

[జీర్ణకోశము, మలకోశము, గర్భాశయములపై పనిచేయును.]

ఇది స్త్రీలఋతుబద్ధవ్యాధులను రూపుమాపును. చంచల చిత్తము, అస్వస్థత, శ్లేష్మతత్వము, నల్లని వెంద్రుకలు, నీలివర్ణపు కండ్లు, పచ్చని శరీరము, స్వాభావికముగ నవ్వుట యేడ్చుట, ప్రేమగలవారినిగూర్చి భయము, వినయస్వభావము గలరోగిణికి ముఖ్యమైనమందు సహజముగ యేడ్పుస్వభావము, ఋతుస్రావము కొద్దికొద్దిగ పెక్కుదినములవర కగుచుండుట, ప్రథమ రజస్వల యాలస్యముగ నగుట, ఋతుశూల, ఋతువు ఆగి యాగియగుచుండుట, రోగలక్షణములు మాటిమాటికి మారు చుండుట, నొప్పులు క్షణక్షణము చోటుమార్చి వచ్చుచుండుట, నాలుకయెండియున్నను దాహము లేకుండుట, నేయి నూనెలతో చేయబడిన పిండివంటలను గురుపదార్థములను తినుటవల్ల కల్గిన జీర్ణకోశవ్యాధులు, కలరా, మలముయొక్క రంగు తేపతేపకు మారుచుండుట—నింబుపసుపు ఆకుపసుపువర్ణముగా నుండు కఫము, చలి, శ్వేతకుసుమ, ప్రమేహము, శ్లేష్మము, చీము స్రవించుట, కఫముయొక్క రుచి కారముగనుండుట, వాసనచూచు

శ_క్తినశించుట, కాళ్లు తడియుటచే కల్గువ్యాధులు, ఏదియు రుచింపకపోవుట, తడపరకుపిమ్మట కల్గుదుర్గుణములు, కీళ్ల యందలి మహావాతపునొప్పులు వీటికి ప్రధానమైనది. పల్సటిల్లారోగము నకు తలతోక తెలియుట కష్టము. ఇది క్వైనాకును లోహమున కును విరుగుడు. తడపరకు నిరోధకౌషధము.

<తాకుట, సూర్యరశ్మి, గాలిమార్పు.

>చల్లదనము, నెమ్మదిగానడుచుట.

పో—సిమిసి, కోనియం, కాలోపైలం, హైడ్రాస్, యూఫ్రేషి, హెమామిల్, ప్లాటినా.

స—లైకో.

వి—చైనా, సల్ఫు.

## 52. Rhus Tox రూస్టాక్సు.

చర్మము, శ్లేష్మనాళములు, కండరములు వాతతత్వము గల రోగులవ్యాధులపైనను పనిచేయును. ఉద్వేగము, అస్థిమితము దీని ప్రధానలక్షణములు. కండరములలో నొప్పి,పుండు పడినట్లు నొప్పి, అటునిటు మాటిమాటికి కదలుచుండుట, కదలుటచే బాధలు తగ్గుచుండుట, మాటలాడక కూర్చుండుటవలన స్థిమితములేకపోవుట, నడుచుటకు మొదటకష్టముగనుండి కదలినకొలది సుఖముగ నుండుట, జ్వరములో మగత, కొద్ది ప్రలాపము, ఎండుకొని పాచిపట్టిననాలుక, నాలుకచివర యెఱ్ఱని త్రికోణాకారపుగుర్తు, మాటిమాటికి పొర్లుచుండుట,

స్మృతిలేనిస్థితిలో కూడ ప్రశ్నకు సరియైనజవా బిచ్చుట, చర్మముమీాద ఎఱ్ఱని దద్దుర్లు మంత్రపుపొక్కులు బయలు దేరుట, సన్నిపాతదోషము, జ్వరముయొక్క ప్రారంభమున కాంతిహీనుడై యుండుట, తెలియకుండగనే విరేచనమగుట, మాంసపుకడుగునీళ్లవంటి విరేచనమగుట, ప్రతివ్యాధిలోను వాతపునొప్పులు కల్గుట, చలిగాలిలోను స్థిరముగాను కూర్చుండి నను రోగము వృద్ధియగుట, వేడిగాలిలోను శరీరము గుడ్డతో కప్పినప్పుడును వేడికాపడమువలనను తగ్గుట, చల్లగాలివలన తలనొప్పివచ్చుట, నమలునప్పుడు శబ్దము కల్గుచు దౌడలు నొప్పిగానుండుట దీనిలక్షణములు.

< లేచుట, వంగుట, తాకుట, విశ్రాంతి.

> వెచ్చదనము, కదలిక.

పో—ఆర్నికా, ఆర్సు, బాప్టీషి, బ్రై, పల్సు, సల్ఫ.

వి—బ్రై, బెల్, కేంఫ్, కాఫీ, రోడోడాండ్రన్.

## 53. Sanguinaria శాంగ్వినేరియా.

[శ్వాసాశయములు, ఆమత్వచలు.]

తలనొప్పి యుదయమున ప్రారంభించి యస్తమయ ముతో తగ్గుట, కుడివైపువచ్చుట, ప్రతి 7 వదినమును వచ్చుట, ముచ్చిలిగుంటలో ప్రారంభించి తలకు వ్యాపించి కుడికంటి పైభాగమున నిల్చి బాధించుట.

అరిచేతులు అరికాళ్లుమంటలు, శరీరమున తరుచు వేడి తగులుచుండుట, ఛాతీకి తలకు రక్తమెక్కువ చేరుట, ముక్కులో కాయలు బయలుదేరుట, క్షయరోగలక్షణములు, శరీరమంత టను మంట, దగ్గులో వెడలుశ్లేష్మ మాకస్మికముగ నాగి నీళ్ల విరేచనము లగుట, ముట్లుడుగుకాలమున వచ్చురోగములు మంటలతోకూడియుండుట, అతిదాహము వికారము వమనము, మంట పసుపుకాంతి—నిలువగానుండుశెగ సవాయివ్యాధులు, రోగికి 2 రాత్రిళ్లు స్వప్నస్ఖలనమై రోగము తగ్గుట, దుర్వా సన, ఒరుపుగల్లు కుసుమ, అతిఋతుస్రావము, స్తనములలో నొప్పి, అజీర్ణముతో గూడిన యుబ్బసము, కుడివైపువచ్చు నర ములబాధలు, మేహవాతపునొప్పులకు మంచిమందు.

<వెలుతురు, ఉదయము లేచుసరికి, తాకుట, నొక్కుట.

>పుల్లనివస్తువులు తినుట, నిద్ర, చీకటి, వేడినీటి స్నానము.

పో—కాలీబై క్రోమికం, సోరినం.

స—ఆంటిమోనియంటార్టు.

ఇది నల్లమందు రూస్టాక్సుదోషములను విరుచును.

## 54. Secale సెకేలే.

[స్త్రీ మర్మావయవములు.]

రక్తస్రావముల కిది మంచిమందు. నల్లని దుర్గంధయుత మగు రక్తస్రావము, సాధారణగాయములనుండి కూడ పెక్కు

దినములవరకు మిక్కిలి రక్తము స్రవించుచుండుట, స్రావమగు నపుడు శరీరమంతయు చల్లబడుట, నీరసము, కొంకర్లుపోవుట, కొంచెము కదలినను స్రావ మధికమగుట దీని ముఖ్యలక్షణములు.

మర్మావయవముఖము విస్తరించుట, కండరములబిగి తగ్గియుండి క్రమములేక నెమ్మదినెమ్మదిగా వచ్చునొప్పులతో ప్రసవ మాలస్యమగుట, చేతులు కాళ్లు కంపించుట, ప్రసవమైన పిమ్మట కల్గు అతిరక్తస్రావము, 3 వ 4 వ నెలలలో కల్గు గర్భస్రావసూచనలు.

శరీరమంతయు చల్లబడియున్నను రోగి తాపముచే బాధపడుచు గుడ్డ కప్పుకొనలేకపోవుట.

శరీరము మొద్దుబారియుండుట, పురుగులు ప్రాకుచున్నట్లు తోచుట, చర్మము కంటిచుట్టును ఊదారంగుగా మారుట, కలరా ప్రథమావస్థ, గోధుమవర్ణముగను దుర్వాసనగనుండు కుసుమ వెడలుట.

<వెచ్చదనము, వేడి, కప్పుకొనుట.

>చల్లదనము, కప్పుకొనకుండుట, తోముట.

పో—కార్బోవెజ్, కోల్చికం, ప్లంబం, సెబీనా.

అ—ఎకోనై, ఆర్స్, చైనా, పల్స్.

వి—కేంఫ్, ఓపియం, స్పాంజియా.

## 55. Sepia సేపియా

[మర్మావయవములపై పనిచేయును.]

కుటుంబమునం దయిష్టము, స్త్రీలలోకల్లు కాన్పునొప్పుల వంటినొప్పులు, బాధలు దిగువనుండి పైవైపుకు వ్యాపించుట, లోపలియవయవములలో బంతి యున్నట్లు భావన, వెచ్చనిగది యందు చలిగానుండుట, గర్భాశయము జారుట, పుల్లనివాసన వేయు పచ్చనికుసుమ, బాధలన్నియు వెచ్చదనముచే తగ్గుట, బహిష్టు హెచ్చుతగ్గులుగా నగుట, పిల్లలు మొదటినిద్రలో తెలియక మూత్రము విడుచుట, గ్లీటు, ముక్కుపై నడ్డముగా పచ్చనిమచ్చ యేర్పడుట, కాలికమగుజలుబు, పొట్ట ఖాళీయై నట్లు భావనకల్గి సొమ్మసిల్లుట, గుదమునుండి నీరు స్రవించుట, గుదములో పెద్దరాయియున్నట్లు బరువు, మోకాళ్లమడతల లోను కాలేయముపైనను మచ్చలేర్పడుట, తామర చిరుగుడు కాళ్లపై పొట్టురాలునట్టి చర్మవ్యాధి, కొద్దికొద్దిచోట్ల దురద పొక్కులు సంభవించుట, చంకలు పాదములు చెమర్చుచుండు వారి తలనొప్పి, పుల్లనివస్తువులు కోరుచుండువారి యగ్ని మాంద్యము, నోటిచుట్టును చర్మము పచ్చబడుట, గర్భవతుల పంటినొప్పి, ఎముకలు పుచ్చుట, తలవెండ్రుకలు రాలుచుండుట దీనిలక్షణములు.

< తాకుట, నిలుచుండుట, మానసికపరిశ్రమ, నిద్రకు పిదప.

> వేసవి, వెచ్చదనము.

పో—ఆర్సు, బ్రై, సిమిసి, జెల్సు, పోడో, ఫై, ప్లాటినం, పల్సు.

స—నేట్రం మూరు, నక్సువామికా, సెబీనా.

వి—ఎకోన్, ఆంటిటార్, కాల్కకార్బ, చైనా, లెకె, పల్సుఫాస్, రూస్టాక్సు, మెర్కు.

## 56. Silicea సైలీషియా.

[ఎముకలు, తల,మర్మావయవములు,అన్నకోశము,మలకోశము.]

పిల్లలు నిద్రించునపుడు తలకు చెమటపోయుట, తల యెముకలు కలవకపోవుట, ఆహారము పుష్టినివ్వకపోవుట, కుండవలె పొట్ట పెద్దదగుట, గాయమునకు చీముపట్టుట, శరీరము చల్లగానుండుట, చల్లదనమును భరింపలేకపోవుట, ఎప్పుడును వెచ్చనిగుడ్డచే కాళ్లనుదురు కప్పియుంచుట, కాళ్లకు దుర్వాసనగల చెమటపోయుట, సామాన్యమగుదాహము, కొద్దిచల్లగాలి తగులగనే చెమట యింకుట, మలబద్ధకము, మలము వెడలించుటకు మిక్కుటముగ ముక్కుట, మలపు యుండలు కొంతవరకు వచ్చి మరల లోపలికేగుట.

రోగియొక్క శరీరమున తగినంతవేడి లేకపోవుట, నరములబలహీనత, సులభముగా జలుబుచేయుట, చెమటలు లోనికింకుటచే కల్గువ్యాధులు, చాలకాలమునుండి బాధించు

చున్న తలనొప్పి, చిగుళ్లలో లేచుకురుపులు, భగందరము, కటిరోగములు, ఊపిరితిత్తులలోని పుండ్లు, టీకాలవలన కల్గిన పుండ్లు ఇతరవ్యాధులు, వెన్నెముకబాధలు వీనికి ప్రశస్తమైన మందు.

ఇది తక్కువ పొటెన్సీలో చీమును పుట్టించును. హెచ్చు పొటెన్సీలో చీమును హరించును.

<అమావాస్య, కదలిక, పరుండుట, బహిరంగపుగాలి.

> వెచ్చదనము, వేసవి.

పో—ఆర్నికా, ఆసిడ్ ఫాస్, కాల్కు-కార్బ, హెపార్, ఫాస్, పల్సు, రూటా, రూస్టాక్సు, సేపియా.

స—కాల్కు-కార్బ, పల్సు, శానిక్యులా, తూజా.

అ—హెపార్, లెకె, నక్సువా, ఫాస్, రూస్టా, టొబాకం.

వి—మెర్కు, సల్ఫ.

## 57. Spigelia స్పైజీలియా.

[ఆసనము, జీర్ణకోశము, నరములు, హృదయము, కండ్లు.]

ఇది హృదయరోగమునకు మంచి మందు. హృదయము కపాలము దంతములు వీనియందు శూల గల్గుట, నొప్పితో కూడిన గుండెదడ, గుండె కొట్టుకొనుట, గుడ్డ కప్పుకొనినను పైకి కనుపడును. కొద్దిదూరమువరకు గుండె కొట్టుకొనుట వినిపించును.

కన్నులలోని నరములనొప్పి, నొప్పివలన కన్నులు కదలించలేకపోవుట, కనుగ్రుడ్లవెనుక నొప్పి.

ముఖమున కల్గు నరములనొప్పి, ఎడమవైపు తలనొప్పి, రోగిని తాకిన శరీరమంతయు జలదరించుట, వర్షపుగాలివలన రోగోద్రేకము కల్గుట, అన్నకోశములో గ్రుచ్చుచున్నట్లు కోయుచున్నట్లు కల్గునొప్పి, వాడియైన మొనగలవస్తువులు చూచిన భయపడుట, పొగత్రాగుటవలన కల్గు పంటిసలుపు, నొప్పులు సూర్యోదయముతో ప్రారంభించి సూర్యాస్తమయముతో తగ్గుట, జ్వరములో రోగి కదలిన చలివేయుట, ఈపై లక్షణరోగములపై పనిచేయును.

<కదలిన, ధ్వని, తాకుట. 11-12 గంటలకు.

>సాయంకాలము, 3-4 గం. నడుచుట, మర్దనము.

పో—ఆర్సు, ఆర్నికా, బెల్, బ్రై, కేక్టస్, సినా, జెల్సు, లెడం.

అ—డిజ్, కాలీకార్బ, రూస్టా.

వి—ఆరం, కేంఫ్, మెర్కు, పల్సు.

## 58. Sulphur సల్ఫరు.

ఇది శరీరమంతటిమీదను పనిచేయును. ఇది గొప్ప యాంటిసోరిక్ మందు. యేయౌషధము వాడునప్పుడైనను సోరిక్ తత్వరోగికి పనిచేయనప్పుడును గుణము చూపుటలో నాలస్యమైనప్పుడును ఇవ్వదగిన సోరామందులలో ప్రధాన

మైనది దీనిని వాడుటచే లక్షణములకు సరిపడినమందు పిమ్మట వాడిన నక్కనిపనిచేయును.

శరీరమున మంట గలుగుట, (ఫాస్) దీనిప్రధాన చిహ్నము. ఈమంటతో దురద కూడియుండును. శరీరమందలి ద్వారములన్నియు (9) ఎఱ్ఱనగుట, ప్రాతఃకాలమున 10-11 గంటల కతియాకలివేయుట, రాత్రి 11 గంటలకు నొప్పిలేని యుదరవ్యాధి కల్గుట, నిద్రలేవగనే విరేచనమునకు పరుగెత్త వలసివచ్చుట, విరేచనమైనపిమ్మట నిద్రవచ్చుట, బంకవిరేచనము, మలబద్ధకము, గుదప్రక్షాళనము చేయువరకు రోగివద్ద దుర్వాసనవేయుట, ఎండినమలము, ఉండలుకట్టినమలము, బాధతో విరేచనమగుట, క్రమక్రమముగా మలబద్ధకమేర్పడుట, సామాన్యవస్తువు జంతువు మానవులు అందముగ కనుబడుట, బాధలు క్రమముగవృద్ధిచెంది హఠాత్తుగ తగ్గిపోవుట, రోగి నడుచునప్పుడు కూర్చుండునప్పుడు నిలుచుండునప్పుడు నిలువుగానుండక వంగియుండుట, త్వరితముగ నడుచుట, పిల్లలు స్నానముచేయుట కిష్టపడకుండుట, పిల్లలు చిక్కి ఊసరపొట్టగల్గుట, క్రిమిదోషము, వెచ్చనిశరీరము, కప్పిన బట్టలను త్రోసివేయుట, పొక్కులు దద్దుర్లు మొదలగునవి గాఢమగు పైపూతమందులచే నణచిపెట్టబడి పిమ్మట కల్గువ్యాధులు నివారించుటకు ముఖ్యమైనది. ఇది శరీరమందలి మలములను శోధన చేయుమందు.

< లేచుట, వెచ్చదనము, ఎండవేడిమి, వంగుట.

>భుజించుట, కదలుట, వెచ్చనియాహారము.

పో—హెపార్, లెడం, లైకో, నేట్రం మూరు, సారస పరిల్లా.

స—ఎకోనైట్, ఎలోస్, బెడియాగా, నక్సువాం, సోరినం.

అ—కాల్కి కార్బ్.

వి—చైనా, ఆసిడ్ నైట్, అయోడ్.

## 59. Thuja తూజా.

[చర్మము, రక్తము, జీర్ణకోశము, మెదడు, ప్రేవులు]

ప్రమేహరోగలక్షణముల కిది సరియైనమందు. ప్రమేహము శరీరమున జిలించుటచేగాని తగిన చికిత్స జరిగియుండక పోవుటచేగాని శరీరమున నేయవయవములమీదగాని గుదమునను జననేంద్రియముమీదను ప్రేవులయందును చేతులయందును పులిపురికాయలు పుట్టుట, పగిలినపుండ్లు పెక్కురకములగుకురుపులు, శ్లేష్మార్బుదములు, గ్రంథివాతము మొదలగు రోగములు పుట్టుటయు, సైకోసిస్ తత్వరోగికి లక్షణముల ననుసరించి వాడినమందువలన లాభము కనుపించకపోవుటయు.

నుదుటతప్ప శరీరమంతటను నిద్రించునపుడు చెమర్చుట, అతిచెమటలు, దుర్గంధము, పుల్లనివాసనలు రోగినుండి వచ్చుట, జననేంద్రియముమీద తేనెవాసనగల స్వేదము వెడలుట, మలద్వారమున పగులుడుపుండ్లు, పులిపురికాయలు, శ్లేష్మపుపొక్కులు, కూర్చున్నప్పుడు మొలలబాధ యధిక

మగుట, తీవ్రమగుబాధవలన మలమువెడలకుండుట, మలము కొంతబయటికివచ్చి తిరిగి లోపలికివెళ్లుట, (సైలీషియా) ప్రాతఃకాలమున మలము వేగముగా వెడలుట, మూత్రమును విడిచిన తరువాత మూత్రాశయమునుండి బొట్లుబొట్లుగా మూత్రము ఇంకను వెడలుట, మూత్రము విడిచినపిమ్మట కోయుచున్నట్లు తీవ్రమైనబాధ, మూత్రము రెండుధారలుగా వెడలుట, చిక్కని దుర్గంధయుతమగు చీమువెడలుట, కన్నులు మూసికొనిన తలతిరుగుచున్నట్లు తోచుట, తనపై నొకశక్తియేదియో యావహించినట్లును, తన్నెవ్వరో వెంటాడుచున్నట్లును తోచుట, గోళ్లుపుచ్చిపోవుట, గనేరియావ్యాధియొక్క ప్రథమావస్థ, టీకాలవలన కల్గు సమస్తదుర్గుణములు దీనివలన కుదురగలవు.

<రాత్రి, విశ్రాంతి, టీకాలు, కాఫీ.

>ఎడమవైపున, వెచ్చదనము, కదలిక.

షో—ఆసిడ్ నైట్, ఆరం, కేంథారిస్, ఇగ్నేషియా, పల్సు, సల్ఫ.

స—ఆర్సు, సైలీషియా, సల్ఫ.

అ—ఇగ్నేషి, కాలీకార్బ, పల్సు.

వి—నక్సువాం, సల్ఫ, మెర్కు.

## 60. Veratrum Album విరేట్రం ఆల్బం.

[జీర్ణకోశము, నరములు.]

ఇది పిల్లలకు ముసలివారికి జీవశ క్తితరిగినవారికి నరముల వ్యాధులు కలవారికి ఉద్రేకపూరితులగు యువకులలో కట్లు వ్యాధులకు పనికివచ్చును.

ఈరోగి యొంటరిగనుండుట కిష్టపడడు. జీవశ క్తి త్వరలోనశించుట, తరుచుగా పెక్కువ్యాధులందు శిరస్సునకు చెమటపోయుట, ప్రతివస్తువును కోయవలెనని చీల్చవలెనని కోరుచుండుట, అశ్లీలవాక్యములు పల్కుట, వెంటనే ప్రేమ కూడిన పిచ్చిమాటలు, లేక ధర్మవిషయమగు పిచ్చిమాటలు పల్కుట, కొద్దిపరిశ్రమ చేసినను సొమ్మసిల్లుట, నీటివాంతులు, నీటివిరేచనములు, మూత్రము అణచిపెట్టబడుట (కేంఫర్) ముక్కుకొన అరచేతులు పిక్కలు చేతులు భుజములు ఇతర అవయవములు మంచువలె చల్లనగుట, నీరుత్రాగుటవలన ఇటునటు కదలుటవలన వాంతి వృద్ధియగుట, అతిదాహము, తలకు చెమటపోసి తరువాత వేడిగానగుట, మరల చెమటపోసి మరలవేడిజెందుట, పొట్టలో తీవ్రమగునొప్పిగల్గుట, కన్నుల చుట్టును నల్లనిరంగేర్పడుట, రెప్పవాల్చక చూచుట, విషమ నాడి ఆగియాగి దడగల్గుట, కుడితివలె విరేచనములగుట, పిక్కలు లాగుట, పుల్లనివస్తువులు కోరుట, తల తిరుగుట, మేహ వాతపునొప్పులు, శూల, దాహము ఈలక్షణరోగముల కిది యమృతతుల్యమైనది.

< తాకుట, లేచుట, కదలిక, రాత్రి.

> పరుండుట, వెచ్చదనము.

పో—ఆసిడ్ ఫాస్, ఆంటిటార్, ఆర్స్, కార్బోవెజ్, కుప్రం, ఇపెకాక్, విరేట్రం విర్, జింకం.

స—ఆర్నికా.

అ—బెల్, కెమో, రూస్టా.

వి—ఎకోనై, ఆర్స్, కేంఫ్, కాఫీ, చైనా, ఫెరంమెట్.

---

## ద్వితీయభాగమునకు కొన్ని ముఖ్యసూచనలు.

Pathology is what the doctor can tell (sometimes) Symptomatology is what the Patient can tell. —Nash. Leaders in Homœo Therapeutics. Page 24. (7th Est.) dn.

1. రోగిని వైద్యుడు చక్కగ పరీక్షించి తేల్చునిర్ణయమును "ప్యాథాలజీ" యందురు. (కొన్ని కేసులందు వైద్యుని నిర్ణయము తప్పవచ్చును.) రోగి తనరోగవిషయమై చెప్పునది "సింప్టొమాటోలజీ" యందురు. దీనిలో పొరపాటెన్నడును కలుగదు. మనము శరీర-అవయవములలో చూడజాలని చూడని వాపు పుండు మొ॥ ఏవైనను కల్గినచో తదనుగుణముగా లక్షణములతో బాధ బయలుదేరును. అట్టి సమానలక్షణములు కలమందు నిర్ణయించి వాడుచో రోగవిముక్తి కల్గుచున్నది. గావున ప్యాథాలజీని వ్రాయక వదలితిని.

2. సన్నిపాతజ్వరము, అపస్మారము, ఋతుశూల, తలనొప్పి, ఆకలిమందము, గల 5 రోగులకు మందు వాడవలెనను కొనుడు. 5 గురికిని ముక్కు ఆసనము దురద, గొంతులోనికి ఏదియో వచ్చినట్లుండి మ్రింగుట, నిద్రలో ఉలికిపడుట, పండ్లు కొరుకుట, మూత్రము నిలువయుంచిన పాలవలె మారుట, మలముతో నులిపురుగులుపడుట, లక్షణములు కలవనుకొనుడు. ఈ 5 గురికిని సినావలన 5 రకములైన వ్యాధులు తగ్గును కావుననే రోగనామములతో ప్రయోజనము లేదని లోగడ వ్రాసితిని. లక్షణములను చూచియే మందు నిర్ణయించుడు.

శ్రీ ర స్తు.

# హోమియోపతి గృహవైద్యము

## 2 వ భాగము—చికిత్స.

---

### 1. Abdomen పొత్తికడుపు.

ఉబ్బుట.—మిక్కుటముగ త్రేన్పులు వచ్చుచు- కార్బోవెజ్. అజీర్తిలక్షణములతో కూడియుండి-నక్సువామికా. అధికముగ నపానవాయువులు వెడలుచు-లైకోపోడియం. కొవ్వుపదార్థములుతిని జీర్ణముకాక-పల్సటిల్లా.

నొప్పి.—భరింపలేనినొప్పి, గాలిచేరుట-కెమోమిల్లా. గుడగుడలాడుచు-పోడోఫైలం, పల్సటిల్లా. బాధతగ్గుటకు రోగి శరీరమువంచుచున్న-కోలోసింథ్. మూత్రపుతిత్తిలో పసరురాళ్లు చేరి-లైకోపోడియం, లెకెసిస్. నమలుచున్నట్లు నొప్పి-కుప్రంమెట్. రాయిపెట్టినట్లుండు నొప్పి-పల్సటిల్లా.

దుష్టమగునీరు చేరుట.—1-వ భాగమున వ్రాయబడిన ఆర్సెనిక్ ఆల్బం, ఆసిడ్ నైట్రికం, చైనా, ఫెరం మెట్, మెర్క్యూరియస్ లలక్షణములు గమనించేది.

## 2. Abortion గర్భస్రావము.

భయపడుటచే-ఎకోనైట్, దెబ్బతగులుటవలన-ఆర్నికా, కుట్టుచున్నట్లు నరములబాధతో-సిమిసిఫ్యూగా, కోపము వచ్చుటవలన-కెమోమిల్లా. ఆవలింతలు, చలి, ఎఱ్ఱని లేక నల్లని మాంసపుముద్దలు పడుచు - కెమోమిల్లా, చలి, వాంతి, ఎఱ్ఱని రక్తము దిగలాగుచున్నట్లు నొప్పితో- ఇపెకాక్, చెవిలోధ్వని నీరసము శీతము అధిక రక్తస్రావములతో-చైనా, శూల, నల్లని రక్తము, శీతము, కొంకర్లు-సెకేలే. 1, 2 నెలలలో కల్గుట, మంట, కుట్టినట్లు నొప్పులతో-యాపిస్, పొట్ట బ్రద్దలగునేమో యని తోచునట్లు గాలిచేరుట, తల పెద్దదగుచున్నట్లు తోచుట-అర్జెంటం నైట్రికం, అతినీరసము, అతిదుర్వాసనస్రావము-బాప్టీషియా, మామూలుగ గర్భస్రావ మగుచుండుట, క్రిందికి నొక్కుచున్నట్లు నొప్పులు, చిన్నకీళ్లలోనొప్పులు-కాలోఫైలం. నడుమునొప్పి చట్టలలోనికి తొడలలోనికి పాడుచుచుండుట, 3 వ నెలస్రావము—కాలీకార్బ, సెబీనా, క్రియసోట్, తూజా. స్రావమై కట్టుబడి మరల స్రవించి కట్టుబడులక్షణముతో-పల్సటిల్లా. 4 వ నెలలో-సిమిసిఫ్యూగా. 5 వ నెలకు పిమ్మట-సేపియా.

N. B. ఫెరంమెట్ గర్భవతులకు వాడిన గర్భస్రావముల నిరోధించును. పిల్లలు హెచ్చుపుట్టుమచ్చలు లేకుండ జన్మింతురు. మామూలుగ మృతశిశువులు కనువారికి సిమిసిఫ్యూగా మొదటినెలలో వాడిన జీవశిశువులు పుట్టుదురు.

## 3. Abscess & Boils గడ్డలు, కురుపులు.

పలుమార్లు లేచుచు మానుచుండునవి-ఆర్నికా. పిలకలు వేసినట్లు బయలుదేరుట-ఆర్నికా. ఎఱ్ఱనివాపుపోటు-బెల్లడోనా. అన్యపదార్థము కూడుచున్నప్పుడు-హెపార్ సల్ఫు. మెడయందలిగ్రంథులపైన, చిగుళ్లపైన-మెర్క్యూరియస్. గడ్డ నీలవర్ణముగానుండిన-లెకెసిస్. పెక్కురోజులవరకు చీముకారుచుండిన-సైలీషియా. వేసవిలో లేచుగడ్డలు-లైకోపోడియం.

N. B. సల్ఫరు ప్రతి 2 రాత్రిళ్లకొకమోతాదువంతున సేవించిన గడ్డలు లేవవు. హెపార్ సల్ఫు, మెర్క్యూరియస్, సైలీషియాలు తక్కువ పొటెన్సీలో చీమును హరించును. హెచ్చుపొటెన్సీలో చీమును హరించును.

పైమందులను లోనికి వాడునపుడు సాధారణముగా చేయుబాహ్యచికిత్సలు చేయుచో త్వరలో ప్రయోజనము కనుపించును.

## 4. Acne or Pimples మొటిమలు.

చర్మము మొద్దుబారి యెండుకొని యసహ్యముగనుండి తలలు నలుపుగనుండు మొటిమలు-సల్ఫరు. ఎఱ్ఱగా చుట్టును వాచియుండి మధ్య చీముతో కూడియుండి తాకిన బాధకల్గు మొటిమలు-రూస్టాక్సు. బటానీగింజంత యురువుగానుండి గిల్లుచో ప్రమాదము చేయుచుండునవి-హెపార్ సల్ఫు. దురద గల్గియుండు చిన్నమొటిమలు- మెర్క్యూరియస్. సంభోగము

లేకపోవుటచే-ఆసిడ్ ఫాస్. అజీర్తిగలవారిలో - నక్సువామికా. అతిసంభోగమువల్ల, ముష్టిమైథునమువల్ల - ఆసిడ్ ఫాస్, ఫెరం మెట్, ఆసిడ్ నైట్రిక్.

5. Albuminuria మూత్రమున శ్వేతధాతువు పోవుట.

[మూత్ర వ్యాధులలో చూడుడు.]

6. Alcoholism మద్యపానముచే కల్గుదోషములు.

ఉదయము వాంతియగుట, వెగటైనరుచికంపములు-నక్సు వామికా. నాడి కొంతసేపు మెల్లగను కొంతసేపు వడిగను మారుచుండి సంధిలక్షణములుకల్గుట-హాయోశ్యామస్. జంతువులు దయ్యములు గంతులువేయుచున్నట్లు కనుపడినట్లు రోగి చెప్పుచుండిన- ఓపియం. ఇదివరకొకసారి యిట్టివ్యాధి కల్గి యుండినవారికి-ఓపియం. నిద్రలో ఆకస్మికముగ లేచి పరుగెత్తుట, పాములు కనుపించినట్లు చెప్పుట, గొంతు బిగబట్టుట-లెకెసిస్.

7. Amenorrhoea ఋతువు ఆగిపోవుట, (స్త్రీలవ్యాధులు చూడుడు.)

8. Anaemia రక్తక్షీణము.

ముఖముయొక్కవర్ణము తెలుపుగను యెరుపుగను ఘడియఘడియకు మారుచుండుట-ఫెరంమెట్. ధాతుక్షీణము స్రావములవలన కలుగుచున్న-చైనా. లోహము, క్వైనా యెక్కువగా వాడుటచే-పల్సటిల్లా. యోనిదోషములు, బహిష్టు దోషములతో-పల్సటిల్లా. ఋతుదోషము, తలనొప్పి-నేట్రం

మూరు. జబ్బుపడి లేచిన-కార్బోవెజ్. ముట్లుడుగు కాలమున తత్వము చెడుటచే - లెకెసిస్. పొడువుగా ఎత్తుగా పెరుగుట, కన్నులు పచ్చబడుట, రక్తక్షీణము-ఫాస్ఫరస్. రక్తము విషపూరితమగుట- లెకెసిస్.

## 9. Angina Pictoris హృదయము బిగింపు.

గుండెబిగింపు- అయోడియం, పట్టుచు వదలుచున్నట్లుండుట- లిలియంటిగ్. నొప్పి ఛాతీయంతటి ఆక్రమించుట- సిమిసిఫ్యూగా. ఎడమచేతిని ఛాతీతో బిగించికట్టిన ట్లుండుట- సిమిసిఫ్యూగా. నెమ్మదియైననాడి, హృదయమునుండి ఛాతీకి బాధ, మంట, నీరసము, కదలిన ఊపిరాడకుండు ననుతలంపు, ఊపిరాడుటకు లేచి కూర్చుండుట- ఆర్సెనికం - ఆల్బం కదలక పోయిన తనహృదయ మాగునని తలంచుట-జెల్సీమియం. ఛాతీ యినుపబద్దతో బిగించినట్లుండుట-ఎకోనైట్, కేక్టస్. దడ, పొడుచుచున్నట్లు బాధ మెడలోనికి చేతులలోనికి వ్యాపించుట-నక్సువామికా. పొగత్రాగుటవలన-నక్సువామికా. నిద్ర నుండి లేవగనే యూపిరిసల్పక గుడ్డలు తీసివేయుట- లెకెసిస్. నడచునపుడు బిగింపు-ఆస్న.

## 10. Aphthae—Sore mouth నోటిపూత-పుండు.

పుల్లని వాంతులు ఆకుపచ్చని నీటివిరేచనములతో ఎట్టినిపూత - కెమోమిల్లా. అతిచొంగకారుట, పుండ్లుపడి యుండుట-మెర్క్యూరియస్. పొక్కులు నిండుగానుండి నీల

వర్ణమునకు మారి రోగి నీరసముగానుండిన-ఆర్సెనికం ఆల్బం. పుండ్లు నోటినుండి గొంతులోనికి వ్యాపించిన - ఆసిడ్ నైట్రిక్. పూత గొంతులోనికి వ్యాపించి గ్రంథులు వాచి చీము పట్టుచో-హెపారు సల్ఫు. నాలుక గోధుమవర్ణము, నోరు దుర్వాసన-బాప్టీషియా. మెర్క్యూరియస్ పనిచేయనపుడు సల్ఫరు కూడ వాడవలెను.

## 11. Apoplexy రుద్రవాతము.

నాడితీవ్రము, జ్వరము, తిమ్మిరి-ఎకోనైట్. గురగుర ధ్వనితోగూడిన కష్టమగుశ్వాస, ముఖము నలుపుయెరుపు కలిసినరంగుగా మారుట, ముఖముపై చెమట, మత్తు, నోటి వెంట నురుగు, అవయవములు బిగియుట, మెలితిరుగుట-ఓపియం. మత్తుపదార్థము సేవించుటచే కల్గిన-నక్సువామికా. ముఖముకందియుండి క్రిందిదౌడ వ్రేలాడుచు మత్తుగానుండిన-నక్సువామికా. తల వేడిగానుండి శరీరము చల్లగా నుండుట, మలమూత్రములు తెలియకుండగ నగుట, కనుపాపలు ముడుచుకొనుట-ఎడమవైపు పక్షవాతముతో ఆర్నికా. నాడిమందము, ఎడమభాగం పక్షవాతం, మత్తు, పాలిపోయినముఖము, ఎల్లప్పుడు మద్యపానము చేసెడివారు-లెకెసిస్. క్రిందిఅవయవముల పక్షవాతం-నక్సువామికా. ఎఱ్ఱనికన్నులు, ఎఱ్ఱనిముఖము, కాళ్లుచేతులకంపములు, మ్రింగుడుబడకపోవుట, కుడివైపు పక్షవాతం-బెల్లడోనా. ముసలివారిలో కలుగు కుడివైపుపక్ష

వాతము, నాలుకపక్ష వాతము-బెరీటా కార్బ. తల త్రిప్పు, తెమ ల్చుట, ముఖమెఱ్ఱబడుట, పక్ష వాతచిహ్నములతో-జెల్సీమియం. యెండలో తిరుగుట, దెబ్బతగులుట, భయములవలన కల్గి కన్నులు ముఖము యెఱ్ఱగనుండిన-గ్లోనైన్. బహిష్టుదోషముచే బాధపడువారిలో-పల్సు.

## 12. Appendicitis అంత్రసంబంధపు వాపు.

ఎఱ్ఱని ముఖము జ్వరము కాలేయమువద్ద నొప్పి-బెల్ల డోనా. పొట్టయొక్క కుడిభాగము వాచుట, కూర్చుండిన కుడి కాలు చాచిన బాధ-రూస్టాక్సు. ఎడమవైపున-లెకెసిస్. పెక్కు కేసులు బెల్లడోనా మెర్క్యూరియసులను ఒకదానివెనుక నొకటిగ మార్చి వాడిన కుదిరెను.

## 13. Appetite—loss of ఆకలి తరుగుట.

దురలవాట్లు—వేళతప్పి భుజించుట, మత్తుపదార్థములు సేవించుట-నక్సువామికా. కఠినముగా జీర్ణమగుపదార్థములు తినుటవలన-పల్సటిల్లా. క్రిందటిదినమున పూర్తిగా మెక్కి యుండుటచే-ఇపెకాక్. శరీరపోషకధాతువులు మూత్రాదుల ద్వారా పోవుచుండిన-చైనా. పైత్యలక్షణములతో-బ్రయో నియా. విరేచనము కాకుండుటచే-నక్సువామికా. విరేచనమునకు వెళ్లవలెననుకోరికయే లేకుండి-బ్రయోనియా. పుల్లనివస్తువులు కోరుచుండిన - ఆంటిమోనియం క్రూడం ఎక్కువగా నీరు త్రాగుచు-సల్ఫరు.

## 14. Asthma ఉబ్బసము.

తెరలు తెగలుగా వచ్చుదగ్గు శ్లేష్మము పూర్తిగానున్నట్లు ధ్వని, వమనము-ఇపెకాక్. కదలినవెంటనే దగ్గు-బ్రయోనియా. నాడి సన్నముగ నుండుట, చల్లనిచెమటలు, ఊపిరికొరకు పెనగులాడుచుండుట- ఆర్సెనికంఆల్బం. దగ్గు వెల్లకిలప రుండినను ముందుకు బాగుగవంగినను తగ్గుట-నక్సువామికా. ఊపిరితిత్తులలోనికి దుమ్ముచేరిన ట్లుండుట-సల్ఫరు. వేకువ 3-4 గంటలకు దగ్గు హెచ్చుట, ముందుకు వంగినను లేచికూర్చుండినను శ్లేష్మము (దారమువలె) వెడలిన దగ్గు తగ్గుట-కాలీబైక్రోమికం. ఒకానొకతేదీనుండి వచ్చినదని పల్కుట, గోరింతదగ్గు వచ్చినప్పటినుండి బాధించుట, ఛాతీలో నిప్పుకణిక యుంచినట్లు మంట, బలహీనత, శవాకారము పొందుట, ఈలక్షణములతో నుండినవారికి-కార్బోవెజ్. గుడ్డలను దగ్గునపుడు వదులుచేయవలసివచ్చుట, పొడిదగ్గు, నిద్రలో తనకు తెలియకుండగనే దగ్గుట, దగ్గునపుడు గుదములోనికి పొడుచుచుండునొప్పి-లెకెసిస్. శ్లేష్మము గురగురలాడుచు ఊపిరితిత్తులలో నిండియుండి వెడలించుటకురాక రోగి మగతగానుండిన-ఆంటిమోనియంటార్. వానగాలి చల్లగాలి తగిలిన హాయిగనుండుట-హెపారుసల్ఫు. కప్పుకొనినగుడ్డ తొలగుటచే దగ్గు-రూస్టాక్సు శ్లేష్మము చిక్కగాను విస్తారముగాను చేదుగాను ఆకుపచ్చగాను వెడలుట, ఎడమవైపుపరుండిన హెచ్చుట - పల్సటిల్లా. వెచ్చదనమువలన వచ్చుచో-తూజా. దగ్గువచ్చి యన్నము వాంతియగులక్షణ

ముతో గూడిన యుబ్బసము-ఫెరంమెట్. ఉదయము కళ్లెతో గూడినదగ్గు సాయంత్రము పొడిదగ్గు-రూస్టాక్సు, బ్లాటావోరి యంటాలిస్ మదరుటించరు 5 చుక్కలు నీళ్లలో (½ఔన్సు) వేసి పుచ్చుకొనిన పెక్కురకములగు ఉబ్బసములు తగ్గును.

## 15. Back-ache నడుమునొప్పి.

నడుము బ్రద్దలగుచున్నట్లు నొప్పి-రూస్టాక్సు. ప్రథమమున కదలికవలన హెచ్చి యింకను కదలుటవలన తగ్గిన-రూస్టాక్సు. విరామములేక అధికమగుబాధ-సిమిసిఫ్యూగా. వేకువజామున వెన్నెముకలో మంటతోకూడిన నొప్పి-నక్సువామికా. కదలికవలన హెచ్చుట-బ్రయోనియా. పొడుచుచున్నట్లు చీల్చుచున్నట్లు బాధ-పల్సటిల్లా. చితుకగొట్టినట్లు-ఆర్నికా. మెరుపువలె వచ్చుచుపోవుచున్న-బెల్లడోనా. నడుచుటవలన వచ్చిననొప్పి-సైజీలియా. పరుండిన నడుమునొప్పి వచ్చుచు నిలుచుండిన తగ్గిన-బెల్లడోనా. నిలుచుండిన కల్గి పరుండిన తగ్గుట-తూజా.

## 16. Barbars'-Itch మంగలకత్తిదోషము.

దురద మంట-సల్ఫరు. తూజా ప్రధానమగుమందు. దీని మదరుటించరును పైకి కూడ రాయవలెను.

## 17. Biliousness పైత్యము.

నీరుత్రాగుటవలన పసరు వాంతియగుట-బ్రయోనియా. పసుపుపచ్చనినాలుక, చర్మము మురికిగానుండుట, నోటివెంట

నీరూరుట-మెర్క్యూరియస్. చిరచిర, కాలేయము ముట్టు కొనిన నొప్పి-బ్రయోనియా. దురలవాట్లు-అతితిండి తినువార లలో-నక్సువామికా. తెల్లని నాలుక, ఉదయము తలనొప్పి, సుద్దరంగువిరేచనము-పోడోఫైలం. స్త్రీలలో పైత్యలక్షణ ములు-ఇగ్నేషియా. వికారముతో తలనొప్పి, తీగలవలె శ్లేష్మము కక్కుట. పుల్లని లేక చేదువాంతి వేవిళ్లు-ఐరిస్. తెమ ల్చుట వాంతి-ఇపెకాక్. నిద్రలేకపోవుటచేత-పడవ బండి ప్రయాణములవలన, తలత్రిప్పు వాంతి-కాక్యులస్. చలి విరే చనములతో-పల్సటిల్లా.

## 18. Bites and Stings of Insects పురుగులకాట్లు, కుట్లు.

మంట, చెమట, నీరసము-ఆర్సెనికం ఆల్బం. ఎఱ్ఱనివాపు, మగత-బెల్లడోనా. చర్మ మార్చుకొనిపోవుట, నీటిస్రావములు-నేట్రం మూరు. కుట్టినచోట వాపు, కీళ్లుచల్లబడుట-లెడం. చురుకుచురుక్కుమన నొప్పి-యాపిస్, కేంథారిస్.

## 19. Bladder మూత్రపుసంచి.

మూత్రములో చూడుడు.—

## 20. Bleeding రక్తస్రావము.

భయము, ఆదుర్దా, ఎఱ్ఱనిరక్తము - ఎకోనైట్. దెబ్బ వలన, శరీరకష్టము చేయుటచేత - ఆర్నికా. ఎఱ్ఱనిముఖము, వేడిరక్తము - బెల్లడోనా. పాలినముఖము, విసరమని కోరుట,

శీతలస్థితి - కార్బోవెజ్. సొమ్మసిల్లుట, చెవిలో ధ్వని, అధిక రక్తము - చైనా. కొంతరక్తము చిక్కగను కొంత నీళ్లుగను-ఫెరంమెట్. ఘుడియఘుడియకు ముఖము పాలిపోవుట, ఎఱ్ఱబడుట - ఫెరంమెట్. శరీరము కండరములు అదురుట, సంధి లక్షణములు-హయోశ్యామస్. దుష్టరక్తము చీకిన గడ్డివలెనుండుట-లెకెసిస్- సవామేహరోగియొక్క యెఱ్ఱనిరక్తస్రావము-ఆసిడ్నైట్. చిన్నకురుపులనుండియైనను వెంటవెంట అధిక స్రావము-ఫాస్ఫరస్. ఆగి యాగి స్రవించుట-పల్సటిల్లా. సన్నని బలహీనులగుస్త్రీలలో శీతము కొంకర్లతో-సెకేలేసోరారోగులలో ఇతరమందులు పనిచేయనప్పుడు - సల్ఫరు. శ్వాసకష్టము, వాంతి, అధికరక్తస్రావము-ఇపెకాక్. నల్లని మాంసపుముక్కలతో గూడుకొని, నల్లని హెమామిలిస్.

## 21. Blood–Pressure రక్తపుపోటు.

గుండెదడ,గుండె యాగినట్లుండుట, ఆత్మహత్యచేసుకొనవలె ననుకోర్కె-ఆరంమెట్. ఎడమవైపు పరుండలేకపోవుట, చావుభయము, గుండెబిగింపు-కేక్టస్, బద్ధకము, మత్తు, వణుకు, గుండెయాగునట్లుతోచుట-జెల్సీమియం. పగలు నిద్రమత్తు, ఒంటరిగానుండగోరుట, అగ్నిమాంద్యము-లైకోపోడియం. గుండెదడ, తల తిరుగుట, మంటలు-సల్ఫరు. కన్నులు ముఖము ఎఱ్ఱబడిన-బెల్లడోనా.

## 22. Bones ఎముకలు.

[సరిగా ఎదుగకపోవుట—కాల్కేరియా కార్బ.]

క్రిందిదౌడయెముక పుచ్చుట—ఫాస్ఫరస్. ఎముకలలో నొప్పులు—ఆసిడ్ నైట్రిక్. విరిగినట్లు నొప్పులు, యూఫటోరియం పెర్ఫ. విరిగిన—సింఫైటం. పిల్లలయెముకలు వంకరగా పెరుగుట—సైలీషియా.

## 23. Breast abscess చనుకుదురు.

[ప్రథమావస్థ—ఆర్నికా. ఎఱ్ఱనివాపు-బెల్లడోనా.]

చీము పట్టకుండ చేయుటకు- మెర్క్యూరియస్, హెపారసల్ఫ. కుదురును కరగించుటకు ఫైటోలక్కా పనికివచ్చును.

## 24. Bronchitis ఊపిరితిత్తులకు సంబంధించి గాలిగొట్టములు వాచుట.

[వ్యాధి ప్రారంభింపగనే-ఎకోనైట్, జ్వరము పొడిదగ్గు.]

బెల్లడోనా. తల యితరఅవయవములకు బాధకలిగించునట్టిదగ్గు—బ్రయోనియా. ఛాతీ పుండుపడినట్లు నొప్పికల్గుట—మెర్క్యూరియస్. కాలికవ్యాధిగా మారిన-సల్ఫరు.

## 25. Bruises గాయములు.

ఆర్నికామూలార్కమునకు పదిరెట్లనీరు కలిపి పైన ఆ నీటితో తడిపినపట్టీ కట్టవలెను. బాధకు ఆర్నికామాత్రలు లోపలికి వాడవలెను. దీనితో ఎకోనైట్ మార్చి వాడిన మంచి

ప్రయోజనము కల్గును. రక్తస్రావ మాగకున్న హెమామిలిస్ లోపలికి వాడవలెను.

## 26. Bunions—పాయుట.

నీటిలో నానుటవలన—పల్సటిల్లా లోపలికిని హెమామిలిస్. ఆయింటుమెంటు పైకిని వాడవలెను.

చీముపట్టినచో-హెపార్ సల్ఫు లోపలికిని కాలెండులా ఆయింటుమెంటు పైకిని వాడవలెను.

## 27. Burns కాల్పులు. Scalds బొబ్బలు.

జ్వరలక్షణములు—ఎకోనైట్. చీముపట్టుట—హెపార్ సల్ఫు. వేడియాహారపానీయములు పుచ్చుకొనుటచే లోపలి భాగములు కాలినచో-కాంతారిస్.

కేంథారిస్ ఆయింటుమెంటు పైకి వాడవలెను.

## 28. Chancre కొరుకు.

వంచలు గట్టిగానుండుకొరుకు-మెర్క్యూరియస్ ప్రోటో అయోడైడ్.

యెఱ్ఱని మెత్తని యేదితగిలినను బాధగల్గు కొరుకు-కారాలియం.

## 29. Chicken-Pox ఆటలమ్మ.

[పెద్దమ్మవారిలో చూడుడు.]

## 30. Cholera కలరా (వాంతిబేది.)

పల్చని విరేచనములు ప్రారంభింపగనే 15 నిమిషముల కొకమోతాదువంతున సల్ఫరు 6 వ పొటెన్సీని వాడిన కలరా వ్యాధిలోనికి విరేచనములు మార్పుజెందక తగ్గిపోవును. గంటి వలె విరేచనములగుచుండిన టించర్ కేంఫరును ఒక అవున్సు నీటిలో 10 చుక్కలు వేసి 4 మోతాదులుగా వాడవలెను. కాళ్లుచేతులు చల్లబడి కంపములు కల్గుచో—విరేట్రం ఆల్బంను, దానివలన ప్రయోజనము కనుపించనిచో కుప్రంమెట్ను వాడిన ప్రయోజనము కల్గును. పిక్కలలో పీకుచున్నట్లు నొప్పులు, సర్వాంగములు శీతలస్థితిజెందుట, మరణచిహ్నములు కనుపించుచో-కార్బోవెజ్ను వాడవలెను.

పెద్దపెద్ద నీటివిరేచనములు విరేచనమైనవెంటనే పొట్ట నీటిచే పూరింపబడి గుడగుడలాడుచు మరల దుర్గంధయుతమగు గొప్పనీటివిరేచనమగుట-పొడోఫైలం.

వ్యాధియొక్క యేస్థితియందైనను పొట్టలో మంట, నిస్త్రాణ, అస్థిమితముకలుగుచో-ఆర్సెనికంఆల్బం వాడిన తగ్గును.

ఆహారము ద్రవపదార్థముగను బలమునిల్పునదిగను నుండవలెను.

## 31. Chorea అవయవములు స్థిరతలేకపోవుట (నర్తనరోగము.)

అనుమానముతో నుండుట, సిగ్గువిడిచియుండుట హయోశ్యామస్. యెఱ్ఱనిముఖము కన్నులు-బెల్లడోనా. మల ములో నులిపురుగులు కనుపించుచున్న—సినా. ఒకభాగమున

కదల్చుచున్నచో—కుప్రంమెట్. కన్నులు చికిలించుట, ముఖము కాళ్లుచేతులు క్షణమొకరీతి కదలుచుండుట— ఎగేరికస్. ఒంటరిగానుండుకోర్కె, బుద్ధి క్షణక్షణము మారుచుండుట, కండరములు కదలుచుండుట-ఇగ్నేషియా.

## 32. Cold and Catarrh జలుబు, పడిసెము.

చల్లనిగాలి సోకుటవలన-ఎకోనైట్. నీరసము, ముక్కువెంట కన్నులవెంట నీరుకారుట (మంటతో)-ఆర్సెనికం. ముక్కువెంట నీరు ధారగా కారుచుండుట-నేట్రంమూరు. ముక్కులో పుండ్లుపడినట్లు బాధ, తీగలుసాగు శ్లేష్మము వెడలుచుండుట-కాలీబైక్రోమికం. ముక్కులుబిగింపు—లైకోపోడియం. దుర్వాసన గలశ్లేష్మము-ఆసిడ్ నైట్రిక్. రక్తపుజీరగల శ్లేష్మము—ఫాస్ఫరస్. రాత్రివేళ ముక్కుబిగించుట-నక్సువామికా.

కొందరిలో ఆర్సెనిక్ పనిచేయనిలక్షణములకు మెర్క్యూరియస్ పనిచేయును.

## 33. Colic—శూల.

తీవ్రమగుశూల, ముందుకువంగిన తగ్గుట, తెరలుతెరలుగా వెంటవెంట వచ్చుట-సిమిసిఫ్యూగా, కోలోసింథ్. తీవ్రమగుశూల, వెనుకకువంగినను నిలువుగానుండినను తగ్గుట—డయాస్కోరియా. పైత్యశూల, కోపమువచ్చుటచే కల్గుశూల, పిల్లలకుకల్గుశూల-కెమోమిల్లా. ఈమందు తరువాత నక్సువామికా, పల్సటిల్లాలలో నొకటి కొన్నిగంటలైనపిదప వాడిన

మంచిప్రయోజనము గల్గును. పొట్టలోనినరముల సంబంధమగు నొప్పి—బెల్లడోనా. పొట్ట గాలిచే నింపబడియుండి యపాన వాయువు వెడలిన బాధ తగ్గుచు మలబద్ధకముగానున్న-లైకో పోడియం. పైత్యశూలకు కెమోమిల్లా పనిచేయనపుడు—పోడోఫైలం. రంగులువేయువారికి గల్గుశూల—పోడోఫైలం, కత్తికోతవలె నొప్పులు మెలివేసినట్లు నొప్పులు వత్తిడిచే తగ్గుట—కుప్రంమెట్. పొట్ట ఊదుట, విరేచనానుమానము, ప్రేవులు రాళ్లమధ్యపడి నలుగుచున్నట్లు నొప్పి-నక్సువామికా. కోయుచున్నట్లు పొత్తికడుపున కడ్డముగా ఎడమనుండి కుడి వైపుకు వచ్చు నొప్పులు (వాంతులు విరేచనములతో)—ఇపెకాక్. బాధ తగ్గుటకై యటునిటు తిరుగుట, ముందుకు వంగి కూర్చుండుట, నుదుట చెమటపోయుట-విరేట్రంఆల్బం. చల్లని వస్తువులవలన బహిరంగమైనగాలిలో నటునిటు తిరుగుటవలన తగ్గుట-పల్సటిల్లా. భోజనమైన వెంటనే వచ్చుశూల—కాలీ బైక్రోమికం. నక్సుమోస్కేటా. భోజనమైన 2, 3 గంటలకు వచ్చినచో—నక్సువామికా. భోజనముచేసినను ఏది తిన్నను తగ్గుశూల—యనకార్డియం.

## 34. Constipation మలబద్ధకము.

మొలలు, తలనొప్పి, దురలవాట్లు గలవారికి-నక్సువామికా. మామూలుగా మలము ఆలస్యముగావెడలుట-సల్ఫరు. ఉదయముసల్ఫరును సాయంత్రము నక్సువామికాయును

పెక్కురోజులు వాడిన పెక్కుండ్రకు మలబద్ధకము కుదిరినది. నోరు లోహపురుచిగా నుండువారికి-మెర్క్యూరియస్. కఠిన ముగనుండు నల్లనియుండలు ముసలివారి మలబద్ధకము-ఓపియం. ప్రయాణము చేయువారికి—ప్లాటినా. పదేపదే మలవిసర్జనము కొరకు వెళ్లినను కాకపోవుట - కాష్టికం. మిక్కుటమగు బాధతో-ఆసిడ్ నైట్రిక్. విరేచనమునకు వెళ్లుకోరికయే కల్గ కుండుట-బ్రయోనియా. మలద్వారము బిగువుగానుండుటచే మెత్తనివిరేచనమైనను మిక్కిలి ముక్కినగాని వెడలకుండుట-లైకోపోడియం. గొర్రెపెంటికలవలెగట్టిమలము బాధతో వెడలుట-నేట్రంమూరు. నల్లని గట్టి పెద్దముద్దలుగా వెడలుచు కొంత నిలిచిపోవుట—తూజా. విరేచనము గట్టిగానుండి బయటికి వచ్చుచు లోపలికి పోవుచు బాధించుట-సైలీషియా.

## 35· Consumption క్షయ.

హెమామిలిస్, డ్రోసిరా, ఫాస్ఫరస్, ఆర్సెనికంఆల్బం, కాంగ్వోనేరియా, కాల్కేరియాకార్బ, ఫెరంమెట్ స్టేనం, ఆర్సెనికం అయోడేటం, బేసిలినం, ట్యూబర్కులినంలు ప్రధానమైనవి.

కుడియూపిరితిత్తి క్రిందిభాగమునుండి నొప్పి వీపునకు పొడిచినట్లుండురోగికి—కాలీకార్బానికం. ఉప్పని చిక్కని ఆకుపచ్చని దుర్వాసనగల శ్లేష్మమువెడలుట నొప్పి యూపిరితిత్తుల నుండి గూడలమధ్యకు పొడుచుచుండుట-కాలీహైడ్రో అయో-

డికం. కుడియూపిరి తిత్తిలో పైభాగమునను మధ్యభాగమునను నొప్పి—కాల్కేరియాకార్బ. ఎడమయూపిరితిత్తి పైభాగమున నొప్పి-సల్ఫరు. దగ్గు, గుండెలో బరువు, ఊపిరిసల్పకుండుట, ఎడమవైపుపరుండి ఎడమయూపిరితిత్తిలో పోట్లుకల్గుట—ఫాస్ఫరస్ పెద్దపొటెన్సీ యొకమోతాదుమాత్ర మివ్వవలెను. దానినే వెంటవెంట వాడుటగాని ఫాస్ఫరస్ యీవ్యాధిలో తక్కువ పొటెన్సీలో వాడుటయు కూడదు. అతి ఆకలి, భోజనము చేయుటచే ఉపశాంతి. ఎంతతిండి తినుచున్నను చిక్కిపోవు చుండుట, చల్లనిగది కావలెనని కోరుచుండుట-అయోడియం. గ్రంథులు వాచుట, ఊపిరాడుట, కష్టముగానుండుట, కళ్లె తెగి పడకుండుట-బ్రోమియం. రాత్రివేళ పొడిదగ్గు, నిద్రింపలేకుండుట, పరుండజాలక కూర్చుండియుండుట, ముక్కు ఎండుకొని ఊపిరిపీల్చుటకు కష్టముగనుండుట, ప్రథమమున పొడిదగ్గుగా నుండి క్రమముగ శ్లేష్మము సులభముగా జారుదగ్గుగామారుట, నుదురునొప్పి, జ్వరము-స్టిక్టాపల్. నిద్రనుండి ఊపిరిసల్పక లేచుట, తీవ్రముగ ధ్వనిచేయుదగ్గు, గుటకవేయుట, మాట్లాడుట, పాడుటవలన దగ్గుహెచ్చుట-స్పాంజియా. ఎల్లప్పుడును లక్షణములు మారుచుండుట, బాధలు ఆకస్మికముగ కల్గి యాకస్మికముగ తగ్గుట, ఊపిరితిత్తులు మెదడు మూత్రపిండములు కాలేయము జఠరము ఇట్లొకదానితరువాత నొకటిగా వ్యాధిగ్రస్థమగుట-ట్యూబర్క్యూలినం. ఎల్లప్పుడును లక్షణములు మారుచుండుట, రోగముయొక్క తలతోక తెలియ

కుండుట-పల్సటిల్లా. సన్ననివారికిని-ఆకుపచ్చని, తియ్యని లేక ఉప్పని కళ్లెపడుట. పొట్ట ఖాళీయైనట్లుండుట, మట్లాడినను కదలినను అలసటకల్గుట, బాధలు క్రమముగా హెచ్చి క్రమముగా తగ్గుట-స్టేనం. కుడియూపిరితిత్తిలో నొప్పి, పొడిదగ్గులో కాక, బుగ్గలెఱ్ఱబడుట-శాంగ్వేనేరియా. గుండెలోమంట దగ్గు అర్థరాత్రికి పిమ్మట హెచ్చుట, పొడిదగ్గు, ఊపిరిసల్పకుండుట-ఆర్సెనికంఆల్బం. అర్ధరాత్రికి పూర్వము హెచ్చు పొడిదగ్గు కల్గుట-సల్ఫరు.సులభముగా జలుబుచేయుట, కళ్లెతో రక్తము చీము పడుట-సైలీషియా.

## 36. Convulsions and Cramps ఈడ్పులు, కొంకర్లు.

ముఖము నీలవర్ణముగా మారుట, వ్రేళ్లు కొంకర్లు పోవుట-కుప్రంమెట్, ముఖము ఎఱ్ఱబడి-బెల్లడోనా. మలమున నులిపురుగులుచేరుట, ముఖము పాలిపోవుట-సినా. ముఖమునకు తలకు వెచ్చని చెమటపోయుట, ఒకబుగ్గ యెఱ్ఱగను, మరొకటి తెల్లగను నుండుట-కెమోమిల్లా. నిద్ర లేకపోవుట వల్లను, ఋతువు ఆగిపోవుటవల్లను, అతినీరసమువల్లను, కలిగినచో-కాక్యులస్. ఫిట్టు వెంటవెంట వచ్చుట, అవయవములు ముడుచుకొనుచు చాచుకొనుచునుండుట-సికూ్యటావిరోసా. శరీరము ముట్టుకొనిన తెరవచ్చుట-నక్సువామికా. తల హఠాత్తుగ దిండుపైనుండి లేచుట-స్ట్రమోనియం. తెర వచ్చుటకు ముందు కంటిపాపలు పెద్దవగుట—అర్జెంటం నైట్రికం. పిల్లలు

మిక్కుటముగా తినుటచేత-ఇపెకాక్. కండరములు అదురు చుండుట, పిల్లలను గురువు మొదలగువారు శిక్షించుటవలన-ఇగ్నేషియా. ఫిట్టు వచ్చుటకుముందు ఆకలికల్గుట, నాలుక కొరుకుకొనుట, నోటివెంట నురుగు, భయంకరమగుదృష్టి.—హాయోశ్యామస్.

పలుమారు చిన్నబిడ్డగుణము వచ్చుపిల్లలకు బెల్లడోనా వలన నిరోధింపబడును.

## 37. Cough దగ్గు.

అధికధ్వనితోకూడిన పొడిదగ్గు—ఎకోనైట్. సులభముగ కళ్లవెడలుదగ్గు—హెపార్ సల్ఫు. పొడిదగ్గు ముఖమెఱ్ఱబడుట—బెల్లడోనా. రాత్రిహెచ్చునది—హాయోశ్యామస్. గొంతునొప్పి, బొంగురుతనము, ఛాతీనొప్పి—ఫాస్ఫరస్. చిరుదగ్గు—నక్సువామికా. కళ్లెతో తీవ్రమగుదగ్గు—సల్ఫరు. పొడిదగ్గు దగ్గుటవలన తలనొప్పి, ఛాతీనొప్పికల్గుట-బ్రయోనియా. శరీరమంతయు కదలించునంతదగ్గు, బొంగురుతనము, ఛాతీనొప్పి—మెర్క్యూరియస్. తీగవలె శ్లేష్మమువెడలుచు ఉదయమున నుద్రేకించుదగ్గు—కాలీబైక్రోమికం. ఊపిరిసల్పుటకు కష్టముగనుండి తెగిపడని మిక్కుటమగు శ్లేష్మముతో తెరలు తెరలుగా వచ్చునది—ఆంటిమోనియం, టార్టారికం. దగ్గిన కొలది ఉద్రేకించుట—ఇగ్నేషియా. కొండనాలుక జారుట వలన-ఎల్యూమిన్.

## 38. Croup కింకవాయిదగ్గు.

అతిదాహము వడివడిగా శ్వాస తీసికొనుట, తీవ్రమగు వేడి పొడిదగ్గు-ఎకోనైట్. అధికశ్లేష్మము, గురగురధ్వని, సులభముగ వెడలుకళ్లె-హెపారుసల్ఫు. పెద్దధ్వని వెంటవెంటదగ్గుట, రంపపుకోత శబ్దమువంటి శబ్దముతో శ్వాస—స్పాంజియా.

కొందరు వైద్యులు ఈమూడుమందులను 1,2,3 వరుసగా 5 నిమిషముల కొకమోతాదువంతున వాడుచున్నారు. గొంతునొప్పి తలనొప్పి పొడిదగ్గు-బెల్లడోనా. చీకువంటిబిడ్డలలో అయోడియం మంచిపనిచేయును.

## 39. Deafness చెవుడు.

[చెవివ్యాధిలో చూడుడు.]

## 40. Debility నీరసము.

జబ్బువలన, ధాతుక్షీణమువలన, అతిసారమువలన—చైనా, నరములబలహీనత—ఆసిడ్ ఫాస్. రక్తక్షీణము వలన—ఫెరంమెట్, నేట్రంమూర. నీరసముగానున్నను స్థలము మార్చుచుండుట-ఆర్సెనికంఆల్బం.

## 41. Dentition దంతములు వచ్చుట.

ఆలస్యముగా వచ్చుట-కాల్కేరియాకార్బ. దంతములు వచ్చునపుడు బాధచిరచిర—కెమోమిల్లా. పిల్లలు చిగుళ్లరుగునట్లు దేనికైనను వేసిరుద్దుచుండుట—పోడోఫైలం.

## 42. Diabetis అతిమూత్రము.

[మూత్రవ్యాధులు చూడుడు.]

## 43. Diarrhoea అతిసారము.

ఏమియుబాధలేక అజీర్తివిరేచనము లగుచు నీరసము జెందుట—చైనా. వేసవిలో పిల్లలకు గల్లు పసుపురంగు విరేచనములు-ఇపెకాక్. అప్రయత్నముగానగుట, పరుగెత్తవలసి వచ్చుట—ఎలోస్. బ్రయోనియా, సల్ఫరు, గొంత గట్టిగను కొంత పల్చగనగుట-ఆంటిమోనియంక్రూడం. పైత్యవిరేచనములు, దాహము, నోరుదుర్వాసన, తెమల్చుకొనుట, కక్కులు, ఆకలిలేకపోవుట, చిరచిరగానుండుట—మెర్క్యూరియస్. ఆకస్మికముగ కల్లు గాలిమార్పుచే-హెపార్ సల్ఫ నులినొప్పితో-కెమోమిల్లా. గొట్టమునుండి చిమ్మినట్లు—పోడోఫైలం. జిగురు, ఆకుపచ్చనిరంగు రాత్రి హెచ్చుగనగుట, నీరుత్రాగినపుడెల్ల విరేచనమగుట—అర్జెంటం నైట్రికం. సుద్దరంగుగానగుట, లేక మాటిమాటికి రంగుమారుట—పోడోఫైలం. జిగురుతోకూడియుండి తేపకొకవర్ణముగా నగుట—పల్సటిల్లా. పులిసినవాసన గొట్టుచు—కార్బోవెజ్-లైకోపోడియం. వేసవిలో చల్లనినీరు త్రాగుటవలన—ఎకోనైట్. సగ్గుబియ్యపుజావవలె, ఆకుపచ్చని రంగు శ్లేష్మముతో కూడి బాధలేక కల్లు అజీర్తివిరేచనము—ఫాస్ఫరస్. వాసన జిగురుబాధతో—ఆర్నికా. గుదమున మంట,

పసుపువర్ణము, అజీర్తిలక్షణములు, నిస్త్రాణ—ఆర్సెనికం ఆల్బం. మూతినుండి ముడ్డివరకు మంటతో—ఐరిస్.

## 44. Diphtheria కంఠరోహిణి.

కుట్టుచున్నట్లు నొప్పి, గొంతు మిక్కుటముగా వాచుట-ఎపిస్. జ్వరము, నోరు దుర్వాసన, నాడి వేగముగ నుండుట, నిస్త్రాణ, గొంతులో నల్లబడుట—ఆర్సెనికం ఆల్బం. ముక్కు వెంట రక్తముకారుట—క్రోటలస్. వాపు కంఠమున ఎడమ భాగమున ప్రారంభించుట—లెకెసిస్. కుడిభాగమున ప్రారంభించుట—లైకోపోడియం. వాపు ముక్కులలోనికి గూడ వ్యాపించుట, నోరు శ్వాస దుర్వాసనవేయుట, ముక్కువెంట రక్తము కారుట-మెర్క్యూరియస్.

ఈవ్యాధిలో మిక్కిలి యనుభవముకలవారే వైద్యము చేయ సాహసింపవలెను.

## 45. Dropsy నంజు.

పరుండినవైపునకు నీరుదిగుట, దాహము, అతిసారము, నీరుత్రాగిన బాధ—ఎపోసైనంకెనాబినం. దాహముతరుగుట, అడుగురెప్పక్రింద ఉబ్బు, మూత్రముతరుగుట—ఎపిస్. పాదములు మోకాళ్లు ఉబ్బుట, పగలు హెచ్చుచు రాత్రితగ్గుట-బ్రయోనియా. గుండెవ్యాధితో చేరియుండి యెడమపాదము ఎడమచెయ్యివాపు—కేక్టస్. కాలేయము స్ప్లీహము వాచి పాండువు నీరసము అతిసార అజీర్ణవిరేచనములతో - చైనా.

మూత్రము తరుగుట, నాడిగతి సక్రమముగ లేకపోవుట-డిజిటా లిస్. ఎడమబుగ్గపై రెప్ప ఉబ్బు, నీరసము, అతిసారము, పొట్టలో నొప్పి—కాలీకార్బానికం. చర్మవ్యాధులు అణచిపెట్టుటచే- సల్ఫరు. మిక్కిలి దాహము, కొద్దికొద్ది నీరుత్రాగుట, శ్వాసము కష్టముగా తీసుకొనుట—ఆర్సెనికంఆల్బం. నల్లని మూత్రము, వంజుచూపిన భాగము నలుపులేక నీలవర్ణముగా మారుట— లెకెసిస్. శరీరముయొక్క క్రిందిభాగము వాచుట కాలేయము చెడుట, కాళ్లపై పుండ్లు—లైకోపోడియం.

## 46. Dysentery గ్రహణి.

గుదమున మిక్కుటమగు బాధ, జిగురుతో కలసిన రక్తము, చల్లనిచెమట, వణుకు-మెర్క్యూరియస్. ఇదియే లక్షణ ములతో ప్రేవులు మెలితిరుగుచున్నట్లు నొప్పి. నొప్పి తగ్గుటకు రోగి ముందుకు వంగుట-కోలోసింథ్. ఉదయము పెక్కుమా ర్లగుట, కొద్దిరక్తము కలిసియుండుట, విరేచనము పూర్తిగా కాలేదని యనుమానము-నక్సువామికా. మంటతో కూడిన దాహము, నిస్త్రాణ-ఆర్సెనికంఆల్బం. నాలుకకొన త్రికోణాకార ముగ నెఱ్ఱబడుట-రూస్టాక్సు. మేహవాతపునొప్పులు తగ్గి గ్రహణియు, గ్రహణి తగ్గి మేహవాతపునొప్పులు వచ్చుట-కాలీ బైక్రోమికం. మూత్రపుసంచిలోను గుదమునను మిక్కిలి బాధతో-కేంథారిస్. విరేచనము సులభముగ జారుచున్నను మహాబాధ కల్గుట-ఫాస్ఫరస్. కాలికవ్యాధిగామారుట, ఆకు

పచ్చని జిగురుపడుట, లేదా గుడ్డలకంటి నిలువయుండిన ఆకు పచ్చగనగుట-అర్జెంటం నైట్రికం. విరేచనమగునప్పుడు ముందు నొప్పిగల్గిన-నక్సువామికా. విరేచనమగునప్పుడు తరువాత నొప్పి గల్గిన-ఇపెకాక్. విరేచనమగుటకు ముందు, అగునప్పుడు, వెనుక గంటవరకు బాధ-ఆసిడ్ నైట్రిక్. మూత్రమగునపుడు మంట, మూత్రము ఆగుట, లేక అణచిపెట్టబడుట, రక్తముతో కలసిన జిగురు-మెర్క్యుకర్.

## 47. Dysmenorrhœa. ఋతుశూల.

[స్త్రీల వ్యాధులలో చూడుడు.]

## 48. Dyspepsia and Indigestion అగ్నిమాంద్యము-అజీర్ణము.

వ్యాధి తరుణస్థితిలోనున్నప్పుడు ఉదయము కాక్యులస్-సాయంత్రము నక్సువామికాలను వాడిన మంచి పనిచేయును.

పుల్లని త్రేనుపులు, పుల్లని వాంతులు, గుండెమంట, కాల్కేరియాకార్బ. ఆహారము- శ్లేష్మముతోగూడిన పైత్య రసము-వాంతిజేసుకొనుట-కెమోమిల్లా. పొట్టలో గాలిచేరుట, పుల్లని త్రేనుపులు-కార్బోవెజ్. పొట్టబరువు, మంట, నోరు, చేదు, నీటివిరేచనము-బ్రయోనియా. ఏది తిన్నను రుచిలేక పోవుట-పల్సటిల్లా. కడుపులోమంట, దాహము, నిస్త్రాణ-ఆర్సెనికంఆల్బం. పొట్టలో మంట, ఎడమవైపు గాలి చేరి నొప్పి-

సల్ఫరు. అన్నము తినినవెంటనే పొట్టలోబాధ-కాలీబైక్రోమికం. పొట్ట ఖాళీగానున్నట్లు తోచుట, భోజనముచేయుటచే బాధ తగ్గుట-యనకార్డియం. రోగి పుల్లనివస్తువులు కోరుచుండుట-హెపారుసల్ఫు. తినినయాహారపురుచితో పెద్దశబ్దముచేయు త్రేన్పులు, పొట్ట పగులునా యన్నట్లు గాలిచేరుట, జఠరసంబంధమగు పుండు-అర్జెంటం నైట్రికం. కొంచెము నీరుత్రాగినను గాసుగా మారుట-కాలీకార్బానికం. కొవ్వుపదార్థములు తినుట వలన-పల్సటిల్లా. చల్లగాలి మారి వేడిగాలి వీచురోజున-బ్రయోనియా. ఐస్ క్రీమ్ తినుటవలన—ఆర్సెనికంఆల్బం. చల్లని పానీయములవల్ల గాసుచేరుట-ఎకోనైట్. ప్రేవులు మెలిబెట్టినట్లు నొప్పితో-కుప్రంమెట్. పొట్ట ఖాళీయైనట్లు తోచుట, భోజనమువలన తృప్తిలేకపోవుట-ఇగ్నేషియా. నల్లని రక్తవమనము-హెమామిలిస్. యెఱ్ఱని రక్తవమనము - ఇపెకాక్. నాలుక తెల్లగానుండిన—ఆంటిమోనియం క్రూడం. భోజనమైన వెంటనే పొట్టలో బరువుగానుండుట-బ్రయోనియా, కాలీబైక్రోమికం, నక్సుమోస్కేటా. భోజనమైనగంటకు బరువు బాధకల్గుట-నక్సువామికా. ఆలస్యముగా జీర్ణమగుట-చైనా. పొట్టలో గాలి చేరి త్రేన్చినను, అపానవాయువు వెడలినను బాధ తగ్గకుండుట-చైనా. త్రేనుపువచ్చుటచే బాధ తగ్గుట—కార్బోవెజ్. అపానవాయువు వెడలుటచే బాధతగ్గుట-లైకోపోడియం. సామాన్యమగుఆకలి, కొద్దిముద్దలు తినగనే తృప్తి-సల్ఫరు. అతిఆకలి, కొద్దిముద్దలు తినగనే కడుపునిండుట-లైకో

పోడియం. పగలు తినినయాహారము జీర్ణముకాక నిలువయుండి రాత్రి వమనమగుట-ఫెరంమెట్. పొట్టకు దెబ్బతగులుటవలన అగ్నిమాంద్యం-ఆర్నికా.

## 49. Ear-diseases కర్ణరోగములు.

**శూల.**—సాధారణబాధలు-పల్సటిలా, బాధ పూర్తిగా పల్సటిల్లాచే తగ్గనిచో మెర్క్యూరియస్. నొప్పులు మాటిమాటికి వచ్చుచు చెవినుండి చీముకారుచున్న-హెపార్ సల్ఫ. ఇవియేవియు పనిచేయనిచో రూస్టాక్సును వాడవలెను. చెవులు వేడికానుండి వాచియున్న-కెమోమిల్లా. చెవిగ్రంధులు వాచిన-బెల్లడోనా. చెవిలో నెత్తిగానుండి పోటు గల్గిన-సల్ఫరు.

**స్రావము**—దుర్వాసనవేయుస్రావము-హెపార్ సల్ఫ. పచ్చని చిక్కనిస్రావము-మెర్క్యూరియస్. పచ్చని చిక్కని దుర్వాసన స్రావము-పల్సటిల్లా. చెవిలో పెద్ద ధ్వని కల్గుట, చీము-సైలీషియా.

**చెవుడు**—దెబ్బ తగులుటచే—ఆర్నికా. చీము, చెవిలో ధ్వని-బెల్లడోనా. గుబిలిచేరుట, తనశబ్దము ప్రతిధ్వనించుట—కాస్టికం. జబ్బుపడి లేచుటవలన కల్గు చెవిలో శబ్దముతో-చైనా. ముసలివారిలోను, జబ్బుపడిలేచిన వారిలోను-ఫాస్ఫరస్. చీము కారుచు—మెర్క్య, హెపార్, సిలికాలు. ములెన్ ఆయిల్ చెవిలో వేసిన పోటు, చీము, చెవుడు వీటిని తగ్గించును.

## 50. Enuresis నిద్రలో మూత్రము విడుచుట.

పిల్లలు నిద్రపోవగనే మూత్రము విడుచుట—సేపియా. పులిపిరికాయలు గలవారు—తూజా. మూత్రద్వారము ఎఱ్ఱగ నుండువారు—సల్ఫరు. విరేచనమున నులిపురుగులు కనుపించిన—సినా.

## 51. Enteritis ప్రేవులు వాపుచే పనిచేయకపోవుట.

[See Peritonitis.]

## 52. Epilepsy మూర్ఛ.

తలకు హెచ్చుగా రక్తముచేరుటచే—బెల్లడోనా, ఇగ్నేషియా, నక్సువామికా, ఓపియం. హిస్టీరియాలక్షణములతో కూడియుండిన—బెల్లడోనా, కాక్యులస్, హాయోశ్యామస్, ఇగ్నేషియా, నక్సువామికా, సిమిసిఫ్యూగా. ఉద్రేకము భయము ఆశ్చర్యములవలన కల్గినచో—కుప్రంమెట్, హాయోశ్యామస్, నక్సువామికా, ఓపియం వీటిని లక్షణములననుసరించి వాడవలెను.

## 53. Epistaxis ముక్కువెంట రక్తముకారుట.

తలలోని రక్తనాళములకు హెచ్చురక్తము చేరుట వలన—ఎకోనైట్. ముక్కునకు దెబ్బతగులుటవలన-ఆర్నికా. నీరసముతోనుండుట, హెచ్చు రక్తస్రావము—చైనా. అటునిటు కదలిన స్రవించుట—హెమామిలిస్. బహిష్టు కావలసిన దినములలో నగుట-బ్రయోనియా.

## 54. Erysipelas సర్పి.

వేడి, వాపు, ఎరుపు, ఎడమభాగములయందు-రూస్టాక్సు. వేడి, వాపు, ఎరుపు, కుడిభాగములయందు, ముఖముమీద—బెల్లడోనా. గ్రుచ్చుచున్నట్లు నొప్పితో తెల్లసర్పి—యాపిస్. పెద్దపెద్ద నీటిబొబ్బలు మంటతోకూడియుండిన—కేంథారిస్. నీలవర్ణపురక్తము నిండినపొక్కులు-లెకెసిస్. ముక్కుమీద చెవుల వెనుక కల్గి తేనెవంటి స్రావము వెడలుచున్న—గ్రాఫైటిస్. ఇతరచోట్లకు ప్రాకుచుండిన—మెర్క్యూరియస్.

## 55. Eye diseases నేత్రవ్యాధులు.

ఎర్రబడుట వేడి తగులుట—ఎకోనైట్. వెలుతురు చూడలేకపోవుట, తెల్లగ్రుడ్డు ఎఱ్ఱబడుట, కంటిచుట్టును బాధ, తలనొప్పి-బెల్లడోనా. కనుగ్రుడ్లు నొప్పులు, వెలుతురు చూడలేకపోవుట, ముక్కువెంట నీరుకారుట—ఇగ్నేషియా, కనురెప్పలపై కురుపులులేచుట—గ్రాఫైటిస్. రెప్పలువాచుట, పుసికారుట—మెర్క్యూరియస్, హెపార్ సల్ఫు. పైరెప్పవాపు, ఎరుపు—యాపిస్. చూపుమధ్యము, ఒకవస్తువు రెండుగా కనబడుట-జెల్సిమియం. కన్నీళ్లు మిక్కుటముగా కారుట-స్పైజీలియా. కండ్లకలక—అర్జెంటం నైట్రికం. దుర్మాంసములు, పుసి, వెలుతురు చూడలేకపోవుట-అర్జెంటం నైట్రికం. భరింపలేనంత నొప్పి-కెమోమిల్లా. కన్ను ఇసుకపడినట్లు మెరమెరలాడుట, ప్రమేహరోగుల కలక-మెర్క్యూరియస్.

## 56 Fainting సొమ్మసిల్లుట.

భయమువలన-ఎకోనైట్. గుండె బలహీనత, బిగింపు వలన—ఎమిల్ నిట్. (3, 4 చుక్కలు దూదిపై వేసి వాసన చూపించవలెను.) బాధ భరింపలేక, తీవ్రమగుకోపము కల్గుట చేత—కెమోమిల్లా. అధికముగ ఔషధసేవ చేయుటవలన, ధాతునష్టము కల్గుటవలన-చైనా. బహిష్టుదినములలో-కాక్యులస్. అధికముగ చదువుటవలన, దురలవాట్లవలన-నక్సువామికా—ముక్కువెంట రక్తముకారుటవలన-మెల్లిలోటస్. కొద్దిబాధ గల్గినను—హెపార్ సల్ఫ. చికాకువలన, దుఃఖము వలన, ధాతునష్టమువలన-ఆసిడ్ ఫాస్.

## 57. Feet పాదములు.

ఆనలుపెరిగి నడుచుటవలన నొప్పిగల్గుట—ఆంటిమోనియంక్రూడం. దుర్వాసనవేయు చెమటపోయుట-సైలీషియా. మడమలు నొప్పులు-సైక్లమెన్. అరికాళ్లమంట-సల్ఫరు. చల్లగనగుట—కాల్కేరియాకార్బ. అరికాళ్లనొప్పులు, **పాదములు ఎల్లప్పుడు కదలించుచుండుట**—జింకం. నీటిలో నానుటచే పాయుట—ఎగేరికస్. కొంకర్లు—కుప్రంమెట్. చీలమండలు బలహీనమగుట—కెమోమిల్లా. చీలమండలు తెల్లగా వాచుట-ఎపిస్. అరికాళ్లు చెమటవలన పుండ్లుపడుట—బెరీటాకార్బ. అరికాళ్లు నేలపై మోపలేకపోవుట, నొప్పి—పల్సటిల్లా. అరికాళ్లు మడమలు నడుచునపుడు బాధగానుండుట—లేడం.

పాదములు భూమిపై మోపలేక మోకాళ్లతో నడుచుట—మెడోరినం. అరికాళ్లువాపు, నొప్పి—లైకోపోడియం.

## 58. Fevers జ్వరములు.

### (1) Simple fever సాధారణజ్వరము—ఎకోనైట్.

చావునుగూర్చిన భయము, చల్లనినీటిని కోరు దాహము, విశ్రాంతి లేకపోవుట-ఎకోనైట్. చలి, వేడి, కొద్దికొద్ది నీరు పదే పదే త్రాగుట, వాంతియగుట, తరుచు స్థలము మార్చుచుండుట-ఆర్సెనికంఆల్బం. అతివేడి, కదలలేకపోవుట, కప్పుకొనినగుడ్డ తొలగిన చలి—నక్సువామికా. ప్రాకుచున్నట్లు చలి, చెమటలు, జ్వరము, నోటివెంట నీరూరుచుండుట—మెర్క్యూరియస్. మగత, బద్ధకము, నోటిపూత—జెల్సిమియం. బడలిక, విభ్రాంతి, ఎఱ్ఱనిముఖము—బెల్లడోనా. చర్మము ఎండుకొని వేడిగా నుండి మంటలు కల్గుట—సల్ఫరు.

### (2) Intermittent or Malarial fever విరామజ్వరము లేక మన్యపుజ్వరము.

క్వైనా కొందరిలో చలిజ్వరములను కప్పిపుచ్చును గాని తొలగించదు. చలిజ్వరములు వచ్చుఋతువులో ప్రప్రథమమున జ్వరము తగిలి చలివేయుటకు ప్రారంభింపగనే ఎకోనైట్ నొకమోతాదు సేవించినచో మరల చలిజ్వరము తగులకుండ చేయును.

నడుమునొప్పి, ఎముకలలో నొప్పులు, ఉదయము 7-9 గంటలకు చలి, దాహము కల్గుట, త్రాగిననీరు వెళ్లిపోవుట-యూపటోరియంపెర్ఫ్.

జర్వము ఎక్కువసేపుండుట, చెమట, వాంతి-ఇపెకాక్. చలి యెక్కువసేపుండుట, చల్లనిచెమట, అలసట-విరేట్రంఆల్బం. వేడి యెక్కువసేపుండుట, అతిదాహము, చలిబాధ యంతగా లేకుండుట—ఆర్సెనికంఆల్బం. జ్వరము ఒకదినముకంటె మరియొకదినము పెందలకడవచ్చుట-ఆర్సెనికంఆల్బం. చలి 10-11 గంటలకు ప్రారంభించుట, వేడి తగిలినపుడు తల పగులుచున్నట్లు తలనొప్పి-నేట్రంమూరు. చలివేయునపుడు ముఖ మెఱ్ఱబడుట_ ఫెరంమెట్. చలి భుజములమధ్య బయలుదేరుట-కాప్సికం, జ్వరము ఒకేకాలమునకు చలిలేకుండా వచ్చుట-జెల్సిమియం. మత్తు, నాలుకచివర త్రికోణాకారముగ ఎఱ్ఱబడుట, కదలిక వలన నొప్పులు తగ్గుట—రూస్టాక్సు. బద్ధకము, నిద్రపట్టక పోవుట, శ్లేష్మలక్షణములు—ఆంటిమోనియం టార్టారికం. శరీరమంతయు చల్లగనుండుట, పిక్కలలో నొప్పులు, నుదుట చెమట—విరేట్రం ఆల్బం. పదేపదే తెమల్చుకొనుచుండుట (వాంతికాదు), కన్నులు సగము తెరచియుంచుట, మూల్గుచు తలత్రిప్పుచుండుట—పోడోఫైలం. తల వెనుకను, మెడ మీదను చెమటపోయుట, వ్రేళ్లు మంచుగడ్డవలె చల్లగనగుట, విపరీతమగుచలి—(దాహముండదు). ఆసిడ్ ఫాసు.

N. B. ఆర్సెనికం ఇపెకాక్‌లను కాని, నక్సువామికా ఇపెకాక్‌లనుకాని మార్చి వాడిన పెక్కురకములగు చలిజ్వరములు నివారింపబడును.

(3) Black fever నల్లజ్వరము. ఎకోనైట్, బెల్లడోనాలను మార్చివాడిన తగ్గును.

### (4) Puer peral-fever సూతికాజ్వరము.

క్షణక్షణము బుద్ధి మార్పునెందుట, తాను ప్రేమించిన వారు చనిపోవుటవలన కల్గుదుఃఖమువలన అంగములు కంపించుచుండుట-ఇగ్నేషియా. మైల సక్రమముగా జారీకాకపోవుట వలన రోగి కదలిన వ్యాధి హెచ్చుట-బెల్లడోనా. భయపడుట వలన—ఓపియం. తెరలు బలహీనతచే వచ్చుచు తగ్గుచున్న—హామోశ్యామస్. వెంటవెంట తెరలువచ్చుట—సికూ్యటా విరోసా.

### (5) Typhoid సన్నిపాతజ్వరము.

బాధ వెన్నెముకనుండి మెదడులోనికి పోవుచుండుట-ఎపిస్. ప్రశ్నించిన సరియైనజవాబిచ్చుచు మరల మగతజెందుట, నాలుకచివర త్రికోణాకారమువలె నెఱ్ఱబడుట-రూస్టాక్సు. మగత, కదలలేకపోవుట, ఆలోచనాశక్తి తగ్గుట, జవాబిచ్చుచు మగతజెందుట-జెల్సిమియం. పాలిపోయిన ముఖము, కన్నులు పెద్దవిచేసి చూచుట, ఏమి చూచునది తెలుసుకొనలేకపోవుట—హామోశ్యామస్. కంఠము ఎడమ

భాగమున నీలవర్ణముగనగుట, వెచ్చనిచెమట, నిద్రలేవగనే వ్యాధి హెచ్చుట-లెకెసిస్. రోగి విసరమని కోరుట, చల్లని దేహము, మోకాళ్లకుదిగువ నతిశీతలము, కదలక పరుండుట, చల్లనిశ్వాస, చర్మము నీలవర్ణముగ మారుట-కార్బోవెజ్. మగత, హెచ్చరికచేసిన సర్వమును గ్రహింపగల్గుట, పొట్టలో మంట—ఫాస్ఫరస్. శరీరమంతయు నొప్పి, మలము మూత్రము చెమటలు దుర్వాసన, జవాబుచెప్పుచుండగనే స్పృహ తప్పుట-బాప్టీషియా. నుదుట చెమటపోయుట, చర్మము నీలవర్ణముగ మారుట-విరేట్రం ఆల్బం. రక్తస్రావములు-హెమామిలిస్. తారువలె విరేచనము-లెప్టాండ్రా. నాలుక చిన్నదగుట, రోగి మూల్గుచుండుట, నోరు పుండ్లుపడుట, మూత్రము విడువ యత్నించిన మలము కూడ వెడలుట-ఆసిడ్ మ్యూరియాటిక్.

## (5) B సంధిలక్షణములు.

కంటిపాప యొకటి పెద్దది, మరొకటి చిన్నదిగ నగుట—జెల్సిమియా. బట్టలిప్పివేయుట, బూతుమాటలు పల్కుట, నవ్వుట, కులాసాగానుండుట, తీవ్రమగుసంధిలక్షణము లుండునుగాని బలహీనతచే తగ్గుచుండును-హాయోశ్యామస్. దగ్గర నున్నవారిని కొరుకుటకు కొట్టుటకు యత్నించుట, పారిపోవ జూచుట, దయ్యములు భూతములు నల్లనిజంతువులు కనుపడి భయముచెంది కేకలువేయుట, తల వేడిగానుండుట, కన్ను లెఱ్ఱబడుట—బెల్లడోనా. చీకటిగానున్న దేమని లైట్ లైట్

అనియు అరచుట, దయ్యములు కనుపడినట్లు వానితో మాట్లా డుట, పాములు జంతువులు తనదగ్గరకు వచ్చుచున్నట్లు కేకలు వేయుట-స్ట్రామోనియం.

### (6) Yellow fever పచ్చజ్వరము.

కార్బొవెజ్, క్రోటలస్.

## 59. Fistula భగందరము.

ఎముకలలో నొప్పులు, సవామేహదోషముతో-మెర్క్యూరియస్. చల్లనిగాలిని భరింపలేనివారిలో-హెపార్ సల్ఫ. చీము కారుచుండిన—సైలీషియా. పరిశ్రమవలన చేతులు మొద్దుబారుట-మిరిస్టికా. తేనెవంటి స్రావముతో—గ్రాఫైటిస్. చురుకుచురుక్కు మనుపోట్లతో-ఆసిడ్ నైట్రిక్, మలబద్ధకము కలవారిలో—నేట్రం మూరు.

## 60. Flatulance పొట్ట ఉబ్బరము.

అగ్నిమాంద్యము చూడుడు.

## 61. Gonorrhœa ప్రమేహము. (పూయమేహము.)

ప్రథమావస్థ—ఎకోనైట్.

మంట, మూత్రము చుక్కలుగాపడుట, లేపనము కల్గుచుండుట, రక్తము వెడలుట, } —కేంథారిస్.

మూత్రము విడుచునపుడు మంట, పచ్చని చీము కారుట, అంగమునకు గుడ్డ తగిలిన నొప్పి కల్గుచుండుటచే కాళ్లను వెడ ల్పుగా నుంచి నడుచుట. } —కెన్నబిస్‌సటీవా.

లక్షణములననుసరించి యితరమందులు వాడుటకు కుదరనికేసులలో. } —కెన్నబిస్ సతీవా.

కెన్నబిస్ సతీవా వాడిన పిమ్మట, స్రావము చిక్కగా ఆకు పచ్చగా నగుచుండి మంటతోకూడియుండిన— మెర్క్యూరియస్ కరోసివస్ వాడవలెను. స్రావము ఇంకను ఆకుపచ్చగా చిక్కగా నుండుచో పల్సటిల్లాగాని నేపియాగాని వాడవలెను.

ప్రమేహము కాలికస్థితిగా మారిన, సల్ఫరు, మెడోరినం, తూజాలను వాడవలెను.

## 62. Grave మూత్రములో రాళ్లు.

మూత్రములో నెఱ్ఱనిగసి పడుచుండుటను నిర్లక్ష్యము చేయుటచే నేర్పడినచో—లైకోపోడియం. తెల్లనిగసి పడుచుండి యేర్పడిన—సారసపరిల్లా, నక్సువామికా, పోడోపైలములను మార్చి వాడిన రాళ్లు కరుగును.

చైనా 15 వపొటెన్సీలో రోజున కొకమోతాదువంతున నెలదినములు వాడిన నిరోధకౌషధముగా పనిచేయును.

## 63. Grippe-Influenza విషపడిసెము.

కండరములు నీరసము జెందుట, చలి, జ్వరము, మగత-జెల్సీమియం. ఎముకలు పగిలిపోవుచున్నట్లు నొప్పులతో—యూపటోరియంపెర్ఫ. వ్యాధి యాకస్మికముగ వచ్చుట, నిస్త్రాణ—ఆర్సెనికం ఆల్బం. జలుబులక్షణములు ముక్కువాపు,

శ్వాసదుర్వాసన-మెర్క్యూరియస్. కాళ్లుచేతులు బరువు, కదలిన బాధ, నుదురునొప్పి-బ్రయోనియా.

ఎకోనైట్. ఈవ్యాధికి నిరోధకౌషధము.

## 64. Gum boil చిగురువాపు.

వేడి, నొప్పి, వాపు—ఎకోనైట్. అందువల్ల తగ్గనిచో బెల్లడోనా. రక్తపుపోటుతో నొప్పి—మెర్క్యూరియస్. చీము పట్ట మొదలిడిన-హెపార్ సల్ఫ. చీముకారుచున్న-సైలీషియా.

## 65. Headache తలనొప్పి.

తల పగులగొట్టుచున్నట్లుండుట, వెలుతురు శబ్దము కదలికవలన హెచ్చుట—బెల్లడోనా. నిద్రనుండి లేవగనే హెచ్చుట—లెకెసిస్. అతిగా తినుటవలన త్రాగుటవలన నిద్రనుండి లేవగనే—నక్సువామికా. అజీర్తిలక్షణములతో—నక్సువామికా. తలబరువుగానుండుట, నొప్పి ముచ్చిలగుంటలో బయలుదేరి కన్నులపైభాగమునకు చెరి బాధించుట—జెల్సిమియం. కన్నులు కదల్చినను తల కదల్చినను బాధ—బ్రయోనియా. ప్రతిదినము వచ్చుట-చైనా. వాంతులతో-ఇపెకాక్. ఉదయము ప్రారంభించి 12 గంటకు హెచ్చి సాయంత్రమునకు తగ్గుట—శాంగ్వినేరియా. బేడబిళ్ల వెడల్పున మాత్రముబాధ-కాలీబైక్రోమికం. కుడివైపు-సైలీషియా. శాంగ్వినేరియా. ఎడమవైపు-నరములసంబంధమైనది-స్పైజీలియా.తలపెద్దదైనట్లు తోచుట-అర్జెంటం నైట్రికం. బహిరంగమగుగాలిలో తగ్గుట-

పల్సటిల్లా. పైత్యసంబంధమగు నొప్పి-మెర్క్యూరియస్. తలలో మేకుకొట్టుచున్నట్లు బాధ-ఇగ్నేషియా. లేచిన తలతిరుగుట, తెమల్చుట, వాంతి-కాక్యులస్. తల యదురుటచే తలనొప్పి-సేపియా. మంటలతోకూడిన తలనొప్పి-ఫాస్ఫరస్, సల్ఫరు. యెండదెబ్బ తగులుటవలన-గ్లోనైన్. నీటిలో మునుగుటవలన-బెల్లడోనా, ఆంటిమోనియంక్రూడం. పరుండిన - బెల్లడోనా. సుత్తెతో కొట్టుచున్నట్లు పాండురోగులలో కల్లు నొప్పులు—నేట్రంమూరు. ఉపవాసముండుటవలన-సిమిసిఫ్యూగా. తీవ్రాలోచనవలన-నక్సువామికా. బెల్లడోనా. ఏడ్చుటవలన-పల్సటిల్లా, ఇగ్నేషియా. బిగించినట్లు నొప్పి-కేక్టస్, జెల్సీమియం. కంటివెంట నీరుగారుచు-కాలోసైలం, బెల్, ఇగ్నేషియా. మత్తుతో-జెల్సీమియం, ఓపియం. ఆవలింతలతో-నక్సువామికా. సైప్రజీలియా, ఇగ్నేషియా. ఉదయము - బ్రయోనియా, సేపియా, కాక్యులస్పోడోసైలం. మధ్యాహ్నము—ఆర్సెనికం, సిమిసిఫ్యూగా. సాయంత్రము—పల్సటిల్లా, బ్రయోనియా. రాత్రి—మెర్క్యూరియస్. బాధను భరింపలేకపోవుట-కెమోమిల్లా.

## 66. Heart-burn. గుండెలో మంట.

సారాయి మొదలగువానిని సేవించువారిలో-నక్సువామికా. త్రేన్పులవలన గొంతుకవరకు మంట-కార్బోవెజ్. భరింపలేనంతమంట—ఫాస్ఫరస్, సల్ఫరు.

## 67. Hernia ఒరిబీజము.

కుడివైపు—లైకోపోడియం. అజీర్తివలన బాధపడు వారిలో—నక్సువామికా. సవామేహరోగులలో—ఆరంమెట్. గనేరియా జితించుటవలన-క్లెమెటిస్, పల్సెటిల్లా. మేహవాత రోగులకు—రోడోడాండ్రన్.

## 68. Herpes zost చంకతాళి.

రూస్టాక్సు ప్రధానౌషధము.

## 69. Hiccough ఎక్కిళ్లు.

నక్సువామికా ప్రధానౌషధము. పైత్యలక్షణములతో నుండిన-బ్రయోనియా. తీవ్రమగుఎక్కిళ్లు—జిన్‌సెంగ్.

## 70. Hoarseness గొంతు బొంగురు.

సాయంకాలపు చల్లగాలివలన—కార్బోవెజ్. స్వరపేటికలో నొప్పితో—ఫాస్ఫరస్. శబ్ద మొకసారి హెచ్చుగను మరొకసారి తగ్గుగను వచ్చుట, స్వరపేటికనాళములు పక్షవాతము జెందుట—కాష్టికం - కంఠమునకు గట్టిపని కల్పించుటచే (అరచుట వగైరా)—ఆర్నికా. సవామేహవ్యాధి శరీరమున జితించుటచే—ఆరంమెట్.

## 71. Hysteria అపస్మారము.

శరీరవ్యాధులు తగ్గిన మనోవ్యాధులు, మనోవ్యాధులు తగ్గిన శరీరవ్యాధులు వచ్చుట-ప్లాటినా. గర్వస్వభావము, వస్తు

వులు చిన్నవిగ కనబడుట—ప్లాటినా. సులభముగా కోపము జెందుట, కొద్ది శబ్దమునకే భయపడుట, ఏ వాసన తగిలినను సొమ్మ సిల్లుట—నక్సువామికా, బుద్ధి క్షణక్షణము మారుట, అంతలో నవ్వుట, అంతలో నేడ్చుట, సహనము లేకపోవుట, పోట్లా డుట—ఇగ్నేషియా. నెమ్మదిగానుండుట, ప్రతిచిన్నవిషయము నకు కంటివెంట నీరుకారుట, ఓదార్చుటచే తగ్గుట, మొదలు తుదిలేనివ్యాధి—పల్సటిల్లా. భయము, కేకలువేయుట, సంగీ తము భరింపలేకపోవుట—ఎకోనైట్. ఏపనికిని ధ్యానముం డకపోవుట, వ్యతిరేకభావము, నిరాశ-ఎపిస్. మాట తడబడుట, జనసమూహామును చూచి భయపడుట, ప్రతిపనిలోను తొందర- అర్జెంటం నైట్రికం. ఏడ్చుచుండుట, ప్రార్థనచేయుచుండుట, చెప్పినది కాదనిన కోపము, నిరాశ, ఆత్మహత్యచేసుకొన గోరుట—ఆరంమెట్. దయ్యములు రాక్షసులు కనబడినట్లు తప్పించుకొని పారిపోవయత్నించువారికి—బెల్లడోనా నవ్వుట, నాట్యముచేయుట, తనపేరు మరచుట—సిక్యూటావిరోసా. ఒక దానినిగూర్చి చెప్పుచు మరొకదానిలోనికి మార్చుట, బహి ష్టులో అపస్మారము—సిమిసిఫ్యూగా. ఏదియో పాడుపనిచేసితి ననుకొనుట—సినా. సిగ్గువిడిచి వర్తించుట, ప్రతిదానిలో నను మానము-హాయోశ్యామస్. తన్ను ఏదియో శక్తి యావ హించిన దనుకొనుట, అధిక ప్రసంగములు చేయుట - లెకెసిస్. తనశరీరము ఆత్మ విడదీయబడినట్లు తోచుట, తనప్రక్కన నొక నూతనవ్యక్తి యున్నట్లు తోచుట, తనకాళ్లను చేతులును

గాజుతో చేయబడినట్లు తోచుట—తూజా. ఋతువు ఆగుట వలన కల్గుట, గొంతులో బంతియున్నట్లు భావన—ఎసఫోటిడా. ఋతుశూల కల్గుసమయమున—కాలోఫైలం. తానొక మహా రాజునని తలచుట, పదిమందిలోనుండుట కిష్టములేక ఒంటరిగా నుండలేక యుండుట—కోనియం.

## 72. Impotence నపుంసకత్వము.

ఇంద్రియస్ఖలనము, తనశక్తియందు నమ్మకము తరుగు పిరికితనము—సెలీనియం. ఇంద్రియస్ఖలనము, అతిసంభోగము, ముష్టిమైథునము—ఆసిడ్ ఫాసు. అజీర్తి, తలనొప్పి, నీరసము—నక్సువామికా. అకాలమున వెండ్రుకలు నెరియుట, అతి ఆకలి, కొద్దియాహారమువల్లనే కడుపునిండుట, పురుషాంగము చల్లగనుండుట—లైకోపోడియం. సంభోగవాంఛ లేకుండుట, కల్గినను సామర్థ్యము లేకుండుట—ఫాస్ఫరస్.

## 73. Influenza

విషపడిశెములో చూడుడు.

## 74. Itch గజ్జి.

ప్రతి వసంతఋతువులో వచ్చు గజ్జి, తామర, దురద—సేపియా. దురద, గోకుటచే మంట కల్గుట, దుర్వాసనవేయు చీము వెడలుట—సల్ఫరు.

కేంథారిస్, సల్ఫరు, తూజా ఈమూటిని వరుసగా మూడు దినములు వాడి, మరల మొదలిడి తగ్గువరకు మార్చుచు వాడవలెను.

## 75. Jaundice కామిల

కాలేయవ్యాధులు చూడుడు.

## 76. Leucorrhœa కుసుమ.

స్త్రీలవ్యాధులు చూడుడు.

## 77. Liver Diseases కాలేయవ్యాధులు.

నాలుక చర్మము కన్నులు పసుపువర్ణముగా నగుట—కాలేయస్థానమున తాకిన నొప్పి—మెర్క్యూరియస్.యెల్లోపతి మందులను బజారు (పేటెంటు) మందులను అధికముగా సేవించుటవలన కల్గు కాలేయవ్యాధులు—నక్సువామికా. కాలేయము వాచుట, కన్నులు ముఖము పచ్చగానగుట, ఏది తినినను రుచి తెలియకపోవుట—పోడోపైలం. కుడిభుజాస్థిక్రింద లోవైపు బాధ—చెలిడోనియం, బ్రయోనియా. కాలేయస్థానమున చుక్కలుపడుట—సేపియా. చర్మము పచ్చబడుట, ముఖమున మొటిమలులేచుట, నాలుక బండబారుట-కాలీబైక్రోమికం.

## 78. Lock-jaw హనుగ్రహవాతము.

ధనుర్వాతము చూడుడు.

## 79. Lumbago కటివాతము.

ఆకస్మికముగ కల్గు కత్తితో కోసినట్లు పుండుపడినట్లు బిగించియుండునట్టి నొప్పులు—రూస్టాక్సు. దీర్ఘకాలమునుండి నిలువయున్న చో—సల్ఫరు.

## 80. Malarial fever మన్యపుజ్వరము.

జ్వరములలో చూడుడు.

## 81. Murasmus చిక్కిపోవుట.

పైయవయవములు చిక్కి, తరువాత క్రిందివి చిక్కుట—నేట్రం మూరు. లైకోపోడియం. క్రిందియవయవములు చిక్కి పైవి చిక్కుట-ఎబ్రోటేనం. మెడ చిక్కుట, చర్మము ముడుతలు పడుట—సారసపరిల్లా. చక్కగ తిని జీర్ణము చేసుకొనుచున్నను చిక్కిపోవుచుండుట—నేట్రం మూరు. పిల్లలు ఎండుకొని యుండి తెలివిలేనివారివలె ముసలివారివలె లక్షణములు కనుపడుట—అర్జెంటం నైట్రికం. తలకు చెమటపోయుట, శరీరమంతయు చల్లగనుండుట, శరీరము చిక్కి, తల పెద్దదిగ కనుపించుట—కాల్కేరియాకార్బ. అతి ఆకలి, అర్ధరాత్రి భోజనము చేయుటకు నిద్రనుండి లేచుట, శరీరమంతయు చిక్కుట—అయోడియం. పొట్ట లావుగానుండి శరీరమంతయు చిక్కుట-సిలీషియా. శరీరము పుల్లనివాసనవేయుట, విరేచనము పుల్లని వాసనవేయుట—హెపార్ సల్ఫ.

## 82. Masturbation ముష్టిమైథునము.

పురుషులకు కేంథారిస్‌ను స్త్రీలకు ప్లాటినాను వాడిన క్రమముగ బుద్ధి మారును.

## 83. Measles పొంగు.

జ్వరలక్షణములు-ఎకోనైట్. వాడినపిమ్మట పల్సటిల్లాను వాడవలెను. (పల్సటిల్లా నిరోధకౌషధము) శరీరము దురద మంట కనుపించినచో సల్ఫరు వాడవలెను. (పల్సటిల్లా తరువాత వాడదగు మూడవమందు) దగ్గు తగ్గనిచో దగ్గు లక్షణములు చూచి చికిత్సచేయవలెను. ఈవ్యాధికి మార్బిల్లినం, బెల్లడోనాలు కూడ నిరోధకపుమందులు.

## 84. Mental-affections మనోదోషములు.

శరీరములేనట్లు భావన-జెల్సీమియం. ఏదోయొకఅంగము లేనట్లుభావన-ఎకోనైట్. తన శరీరము ఆత్మ వేరువేరుగా నున్నట్లుతోచుట—తూజా. అతిదుఃఖము మృత్యుభయము-నెకేలే. నిరాశ, ఆత్మహత్యచేసుకొనవలె ననుకోరిక-ఆరంమెట్, అర్జంటంనైట్రికం, కాల్కేరియాకార్బ, నక్సవామికా. గొణుగుకొనుచుండుట—బెల్లడోనా, సికూ్యటా. నిలకడలేని మనస్సు-ఆరంమెట్. శృంగారచర్చవలన కల్లుజబ్బు—స్టేఫెసేగ్రియా, ఈర్ష్య-ఎపిస్, హయోశ్యామస్. లెకెసిస్. తొందర-ఎకోనైట్. అర్జెంటంనైట్రికం, ఫాస్ఫరస్. నిర్లక్ష్యభావము-ఆసిడ్ఫాస్. సెపియా, కార్బోవెజ్. ఉన్మత్తత-ఆర్సెనికం, బెల్లడోనా, హయోశ్యామస్, స్ట్రమోనియం, లైకోపోడియం, విరేట్రం ఆల్బం. ఆకస్మికోన్మాదము- విరేట్రం ఆల్బం, కెన్నబిస్ ఇండికా, హయోశ్యామస్ ఒకేవిషయములో నున్మాదము—

కెన్నబిస్ ఇండికా, హయోశ్యామస్, సిక్యూటా. కామోన్మాదము-కేంథారిస్, ప్లాటినా, హయోశ్యామస్, ఫాస్ఫరస్. ధర్మోన్మాదము—హయోశ్యామస్, సల్ఫరు, విరేట్రం ఆల్బం, పల్సటిల్లా, లెకెసిస్. గర్వము—సల్ఫరు, ప్లాటినా, లైకోపోడియం. మౌనముగానుండుట—ఆసిడ్ ఫాస్, పల్సటిల్లా, సల్ఫరు. జగడమాడుట, బూతులుతిట్టుట—హయోశ్యామస్. ద్వేషము—క్రుప్రంమెట్. తనప్రక్క మరొకరుపరుండినట్లు భావన—బాప్టీషియా, పల్సటిల్లా. తనకు పిచ్చియెత్తుచున్నట్లు తోచుట—సిమిసిఫ్యూగా. అన్నివ్యాధులు తనకున్నట్లు—ఆరంమూరు. తనశరీరము గాజుముక్కలతో చేయబడినట్లు తోచుట—తూజా. లజ్జగల్గియుండుట-ఇగ్నేషియా. ఆకస్మికముగ పెద్దకేకవేయుట-ఎపిస్. తనకు విషముపెట్టి రనుకొనుట-హయోశ్యామస్, లెకెసిస్. తనబాధలనుగూర్చి ఆలోచించుకొనిన తగ్గుట-కేంఫరు. తనబాధలనుగూర్చి ఆలోచించుకొనిన హెచ్చుట-జెల్సిమియం. కడుపులో సజీవముగానున్న దేదియో తిరుగుచున్నట్లు తోచుట-తూజా, క్రోకస్, ఓపియం. తనరోగలక్షణములు చెప్పుటచే హెచ్చగుట—పల్సటిల్లా, ఇగ్నేషియా, కాల్కేరియా కార్బ.

## 85. Nose-bleeding.—See Epistaxis

## 86. Mumps గవదబిళ్లలు.

వీనికి మెర్క్యూరియస్ ప్రధానమగుమందు. అధికముగా వాపు బాధ యెఱుపు గల్గియుండినచో బెల్లడోనాతో మార్చి వాడిన తగ్గును.

## 87. Neuralgia నరముల నొప్పులు.

ఆకస్మికముగ బాధ కల్గి కొంతసేపుండి యాకస్మికముగ తగ్గుట—బెల్లడోనా, ఆసిడ్ నైట్రిక్. క్రమముగ హెచ్చి క్రమముగ తగ్గుట—స్టేనం. మెల్లగా వృద్ధిజెంది ఆకస్మికముగ తగ్గుట—ఆసిడ్ సల్ఫ్యూరిక్. వాపు, వేడి, మొద్దుబారినట్లుండుట, రాత్రి హెచ్చుట—ఎకోనైట్. సన్నని కాల్చినసూదులు ముఖముపై దొర్లుచున్నట్లుండుట—ఆర్సెనికం ఆల్బం. తలవేడిగనుండుట, కన్ను లెఱ్ఱబడుట, కదలుటచేతను పరుండుటచేతను హెచ్చుట—బెల్లడోనా. నిలువుగా కూర్చుండినను, నిలుచుండినను తగ్గుట—తూజా. ప్రతిదినము ఒకేగంటకు వచ్చుట—సిడ్రన్. నియమము తప్పక వచ్చుట, కొద్దిచల్లగాలి తగిలినను హెచ్చుట—చైనా. గ్రుచ్చుచున్నట్లు నొప్పి, వాపు, మంటతో ఎడమవైపున కల్గుట—స్పైజీలియా. నొప్పి భరింపలేనంతగానుండుట, కోపడమువలన హెచ్చుట-కెమోమిల్లా. నొప్పులు ఋతుదినములకు సంబంధించియుండుట—సిమిసిఫ్యూగా. వత్తిడి చేసిన తగ్గుట-కోలోసింథ్. లాగుచున్నట్లు నొప్పులు, గాలి మార్పుదలచే కల్గునొప్పులు—కాష్టికం. రోగి బాధకోర్వలేక అబ్బాయని కేకవేయగనే తగ్గుట—కాలీకార్బానికం. బాధలను గూర్చి తలపోసిన తగ్గుట—కేంఫరు.

## 88. Neurasthenia నరములపటుత్వము తగ్గుట.

నరములబలహీనత—ఆసిడ్ ఫాస్. దేహమనః పరిశ్రమలకు భయపడుట - సిలీషియా. నరములబలహీనత, మెదడు

నొప్పి—కాలీఫాసు కాళ్లు బలహీనముజెందుట, చర్మముపై కొద్దిస్థలమున మంట, చేతితో రుద్దిన తగ్గుట-ఫాస్ఫరస్. అజీర్తి లక్షణములతో నిస్సారము—నక్సువామికా.

## 89. Night-sweats రాత్రిచెమటలు.

కాల్కేరియా కార్బ, చైనా, మెర్క్యూరియస్‌లు చూడుడు.

## 90. Obesity శరీరము స్థూలమగుట.

శరీరము చల్లగానుండువారికి—కాల్కేరియా కార్బ.

బహిష్టు నిలిచిపోయినవారికి—గ్రాపైటిస్.

శరీరమున మంటలుకలవారికి—కాప్సికం.

## 91. Paralysis పక్షవాతము.

a. Paraplegia పైభాగముగాని క్రిందిభాగముగాని పక్షవాతము చెందుట.—

పైయవయవములలో-ఎపిస్, ఎకోనైట్, ఎగేరికస్, రూస్టాక్సు, నక్సువామికా, సల్ఫరు, కాస్టికం, కెన్నబిస్ ఇండికా, ప్లంబం, మోటాలికం దిగువయవయవము లలో—ఆర్సెనికం ఆల్బం, అర్జెంటం నైట్రికం, కెన్నబిస్ ఇండికా, కుప్రంమెట్, నక్సువామికా, ప్లంబంమెటాలికం, రూస్టాక్సు, కోనియం. (కోనియం క్రిందినుండి పైకి క్రమముగా అవయవములు పడిపోవును.)

b. Hemi-plegia ఒకవైపు పక్షవాతం (ఒక కాలుచెయ్యి).—
కుడివైపు—బెల్లడోనా, కాష్టికం, రూస్టాక్సు.
ఎడమవైపు—ఆర్నికా, కాష్టికం, నక్సువామికా, రూస్టాక్సు.

c. Paralysis of muscles కండరముల పక్షవాతము.—
జెల్సీమియం.

Paralysis of eyelids కనురెప్పల పక్షవాతం.—
ఆసిడ్ నైట్రిక్, కాష్టికం, జెల్సీమియం, రూస్టాక్సు, సేపియా, స్పైజీలియా.

d. Facial paralysis.–బెరీటాకార్బ, బెల్లడోనా, కాష్టికం.

e. Trembling-Paralysis.–వణుకుతో కూడినది-జెల్సీమియం.

92. Peritonitis భిన్నాంత్రోదరము (ప్రేవులవాపు.)
(Ecnteritis)

జ్వరలక్షణములు-ఎకోనైట్. పొట్టవాచుట-బెల్లడోనా. దాహము, వాంతి, నీళ్లవలె ఆకుపచ్చని విరేచనము, నోరు దుర్వాసన-మెర్క్యూరియస్. వాపు తగ్గి గ్యాసు చేరుట, మూత్రము బంధించుట - నక్సువామికా. వాపు, ఊపిరితిత్తుల పైపొరలకు వ్యాపించి శ్వాసతీసుకొనుటకు బాధగనుండుట—బ్రయోనియా. వ్యాధి యుద్రేకముగానుండి వాంతి, నాడి

సన్నగిలుట, నిస్త్రాణ, దాహముకల్గిన-ఆర్సెనికంఆల్బం. పలుమార్లు మూత్రము కొద్దికొద్దిగ విడుచుట, మూత్రము విడుచునపుడు మంట, బొట్లుబొట్లు పడుట, మలమూత్రములయందు రక్తము పడుట-కేంథారిస్. బాధ, నీళ్లవిరేచనములు అధికముగనున్న-కెమోమిల్లా, ఆర్సెనికములను మార్చి వాడవలెను. మలము వాంతిచేసుకొనుట - ఓపియం, ప్లంబం. సన్నిపాతలక్షణములు ప్రారంభించుచో - బాప్టీషియా. మలబద్ధకము-హైడ్రాస్టిస్. మలము తారువలె నల్లగా వెడలుచున్న - లెప్టాండ్రా.

పొట్టపై తాకిన సహింపలేకపోవుట, వాపు, నొప్పి, ఊపిరి పీల్చుటచే బాధ గల్గుట, ఊపిరి సల్పకుండుట, వాంతులగుచుండుట, మూత్రము బంధించుట యీభిన్నాంత్రోదరలక్షణములు కనుపించగనే ఎకోనైట్, నక్సువామికాలు మార్చి వాడిన తగ్గుననియు, ఎల్లోపతివైద్యులు ఈవ్యాధి కల్గినరోగులకు చికిత్సచేసి చేసి దైవలిఖితమునకు వదలివేసినరోగికి కెమోమిల్లా, ఆర్సెనిక్ లను మార్చివాడుటవల్లను నివారించితిననియు డాక్టరు లారీ తన యనుభవమును వ్రాసియుండెను.

## 93. Piles మొలలు.

మొలలబాధ సాధారణముగా మలబద్ధకము కలవారిలో కల్గుచుండును. అట్టివారికి సూర్యోదయసమయమున నక్సువామికాయును, సూర్యాస్తమానసమయమున సల్ఫరును 30. వ పొటెన్సీలో నొకమోతాదువంతున పెక్కువారములు వాడిన మొలలబాధలు పెక్కండ్రకు తగ్గును.

చీము, మొలలు - ఆంటిమోనియం క్రూడం. రక్తము కలిసిగాని జిగురుతోగాని మలము వెడలునవి—పల్సటిల్లా. తల నొప్పి, ముండ్లగుత్తి గుదముననున్నట్లు నొప్పి—యాస్కులస్ హిప్. రక్తము కారెడివి—హెమామిలిస్. మలము వెడలునప్పు డును ముందువెనుకలను తీవ్రమగు బాధతో కూడియుండి గుదముయొక్క యంచులు చిట్లి బాధ హెచ్చునవి—ఆసిడ్ నైట్రిక్. ద్రాక్షపండ్లగుత్తివలె పిలకలు దిగినవి - ఎలోస్.

## 94. Pneumonia శ్లేష్మజ్వరము.

జ్వరము, తీవ్రమగునాడి, ఆదుర్దా-ఎకోనైట్. శ్లేష్మము పల్చగానున్నట్లు ధ్వనిగల్గుచు దగ్గిన వెడలకుండుట, మగత, తెమల్చుచుండుట—ఆంటిమోనియం టార్టు. మలబద్ధకము, కదలిన దగ్గుహెచ్చుట, ఛాతీలోనొప్పి - బ్రయోనియా. రక్త స్రావమగుట- హెమామిలిస్. బ్రయోనియాలక్షణములకు వ్యతి రేకలక్షణములు-కాలీకార్బ. ఊపిరితిత్తులు శ్లేష్మముచే నిండుట, రక్తజీరతో శ్లేష్మము వెడలుట - లైకోపోడియం, ఫాస్ఫరస్, నెమ్ముగాలివలన వచ్చుట, సన్నిపాతలక్షణములలోనికి మారు చుండుట - రూస్టాక్సు. శ్వాస, కష్టదుర్వాసనవేయుట, వెల్లకిల పరుండిన హాయిగనుండుట - శాంగ్వేనేరియా.

## 95. Polipus ముక్కులో దుర్మాంసము పెరుగుట.

కాల్కేరియాకార్బ, తూజా.

## 96. Pregnancy and Labor గర్భిణి-ప్రసవము.

a. **గర్భిణి.**—గర్భవతుల జీర్ణకోశవ్యాధులు, మలబద్ధకము ఎల్యూమినా. గర్భవతులు నడువలేకపోవుట, ప్రసవించిన పిమ్మట రక్తస్రావము, మైల పెక్కుదినములవరకగుట, మైల పాలరంగుగా నగుట—కాల్కేరియా కార్బ. పాలు హెచ్చుగానుండుట, లేక ఎండిపోవుట, అప్పుడు పుట్టినపిల్లలకు సరిపడకపోవుట, గర్భవతిగానున్నప్పుడు చీము నెత్తురు యోనినుండి వెడలుట-కాక్యులస్. తెమల్చుట, వాంతి,దగ్గు—కోనియం. రెండుచూపులు, తలనొప్పి, తలతిరుగుట, బద్ధకము, పొట్ట కాళ్లు నొచ్చుట - జెల్సిమియం. నెలలు నిండక పూర్వమే చిన్నచిన్నకుదపలతో గూడిన రక్తస్రావము, వాంతి—కాలీకార్బ. (ఇది పిల్లల పుట్టుమచ్చలు తగ్గించును.) వేవిళ్లు, కామిల, శూల, శ్వాసతీసుకొ
న కష్టము - నక్సువామికా. ఎక్కువ పుట్టుమచ్చలతో పుట్టుపిల్లలమచ్చలు తగ్గుటకు సెపీనా మంచిపనిచేయును. గర్భములోనున్న శిశువు వడివడిగా తిరుగుటవల్ల తల్లి నిద్రనుండి లేవవలసివచ్చుట, యోనిలో నొప్పి, మూత్రమునకు వెళ్లవలసివచ్చుట—తూజా.

b. **ప్రసవము.**—నొప్పులు వెంటవెంట రాక ఆలస్యముగా వచ్చుట, పదేపదే విరేచనానుమానము కల్గుట—నక్సువామికా. నొప్పులవలన పిచ్చెత్తినమనిషివలె నగుట,

శరీరము మొద్దుబారుట, నొప్పులు నడుములో ప్రారంభించి పైకిని క్రిందికి తొడలలోనికిని వచ్చుట—కెమోమిల్లా. నొప్పులు సన్నసన్నముగా వచ్చుట, యేడ్పు స్వభావము, చల్లనిగాలికొరకు కిటికీలు తెరువమని కోరుట, ప్రసవమైనతరువాత మావి వెడలకపోవుట—పల్సటిల్లా. నడుము బ్రద్దలగుచున్నట్లు నొప్పి, ఆకస్మికముగవచ్చి తగ్గిపోవుచుండుట, యోని వెచ్చబడుట—బెల్లడోనా. నొప్పులు ఎంతసేపువచ్చుచున్నను ప్రసవము కాకపోవుట, పొత్తికడుపు ఖాళీగానున్నట్లు తోచుట—సెకేలే. నొప్పులాగియాగి వచ్చుట, వ్రేళ్లకీళ్ల యందును మూత్రపుసంచిలోను బాధకల్గుట, బలహీనముచెందుట-కాలోఫైలం. మగతగానుండుట, గర్భస్థ శిశువును వెలువరించుటకు తగుశక్తి యవయవములలో తరుగుపడుట, దొంగనొప్పులు జెల్సీమియం. నొప్పులు పొత్తికడుపుమీదుగా నొకవైపునుండి మరియొకవైపునకు మారుచుండుట, సొమ్మసిల్లుట, దొంగ నొప్పులు - సిమిసిఫ్యూగా.

c. **మావి వెడలకపోవుట.**—నక్సువామికా, కేంథారిస్, పల్సటిల్లా, సేపియా, సెకేలే, ఆర్సెనికం ఆల్బం, బెల్లడోనా లక్షణముల ననుసరించి వాడవలెను. 1 ఆర్నికా, 2 బ్రయోనియా, 3 రూస్టాక్సులను 1,2,3 మరల 1,2,3 వరుసగా వాడిన సుఖప్రసవమగును.

d. పాలుపడుటకు.—యాగ్నస్ కేక్టస్ వాడవలెను. నీళ్లవిరేచనము లగుచుండువారికి-రిసినస్ కమ్యూనిస్. భయపడినవారికి—ఎకోనైట్. కదలిన బాధ లుద్రేకించువారికి—బ్రయోనియా.

## 97. Prolapsus పొడుచుకవచ్చుట.

గుదము—పోడోఫైలం, ఇగ్నేషియా. యోని-ఎలోస్, పోడోఫైలం, మూరెక్సు, ఆసిడ్ బెంజాయిక్, పల్సటిల్లా, తూజా, స్టాఫిసేగ్రియా.

## 98. Puerperal fever సూతికాజ్వరము.

జ్వరములు చూడుడు.

## 99. Rheumatism మేహవాతపు నొప్పులు.

నొప్పులు క్రిందినుండి పైకివచ్చునవి, కీళ్లు చల్లగనుండి వాపు నీరు కనుపించునవి - లేడం. పైనుండి క్రిందికి వచ్చునవి హృదయవ్యాధికి సంబంధించి యుండునవి - కేక్టస్. పైనుండి క్రిందికి వచ్చునవి తరుచు చోటు మార్చుచుండునవి-కాల్మియా. ఎడమావయవములలో-స్పైజీలియా కుడియవయవములలో-శాంగ్వనేరియా. కుడివైపు ప్రారంభించి యెడమవైపు అవయవములలోనికి వచ్చునవి-లైకోపోడియం. ఎడమవైపు యవయవములలో ప్రారంభించి కుడివైపుకువచ్చునవి-లెకెసిస్. కుడి భుజములో - శాంగ్వనేరియా. ఎడమభుజములో-కెమోమిల్లా.

కుడిభుజము ఎడమమోకాలు, ఎడమభుజము కుడిమోకాలు నొప్పిగల్గుట (:x:) లేక్కేనియం. ఒకచోటినుండి మరొకచోటికి మారుచు కాపడమువలన హెచ్చునవి - పల్సటిల్లా. గొంతు పుండుతో మేహవాతపునొప్పి.—నక్సవామికా. కదలిన బాధ హెచ్చుట, నొప్పిగలవైపు పరుండిన సుఖముగనుండుట— బ్రయోనియా. పాదములు నేలమోప బాధగల్గువారినొప్పులు- ఆంటిమోనియం క్రూడం. అతిచెమటలతో కూడిననొప్పులు - మెర్క్యూరియస్. రోజుమార్చి రోజువచ్చుట - చైనా. కీళ్లు ఎఱ్ఱగావాచి మంటతోకూడిన నొప్పులు - సల్ఫరు. చల్లనిగాలి సోకుటవలన కీళ్లువాచి మిక్కుటమగు జ్వరముతోనుండిన-ఎకోనైట్. మగత, నాలుకచివర యెఱ్ఱని త్రికోణాకారపురంగు, కదలినకొలది బాధ తగ్గుట - రూస్టాక్స. విరేచనములు, మేహవాతపునొప్పులు ఒకటితగ్గిన నొకటివచ్చుట - కాలీబైక్రోమికం. కండరముల సంబంధమైనవి - యాక్టియారెసిమోసా. తడిగాలి వలన హెచ్చుట, అటునిటు తిరుగుటవలన తగ్గుట - విరేట్రం ఆల్బం. బిగించి పచ్చిపుండువలె నుండునవి-కాష్టికం. చల్లనిగాలి వల్ల బాధ హెచ్చుట, బాధవలన రోగి సొమ్మసిల్లుట— హెపార్ సల్ఫు, ఒకస్థలమునుండి ఎప్పుడును బయలుదేరుట- బెర్ బెరిస్‌వల్గరిస్. మోకా లాకస్మికముగ వాచి బాధకల్గుట- స్టిక్టాపల్. వంటకములవాసన రోగికికొట్టిన వాంతులు కల్గుటతో- కోల్చికం. పాదములు నేలమోపిన నొప్పిగనుండువారికి గనేరియా, శరీరమున జితించినవారికి కల్గునవి - మెడోరినం. గనే

రియా జితించుటచే వచ్చినవి చల్లగాలి తగులుటవలన రాత్రి హెచ్చునవి - సారసపరిల్లా. పగలు, వేడివల్ల హెచ్చునవి, గనేరియా జితించుటచే వచ్చినవి - తూజా, మెడోరినం. బిగింపుతో కూడి కదలలేకుండుట, స్నాయువాతము, కటిగ్రహవాతలక్షణములు - గైకం. ఎముకలలో కల్గునవి. నొప్పిగలవైపు పరుండినను రాత్రిపూటను హెచ్చునవి - కాలీఅయోడ్. క్రిందినుండి పైకివ్యాపించునవి చలికాలమున వచ్చునవి-ఆర్నికా. చంద్రుడు క్షీణించుచున్నప్పుడును, తడిగాలి తగులుటవలనను కల్గునవి - పైటోలక్కా. మధుమూత్రరోగము గలవారిలో - లాక్టిక్ ఆసిడ్. మణికట్టులో - సెబీనా. భుజములు - ఫెరంమెట్.

## 100. Ring-worm తామర.

ఉదయము సాయంత్రము **సల్ఫరు** ఒక వారము వాడవలెను. దానివలన గుణమివ్వనిచో సేపియా ఒక వారము వాడవలెను. కొందరికి రూస్టాక్సు **సల్ఫరులు** మార్చి వాడిన పనిచేసెను.

## 101. Sciatica కటిస్నాయువాతము.

తరుణస్థితి-కోలోసింథ్ - మేహవాతసంబంధమైనది-రూస్టాక్సు. ప్రతిదినము రాత్రి యొకానొకవేళకు హెచ్చునది - ఆర్సెనికం ఆల్బం. పెక్కురోజులనుండి బాధించుచున్న-సల్ఫరు.

## 102. Skin-diseases చర్మవ్యాధులు.

గజ్జి, గడ్డలు, మొటిమలు, కర్పాణి మొదలగువ్యాధుల క్రింద చెప్పబడెను.

## 103. Sleeplessness నిద్రపట్టకపోవుట.

ముసలివారలకు—ఎకోనైట్, పెక్కుదినములనుండి - ఓపియం. అలసటజెందుటచే-యాంబ్రగ్రేషియా. శరీర మదురు చుండుట, భయంకరమైనదృశ్యములు కన్నుమూయగనే కనుపించుట-బెల్లడోనా. జబ్బుగానుండుటచే-కాల్కేరియాకార్బ. మెదడు హెచ్చుగా పనిచేయుటవలన-జెల్సీమియం, కాలీఫాసు. అనేక ఆలోచనలు తట్టుచు - కాఫీ. పెందలకడ లేచి మరల నిద్రింపలేకపోవుట - సల్ఫరు పిల్లలు నిద్రింపకపోవుట - కెమోమిల్లా. ప్రొద్దుపోవువరకు మెలకువగా నుండుటచే—కాఫీ. ఎక్కువగా చదువుట, ఆలోచించుటలవలన—నక్సువామికా. మత్తుగానుండియు, నిద్రపట్టక, కలలువచ్చుచు పట్టకపోవుట— ఓపియం. దూరమున శబ్దముకల్గినను మెలకువకల్గి మరల నిద్ర పట్టకుండుట - ఓపియం.

## 104. Small-Pox, Chicken Pox etc.

## పెద్దమ్మవారు, ఆటలమ్మ మొదలగునవి.

(1) ఎండుకొని వేడిగానుండు చర్మము, జ్వరము - ఎకోనైట్, (2) సన్నిపాతలక్షణములు—బ్రయోనియా, రూస్టాక్సు, బాప్టీషియా, ఆర్నికా.

(3) నోటివెంట లాలాజల మధికముగా ఊరుట— శ్వాస దుర్వాసనవేయుట - మెర్క్యూరియస్, బాప్టీషియా, ఆర్సెనికం ఆల్బం, ఆసిడ్ మూర్.

(4) పొక్కులు లోతుగుంటలు పడకుండ నివారింపవలె నన్న తూజా, హైడ్రాస్టిస్, మెర్క్యూరియస్‌లు లక్షణగుణ్యముగా వాడవలెను.

(5) నిస్త్రాణ-ఆర్సెనిక్ ఆల్బం, కార్బోవెజ్, బాప్టీషియా.

**మశూచకమునకు** (1) సర్రాసీనియా విరుగుడుగను పొక్కులు పెద్దవికాకుండ నిల్పుటకును ఎండించుటకును పనికివచ్చును.

(2) వేరియోలినం, (3) మెలాండ్రినం పైదానివలెనే పని చేయును.

ఆటలమ్మను మార్బెల్లినం నిరోధకముచేయును.

## 105. Somnambulism నిద్రనుండి హఠాత్తుగ లేచి తెలియక పరుగెత్తుట.

ఎనకార్డియం, బ్రయోనియా, కెనబిస్ ఇండికా, కాలీ ఫాసు, నేట్రం మూరు, ఓపియం, ఫాస్ఫరస్, సల్ఫరు, జింకం మెట్.

## 106. Sore-throat గొంతుపుండు.

వాచియెఱ్ఱగానుండుట, యెండుకొనియుండుట, మ్రింగు నపుడు నొప్పి - బెల్లడోనా. గొంతు పచ్చిపుండువలెనుండి గ్రంధులువాచి నొప్పికల్గుచు, దుర్వాసనవేయుట— మెర్క్యూరియస్, జ్వరలక్షణములు, మాట్లాడలేకపోవుట, మంట—ఎకోనైట్ గాని, లెకెసిస్, ఆర్సెనిక్‌లనుగాని, బెల్లడోనా, మెర్క్యూరియస్‌లనుగాని మార్చి వాడవలెను. గొంతు, నిండు

నలుపువర్ణముగా మారుట - పైటోలక్కా. గొంతు పుండు పడుట, పచ్చని పొరవేయుట-కాలీబైక్రోమికం. పొగత్రాగు వారిలో కల్లు గొంతుపుండు-కాష్టికం. సవామేహరోగులలో పొడుచుచున్నట్లు నొప్పితో - ఆసిడ్ నైట్రిక్.

## 107. Spermatorrhea ఇంద్రియనష్టము.

మర్మావయవములు చల్లగానుండుట, పెక్కుమార్లు గనేరియా తగులుట, లేపనశక్తి తరుగుగలవారిలో-యాగ్నస్ కేక్టస్. నడుమునొప్పి, నడువలేకపోవుట, సాయంకాలమున స్ఖలనమగుట - నక్సువామికా. మర్మావయవము చల్లగానుండుట, బెజ్జమువద్ద పుండుపడినట్లు నొప్పి, లేపనశక్తి తగ్గుట-జెల్సిమియం. అధికసంభోగేచ్ఛ, లేపనశక్తి లేకపోవుట-ఫాస్ఫరస్. బలహీనత, వృషణములలో లాగుచున్నట్లు నొప్పులు, నడుములోను, కాళ్లలోను బలము తరుగుట, అతిసంభోగాదులవలన నీరసము-ఆసిడ్ ఫాసు. చికాకు, తలనొప్పి, వెన్నుపూస బలహీనము, నరములబలహీనత-సెలీనియం. ఇంద్రియము పల్చగా నీళ్లవలెనుండుట, నడుమునొప్పి, త్వరలో స్ఖలనమగుట-సల్ఫరు. లేపనశక్తి అసలే లేకపోవుట, మర్మావయవములుచల్లబడియుండుట-లైకోపోడియం. హస్తప్రయోగము చేయుటవలన, జ్ఞాపకశక్తి తరుగుట, సభాపిరికితనము, శృంగారచర్చ చేయుటవలన (స్త్రీవిషయము)—స్టెఫెసేగ్రియా. కొద్దిలేపనము కల్గినను స్ఖలనమగుట - కోనియం. అంగము పదేపదే లేచుచుండుట,

కాళ్లు బరువుగానుండుట, కొద్దిపరిశ్రమవలన ఆయాసము ఆసిడ్ ఒక్ రిక్.

## 108. Stammering నత్తి (మధ్య వచ్చినది.)

క్రమమైనపద్ధతిగా మాట్లాడునట్లు చేసిన క్రమముగా తగ్గును-కుప్రంమెట్, స్ట్రెమోనియం, సల్ఫరులు కూడ లక్షణముల ననుసరించి వాడిన మంచిపనిచేయును.

## 109. Sterility వంధ్యాత్వము.

అధికమైన సంభోగకోరిక గలవారికి—ప్లాటినా, ఫాస్ఫరస్. అధికఋతుస్రావముతో—కాల్కేరియాకార్బ, నేట్రంమూరు, మిల్లిఫోలియం, సల్ఫరు—కొద్దిఋతుస్రావము, స్తనములలో నొప్పి - కోనియం. స్తనములు ఎండుకొని చిన్నదిగానుండుట - ఐయోడిన్. మిక్కుటముగా కుసుమ అగుచుండువారికి-బోరాక్సు. సాధారణముగా నేట్రంకార్బ, నేట్రంమూరు, ప్లాటినా, సేపియా, ఆరంమెట్, మెర్క్యూరియస్‌లు. పురుషులకు—కోనియం, ఐయోడిన్‌లు వాడదగినవి.

## 110. Sunstroke వడదెబ్బ.

బెల్లడోనా, గ్లోనైన్, నేట్రంమూరు.

## 111. Synovitis మోకాలివాపు.

తెల్లనివాపు, చురుక్కుమనుపోట్లు - ఎపిస్. ఎఱ్ఱనివాపు, కదలలేకుండుట—బ్రయోనియా. చెమర్చుట, రాత్రి బాధ హెచ్చుట - మెర్క్యూరియస్.

## 112. Syphilis సవామేహము.

మెర్క్యూరియస్ — సవామేహద్వితీయావస్థలోని గొంతు పుండు, కోరుకు (soft) వడిశెగడ్డలు, రోగి నిద్రజెందగనే సవామేహాసంబంధమైన నొప్పులచే లేచి బాధపడును.

ఆసిడ్ నైట్రిక్.—చర్మము ఎముకలు పుండుపడినట్లు నొప్పితో నుండుట, రాగిరంగుమచ్చలు, కోరుకు.

కార్బోఎనిమలిస్.—ఎఱ్ఱని రాగి రంగుమచ్చలు, గ్రంథులు వాచుట, చిక్కిపోవుట, త్వరగా పగిలిపోయి అంచులలో గట్టితనము నిలిచియుండు వడిశెగడ్డలు.

కాలీహైడ్రో.—నమలుచున్నట్లు నొప్పులు, పుండ్లుపడి మచ్చలు నిల్చిపోవుట, సవామేహ తృతీయావస్థ. కోరుక (Hard.)

లెకెసిస్.—కోరుకు ప్రాకుచుండుట, నీలవర్ణముగా నుండు పుండ్లు రాత్రి ఎముకలలో నొప్పులు, పుండ్లు గుడ్డరాపిడి వలన నొప్పిజెందుట.

లైకోపోడియం.—నుదుట రాగిరంగుమచ్చలు, గొంతులో కుడిభాగమున పుండు, పుండ్లు ఎన్నాళ్లో మానకుండుట, కోరుకు (Indolent.)

హెపార్ సల్ఫ.—మబ్బురంగుగా చుక్కలు చుక్కలుగా మూత్రము వెడలుట, మూత్రము విసర్జన చాలసేపు పట్టుట, నిద్రలో మూత్రము విడుచుట, పుండ్లు మానకుండుట.

**పల్సటిల్లా.**—పలుమార్లు మూత్రమువిడుచుట, గర్భిణీస్త్రీలలో మూత్రకృచ్ఛ్రము.

**ఆరంమెట్.**—వృషణము వాచుట, గట్టిబడుట, ఎముకల నొప్పులు, మూత్రము మజ్జిగవలె మడ్డితో వెడలుట, సవాయిబిళ్లలు, సవాయికాలికస్థితి.

**సారసపరిల్లా.**—ఎముకలలో నొప్పులు, తలనొప్పి, మూత్ర సంబంధ ప్రమేహాలక్షణములతో చేరిన సవామేహాపు కురుపులు.

**కాలీబైక్రోమికం**—పుండ్లు గుండ్రని పనిముట్టుతో లోతుగా తొలిచినట్లు ఏర్పడుట, ముక్కు నోరు వీటియందలి పుండ్లు.

## 113. St Vitus Dance నర్తనరోగము.

కుప్రంమెట్, స్ట్రెమోనియం.

## 114. Tetanus; Lock-Jaw

ధనుర్వాతము, హనుగ్రహవాతము.

ఎకోనైట్, బెల్లడోనా, సిక్యూటావిరోసా, జెల్సిమియం, హాయోశ్యామస్, ఇగ్నేషియా, లెకెసిస్, నక్సువామికా, ఓపియం, రూస్టాక్సు, ఆర్నికా లక్షణములు చూచివాడుడు. ధనుర్వాతము-రూస్టాక్సు, ఇగ్నేషియాలు మార్చి వాడుచున్న మంచిపని చేయును. వీనినే 2 చుక్కలు డిస్టిల్డు వాటరులో కలిపి ఇంజక్షను కూడ చేయవచ్చును. (హైపోడర్మిక్-చర్మములో చేయునది.)

హనుగ్రహవాతము—బెల్లడోనా, లెకెసిస్‌లను మార్చి వాడిన మంచి పనిచేయును.

## 115· Tonsillitis కంఠగ్రంథులవాపు.

వాపు, నొప్పి - బెల్లడోనా. పాలిపోయిన ముఖము, కొవ్వుపట్టినశరీరము, కంఠగ్రంథులవాపు - కాల్కేరియా, అయోడియం. వాపు, ఎఱ్ఱని రక్తనాళములు పైన వలవలె అల్లినట్లు కనబడుట, పైపైపునకు కూడ వాపు కనుపించుట - బ్రోమియం. రక్తము వేడిగనుండి చిక్కిపోవుట, నాడీచలనము కంటికే కనబడుట - అయోడియం - వాచి చీముపట్టియుండుట. మెర్క్యూరియస్‌వివస్. ఎప్పుడును చీముపోయనివి - కోనియం. గొంతులో ఎముక అడ్డుపడినట్లు గ్రుచ్చుకొనుచుండునవి— హెపారుసల్ఫు. చిన్నచిన్న పుండ్లతో నిండినవి—లైకోపోడియం. ప్రతిసారి జలుబుచేసినప్పుడును వాచునవి - బెరీటాకార్బ.

## 116. Tooth-ache పంటిపోటు.

దంతములు చెడిపోయినవారిలో - మెర్క్యూరియస్ దీనివలన ప్రయోజనము కనుపించనిచో - ప్లాంటాగోమేజర్. చల్లనివస్తువులైనను వేడివస్తువులైనను పంటికి తగులుటచే పోటు - మెర్క్యూరియస్, కెమోమిల్లా. పండ్లసందున యితర పదార్థములు. చేరుటచే - ఆర్నికా. చిగురుమీాద కురుపులేచుటచే - సిలీషియా. చల్లనిగాలి తగులుటవలన - బెల్లడోనా.

వేడిచేతను, వత్తుటచేతను తగ్గుట - ఆర్సెనికం ఆల్బం, చల్లనినీరు వలన హెచ్చుట - స్పైజీలియా, వేడినీరు వెచ్చదనమువలన హెచ్చుట - నక్సువామికా. చల్లనినీరు నోటిలో పట్టియుంచు టచే తగ్గుట - కాఫీ.

## 117. Typhoid సన్నిపాతజ్వరము.

జ్వరములలో చూడుడు.

## 118. Urinary diseases మూత్రవ్యాధులు.

a. Acute-albuminaria మూత్రమున శ్వేతధాతువు పోవుట.

జ్వరము, చలి—ఎకోనైట్. మూత్రము తక్కువగుట, హాయి లేకుండుట - జెల్సిమియం, కేంథారిస్, ఎపిస్.

నంజు—హెల్లిబోరస్, ఎపిస్.

నిస్త్రాణ—ఆర్సెనికంఆల్బం, బలహీనము - ఆసిడ్ ఫాసు.

b. Chronic-Albuminaria or Brights disease

జ్వరలక్షణములు—ఎకోనైట్.

రక్తముతో—హెమామిలిస్, ఆర్నికా.

నంజుతో—హెల్లిబోరస్.

తలనొప్పితో—హెల్లిబోరస్, జెల్సిమియం.

తెమల్చుట వాంతులతో—ఇపెకాక్, ఆసిడ్ఫాస్.

ఊపిరితిత్తులవాపుతో—ఫాస్ఫరస్.

ఫ్లూరసీ—బ్రయోనియా, డల్కమరా.

c. Inflammation of Kidneys మూత్రపిండములవాపు.

చర్మము వేడిగా నుండుట, జ్వరము—ఎకోనైట్. మూత్రము విడుచునపుడు మిక్కిలి బాధ–కేంథారిస్. శూల, మూత్రపుసంచి మెలితిరుగుచున్నట్లు బాధ–బెల్లడోనా. మల బద్ధకము, మొలలు గలవారికి–నక్సువామికా. కురుపులేచు లక్షణములు–బెల్లడోనా, హెపార్ సల్ఫు, ఆర్నికా.

ఆమవాతపునొప్పులు గలవారిలో–కోల్చికం.

d. Inflammation of the bladder మూత్రపుసంచివాపు.

జ్వరము—ఎకోనైట్.

మూత్రము తక్కువగానగుట - కేంథారిస్, పల్సటిల్లా.

నొప్పి—నక్సువామికా.

మెలిబెట్టినట్లు బాధ—డిజిటాలిస్, హయోశ్యామస్.

చీము స్రవించుట—పల్సటిల్లా, డల్కమరా.

కాలికవ్యాధి—డల్కమరా, హైడ్రాస్టిస్, మెర్క్యూరియస్, తూజా.

e. Diabetes అతిమూత్రము.

ఆసిడ్ ఫాస్—నీరసము, పాలవలె పలుమార్లు హెచ్చుమూత్రము విడుచుట.

ఆసిడ్ లేక్టిక్—దాహము, కీళ్లనొప్పులు, పలుమార్లు హెచ్చుమూత్రమగుట (మధువుతో.)

ఆసిడ్ ఎటిక్—అతిదాహము, అతినీరసము, రంగు లేని హెచ్చుమూత్రము.

కొడెయిదం—మధుమూత్రము, అతిమూత్రము, అతి దాహము, ఇది వ్యాధిని పెరుగనివ్వదు.

రూస్టాక్స్—స్పెసిఫిక్ గ్రావిటీ తక్కువగా నుండుట, మూత్రము రంగులేక శ్వేతధాతువుతో కలిసి యెక్కువగా వెడలుట.

హెల్లిబోరస్—నంజులక్షణములు కనుపించుట, కొద్ది కొద్దిగ పదేపదే మూత్రము విడుచుచుండుట, రంగులేని మూత్రము.

యురానియం నైట్రికం—నీరసము, పులిసినవాసనవేయు అతిమూత్రము.

ఉదయము నేట్రంఫాసు 12xను, సాయంత్రం నేట్రం సల్ఫు 12xను వాడిన పలురకములైన యతిమూత్రములు కట్టును.

సిజీజియం జాంబోలినం—బలహీనత, అతిదాహము, స్పెసిఫిక్ గ్రావిటీ హెచ్చుగానుండుట, అతిమూత్రము - ఇది మధుమూత్రమును, అతిమూత్రమును తగ్గించుటలో అమోఘ మైనది. దీని మదరుటించరును 5,6 చుక్కలు కొద్దినీటిలో కలిపి దినమునకు 2 సార్లు సేవించవలెను.

## 119. Vaccination - bad effects of

టీకాలు వేయుటవలన కలుగు దుర్గుణములు సమస్తమును తూజావలన నివారింపబడును. టీకాలవలన కల్గు చీముతో కూడిన చర్మవ్యాధులకు సైలీషియా పేరొందినమందు.

## 120. Vertigo తలతిరుగుట.

నాడి తీవ్రముగా నుండుట, వేడిచర్మము - ఎకోనైట్. ఎఱ్ఱనిముఖము, తలపోటు—బెల్లడోనా, నక్సువామికా. పాలినముఖము, తలపోటు—సిమిసిఫ్యూగా, పల్సటిల్లా, నక్సువామికా. తెమల్చుట—పల్సటిల్లా. తెరవేసినట్లుండు దృష్టి—జెల్సీమియం, బెల్లడోనా. కనుగ్రుడ్లు నొప్పి—సిమిసి ఫ్యూగా. నరములబలహీనతవలన—చైనా, నక్సువామికా. భయము వలన—ఎకోనైట్, ఓపియం. కోపమువలన—ఇగ్నేషియా. మత్తుపదార్థములవలన—నక్సువామికా, ఓపియం.

## 121. Vision చూపు.

[దృష్టి యనుదానిలో చూడుడు.]

## 122. Vomitings and Morning sickness వాంతులు, వేవిళ్లు.

పసరు—బ్రయోనియా, ఇపెకాక్, పోడోఫైలం. గొప్పవాంతి—ఆర్సెనిక్, విరేట్రం ఆల్బం. త్రాగినవెంటనే—ఆర్సెనిక్. త్రాగినవెంటనే తినినవెంటనే—బిస్మత్. త్రాగిన

గంటకు—ఫాస్ఫరస్. కదలిన వాంతిగల్గుట—ఆర్సెనిక్. కల్లె వాంతి - కెమోమిల్లా, నక్సువామికా, ఇపెకాక్. పుల్లనివాంతి-హెపార్‌సల్ఫు. పుల్లని లేక చేదువాంతి, చొంగకారుట, శ్లేష్మము కక్కుట, శ్లేష్మము దారములవలె సాగుట - ఐరిస్. దెబ్బతగులుటవలన—ఆర్నికా, బెల్లడోనా, లెకెసిస్. ప్రయాణములో - కాక్యులస్, నక్సువామికా. ఓకరింత, వాంతి—ఇపెకాక్, నక్సువామికా (N. V.)

## 123. Warts ఆనికాయలు.

బటాణీగింజవలె పులిపిరికాయలు, మాంసపుసూడికలు - తూజా. చేతులపై పులిపిరికాయలు గలవారికి ఫెరం పిక్‌రిక్ (రోజు కొక మోతాదు.)

## 124. Whitlow and Felon గోరుచుట్టు, కణుపుజెష్ట.

వాపు, పోటు—బెల్లడోనా. వాపు తగ్గక బాధ అమితముగానున్న-హెపార్‌సల్ఫు. హెపార్ పనిచేయక యింకను బాధించుచు పుండు ఎముకలోనికి వ్యాపించుచున్నట్లు తోచిన—సైలీషియా. సైలీషియావలన లాభము కనుపించనిచో సల్ఫరుతో మార్చి వాడవలెను. బాధ హెచ్చుగానుండి వాపు నిండుయెరుపుగాగాని, నీలముగాగాని యుండిన—లెకెసిస్. నల్లగానుండి మంటతోకూడియున్న-ఆర్సెనిక్‌ఆల్బం. ఆర్సెనికం ఆల్బం 3 మోతాదులు వాడిన లాభము కనుపించనిచో కార్బోవెజ్‌తో మార్చి వాడవలెను. వ్రేలంతయు వాచియున్న-

రూప్టాన్స్. పగిలి మాంసపు ముక్కవలె నుండి మానకున్న ఆసిడ్ నైట్రిక్.

## 125. Whooping-cough గోరింతదగ్గు.

ముఖము ఎఱ్ఱబడుట, ఆకస్మికముగ దగ్గు తెరవచ్చుట, కళ్లె పడకపోవుట - బెల్లడోనా. అత్యధికమగు శ్లేష్మముతో- ఆంటిమోనియం టార్. దగ్గు క్రమముగ హెచ్చి అవయవము లలో చిక్కబట్టుట-కుప్రంమెట్. తెమల్చుకొనుట, వాంతిజేసు కొనుట-పల్సటిల్లా, డ్రోసిరా, ఇపెకాక్, కుప్రం, కోనియం. కాలికవ్యాధిగా మారుట, దగ్గినపిమ్మట వాంతిరైు దగ్గుతెర తగ్గుట—డ్రోసిరా. ముక్కునుండి దగ్గునపుడు రక్తముకారుట- ఆర్నికా, డ్రోసిరా, ఊపిరితిత్తులు వాచుట—ఆంటిమోనియం టార్, బ్రయోనియా, ఫాస్ఫరస్. రాత్రిపూటనే దగ్గుతెర వచ్చుట, ఆహారము వెళ్లిపోవుట-కోనియం.

## 126. Women-diseases స్త్రీలవ్యాధులు.

a. Chlorosis—

లోకాక, దగ్గుగలవారికి ఫెరంమెట్. కాల్కేరియా కార్బులనుగాని, ఫెరంమెట్, ఫాస్ఫరస్లనుకాని మార్చి వాడవలెను. రాత్రి చెమటలు, నీళ్లవిరేచనములు, అస్వాభావికసంభోగదోషములు-ఫాస్ఫరస్. నెమ్మది స్వభావము, పల్చనిశరీరము గలస్త్రీలు, స్థానచల నము చెందుచుండు మేహవాతపునొప్పులు, బహిరంగ

మైన గాలిలో పోయిగానుండుట, కుసుమ, పిక్కలలో నొప్పులు - పల్సటిల్లా. చర్మము ముడికిగను, జిడ్డుగనుండు వారికి - నేట్రంమూరు. తరుచు శూల గల్గుట, చేతులు కాళ్లు చితుకగొట్టినట్లు నొప్పులు - హిస్టీరియా సం॥ తల నొప్పులు - సేపియా, నిస్త్రాణ, ముఖము పైభాగమున ఉబ్బు-ఆర్సెనిక్. పాలిపోయినముఖము, చిక్కినశరీరము, నరములబలహీనత - చైనా.

**b. Dysmenorrhœa** ఋతుశూల.

**సిమిసిఫ్యూగా.**—మేహవాతతత్వరోగులకు సంభోగము సహింపలేనివారికి కల్గు శూల, పొట్ట ఖాళీయైనట్లు తోచుట, గర్భములో నెడమభాగమున నొప్పి.

**బెల్లడోనా.**—క్రిందికి అదుముచున్నట్లు నొప్పులు, కోయుచున్నట్లు, పొడుచుచున్నట్లు మెరుపువలె వచ్చు నొప్పులు.

**సెపియా.**—దిగలాగుచున్నట్లు నొప్పులు, తలనొప్పి.

**పల్సటిల్లా.**—వమనములు, చలి, స్రావము నల్లగ ముద్దలుగ రంగులేక నీళ్లవలె మారుచుండుట, ఆలస్యముగ (నెల గడువుదాటి) బహిష్టయగుట.

**జెల్సీమియం**—ముఖము కన్నులు ఎఱ్ఱబడుట, బాధ అధికముగా నుండుట, తలనొప్పి తప్పక వచ్చుట, గొంతు నొప్పి, వాంతులు.

కాల్కేరియాకార్బ.—నరములబలహీనత, పాలిపోయిన ముఖము, కాళ్లుచేతులు చల్లగనుండుట.

కాలోసైలం.—ప్రేవులకు గుదమునకు వ్యాపించు ఈడ్పు నొప్పులు.

కాలినోసోనియా —మొలలు, మలబద్ధకము గలవారిలో.

నక్సువామికా.—నడుములోనుండి నొప్పి తొడలలోనికి పోడుచుచు–దీనిని ఋతుదినములకు వారముముందు నుండి వాడవలెను.

కెమోమిల్లా.—తెల్లని ఆకుపచ్చని అజీర్తినిరేచనములు, భరింపలేనంతశూలలు.

పల్సటిల.—తలనొప్పి, నడుమునొప్పి, కడుపునొప్పి, మొలలబాధ గలవారికిని, చాలాకాలమునుండి యీబాధ కల వారికిని.

కాల్కేరియా.—సల్ఫరు వాడిన 10 దినములకు (మధ్యదిన ములలో) వాడినతరువాత నెలలో వచ్చుబాధ తీవ్రత తగ్గును.

c. Leucorrœa కుసుమ.

వెన్నపూసవలె తెల్లగా నొక్కొక్కప్పుడు మంటతో వెడలుట–పల్సటిల్లా. పల్సటిల్లాతో కాల్కేరియాకార్బ మార్చి వాడవలెను. పసుపుపచ్చని నీళ్లవంటి స్రావము–క్రిందికేదియో యోనినుండి జారుచున్నట్లు నొప్పితో

నుండుట - సెపియా. చిక్కని ఆకుపచ్చని మంటగలిగించు స్రావము-రాత్రి వేళ హెచ్చుగనగుట-మెర్క్యూరియస్. అధికమగు స్రావము, నీరసము - చైనా. దురద, పుండు పడినట్లు నొప్పితో గూడిన స్రావము - క్రియసోటం. ఋతువునకు బదులు పచ్చని దుర్వాసన గలస్రావము, యోని వాపు, మంట—నక్సువామికా. కాన్పునొప్పులవంటి నొప్పులతో పచ్చనిస్రావము, స్రావము తగిలినచోట మంట - ఇగ్నేషియా. కాలేయ జఠరదోషములతో ముక్కలు తీగలు కల పచ్చనికుసుమ - హైడ్రాస్టిస్. బహిష్టు స్నానము చేసినతరువాత పచ్చగా నధికముగా నగుట - ఆసిడ్ ఫాస్. యోనియందు మంట. **యోని నుండి వాయువు వెడలుట.** (బ్రోమియం) ఆర్స. అరికాళ్లు అరిచేతులు యోని వీటియందు మంటలతో - సల్ఫరు, ఎడమ అండాశయములో నొప్పి. బహిష్టులో కొద్ది ఋతుస్రావము—తూజా. కొద్దిశబ్దమునకే యులికిపడువారికిని కోడిగ్రుడ్డుసొనవలె స్రావము హెచ్చుగా నగువారికిని—బోరాక్సు. కుసుమ చీలమండలవరకు నీళ్లవలె కారుచుండిన—అయోడియం.

**d. Menorrhœa** అధికఋతుస్రావము.

ఎఱ్ఱగ వేడిగనుండు రక్తస్రావము, కాన్పునొప్పులవంటి నొప్పులతో స్రావము, రక్తాధిక్యత గలవారిస్రావము—బెల్లడోనా. అతిసంభోగమువలన, కడుచిన్నతనముననే

పుష్పవతియగుటవలన, 15 దినములకే బహిష్టు అగుట వలన, నల్లనిరక్తము వెడలుచుండిన—ప్లాటినా. మిక్కిలి బలహీనత జెందుచుండిన-చైనా. తెమల్చుకొనుచు-ఇగ్నేషియా. సులభముగ జలుబుచేయుచుండుట కాళ్లు చల్లగనుండుట—కాల్కేరియాకార్బ. ప్రత్యేకలక్షణములు కనుపడనిచో—ఇపెకాక్.

e. Menses-Retarded ఋతువు ఆగిపోవుట.

భయమువలన, శీతమువలన, ఉద్రేకము కల్గుటవలన - ఎకోనైట్. కాళ్లుచేతులు తిమ్మిరి, చురుకులు గల వారిలో - ఎపిస్. కదలుటచే యోనిలోనొప్పి, ఋతువు కావలసినదినములలో ముక్కువెంట రక్తస్రావమై—బ్రయోనియా. అజీర్తితో కూడిన రక్తక్షీణస్త్రీలకు-చైనా. జ్వరమువలన శీతమువలన, ఉద్రేకము చెందుట వలన ఋతువు ఆగి పొట్టలో నొప్పికల్గుట. నొప్పి తొడలలోనికి గుండెలలోనికి పాడుచుచుండుట—సిమిసిఫ్యూగా. ఋతువునకుబదులు కుసుమ స్రవించుట, ఋతుకాలమున దుర్బలత, ఋతువు 4, 5 బొట్లు కనుపించి యాగుట, గుండెలో నులినొప్పి - కాక్యులస్. కొద్ది వయస్సు, క్రిందిరెప్పక్రింద ఉబ్బు, పాలినముఖము, కొద్దిగా ఋతువగుట—కాలీకార్బ. ఋతుశూల గల వారికి—కాలోఫైలం. తలనొప్పి, చలి, తరుచుగా శరీరమునకు వేడితగులుచుండుట-సెపియా. శరీరమున అధిక రక్తము గలవారికి ఋతువు ఆగి, ఆకస్మికముగ రక్తపు

పోటు కల్గుట—బెల్లడోనా. ఆకుపచ్చని లేక బూడిదవర్ణ ముఖము. గలవారికి-ఫెరం మెట్.

## 127. Worms పురుగులు (విరేచనము వెంట పడుట.)

సాధారణముగా - సినా, స్పైజీలియా, నేట్రం ఫాసు. గుండ్రనివి - రాత్రి స్టేనం, ఉదయం వివోలా, ఒడోరేటాలు వాడవలెను. టేప్‌వలె నుండునవి-ఫిలిక్సుమాన్ రెండుపూటల వాడవలెను.

## 128. Wry-neck మెడబిగింపు.

తరుణస్థితి-రూస్టాక్సు, రూటా, కాలికము, యామ్కులస్ హిప్, నక్సువామికా.

## 129. Yawnings ఆవలింతలు.

ఇగ్నేషియా—హిష్టీరియా లక్షణములతో.

జెల్సిమియం—బద్ధకము, మత్తు, చలి, నీరసము, వణుకుతో.

## 130. Yellow-fever పచ్చజ్వరము.

జ్వరములు చూడుడు. (ఇది వెస్టు ఇండీస్‌లో కల్గును.)

ఇది ఎకోనైట్, బెల్లడోనాలుగాని ఆర్సెనిక్, లెకెసిస్‌లుగాని ఆర్సెనిక్, అర్జెంటం నైట్రికములుగాని మార్చి వాడిన తగ్గును.

శ్రీ ర స్తు.

# హోమియోపతి గృహవైద్యము

---

## 3 వ భాగము—ముఖ్యవిషయములు.

సారూప్యౌషధశాస్త్రమున ఆయుర్వేదవిధానమునందలి వాతపిత్తశ్లేష్మములవలె సోరా, సైకోసిస్, సిఫిలిస్ అను మూడు దోషములు కలవు. ఇవి మానవప్రకృతుల జన్మాది యాశ్రయించి యుండును. ఆయుర్వేదవైద్యమున వాతదోషమునకు ప్రాధాన్యమిచ్చినట్లు ఈవిధానమునందును సోరాదోషమునకు ప్రాధాన్య మిచ్చియున్నారు. ఇయ్యదియే మిగిలిన రెండుదోషములను నడుపుచుండు (పిత్తః పంగు కఫః పంగు పంగవో మలధాతవః, వాయునా యత్ర నీయంతే తత్ర గచ్ఛంతి మేఘవత్.) ను. ఈదోషత్రయము (సోరా, సైకోసిస్, సిఫిలిస్‌లు వాతపిత్తశ్లేష్మములు) స్థానాశ్రయవిభేదమువలన ననేకదోషవికారములను కలిగించును.

Psora సోరాదోషమువలన నరములబలహీనత, మూర్ఛ, అపస్మారము, మానసికవ్యాధులు (ఉన్మాదము మొదలగునవి.), నపుంసకత్వము, వాతవ్యాధులు, అంతరవ్రణములు, మొలలు, వంధ్యాత్వము, మూత్రకృచ్ఛ్రము, చిడుము గజ్జి కురుపులు

పోటు కల్గుట—బెల్లడోనా. ఆకుపచ్చని లేక బూడిదవర్ణ ముఖము గలవారికి-ఫెరం మెట్.

## 127. Worms పురుగులు (విరేచనము వెంట పడుట.)

సాధారణముగా - సినా, స్పైజీలియా, నేట్రం ఫాసు. గుండ్రనివి - రాత్రి స్టేనం, ఉదయం విహోలా, ఒడోరేటాలు వాడవలెను. టేప్‌వలె నుండునవి-ఫిలిక్సుమాన్ రెండుపూటల వాడవలెను.

## 128. Wry–neck మెడబిగింపు.

తరుణస్థితి-రూస్టాక్సు, రూటా, కాలికము, యాముక్యులస్ హిప్, నక్సువామికా.

## 129. Yawnings ఆవలింతలు.

ఇగ్నేషియా—హిస్టీరియా లక్షణములతో.

జెల్సిమియం—బద్ధకము, మత్తు, చలి, నీరసము, వణుకుతో.

## 130. Yellow-fever పచ్చజ్వరము.

జ్వరములు చూడుడు. (ఇది వెస్టు ఇండీస్‌లో కల్గును.)

ఇది ఎకోనైట్, బెల్లడోనాలుగాని ఆర్సెనిక్, లెకెసిస్‌లుగాని ఆర్సెనిక్, అర్జెంటం నైట్రికములుగాని మార్చి వాడిన తగ్గును.

Syphilis సిఫిలిస్‌తత్వమువారికి మర్మావయవముల మీాద పొక్కులు కురుపులు బిళ్లలు రాగిరంగువంటి మచ్చలు ఏర్పడుట, లూటీలు, గండమాలలు మొదలగునవి జనించును. ఈరోగులపై మెర్క్యూరియస్—సాల్, హెపార్, ఆసిడ్ నైట్రిక్, నేట్రంమూరు, సిలీషియా, ఆర్సు, లెకెసిస్, లైకోపోడియం, కాలీబైక్రోమికములు మంచి పనిచేయును.

N. B. ఒకవ్యక్తి వ్యభిచారవృత్తిలో చేరనివాడైనను, ఈరోగబీజములు రోగితత్వమున కనుపింపవచ్చును. ఏలనన రోగి పూర్వులెవ్వరైన సీసైకోసిస్, సిఫిలిస్ దోషములు కలవారై యుందురు.

## కుడియవయవములపై పనిచేయుమందులు.

ఆరంమెట్, అర్జెంటం నైట్రికం, ఎపిస్, బెల్లడోనా, బాప్టీషియా, బ్రయోనియా, కేంథారిస్, కోలోసింథ్, కాల్కేరియాకార్బ, చెలిడోనియం, లైకోపోడియం, నక్సువామికా, పల్సటిల్లా, సెకేలే.

## ఎడమవైపు పనిచేయునవి.

ఎసఫిటిలా, అర్జెంటం నైట్రికం, కాప్సికం లెకెసిస్, ఫాస్ఫరస్, సిలీషియా, సల్ఫరు.

× అడ్డదిడ్డముగా (డయాగ్నల్) నుండునొప్పులు-ఎగేరికస్, ఫాస్ఫరస్.

## Times of fevers జ్వరము తగులుకాలములు.

మధ్యాహ్నము 1 గం॥ ఫెరం, 2 గం॥ కాల్కేరియా కార్బ, లెకెసిస్, 3 గం॥ యాపిస్, చైనాసల్ఫ. 4 గం॥ ఎయిస్కు. 5 గం॥ చైనా. సాయంత్రము రాత్రి-ఇపెకాక్.

అర్ధరాత్రి—ఆర్సెనికం, నక్సువామికా.

ఉదయము-1, 2 గం॥ ఆర్సెనికం, 3 గం॥ తూజా, 4 గం॥ ఫెరం, 5 గం॥ చైనా, 6-7గం॥ పోడోఫైలం, 7-9 గం॥ యూపటోరియంపెర్ఫ, 9-11 గం॥ బాప్టీషియా, నేట్రంమూరు, 11గం॥ కేక్టస్.

ప్రతి 3 వ 7 వ రోజుకు తలనొప్పి-యూపటోరియం పెర్ఫ. ప్రతి 7 వ 14 వ రోజునను, రోజుమార్చిరోజును-చైనా.

## Sight దృష్టి.

రేచీకటి-చైనా, లైకోపోడియం, నైట్రిక్ ఆసిడ్. దివాంధత్వము-ఫాస్ఫరస్, స్ట్రెమోనియం.

## Longsight దూరపువస్తువులు మాత్రము కనబడుట.

అర్జెంటం నైట్రికం, కోనియం, కాల్కేరియా కార్బ, పెట్రోలినం, సేపియా, సైలీషియా.

## Shortsight దగ్గరవస్తువులు మాత్రము కనబడుట.

ఆసిడ్ ఫాసు, ఎనకార్డియం, చైనా, కార్బోవెజ్, యూఫ్రేషియా, పల్సటిల్లా, పెట్రోలియం, రూటా, సల్ఫరు. **వస్తువులు తలక్రిందుగా నున్నట్లు.** బెల్లడోనా, కాలీకార్బ. కుడిసగము కనబడకపోవుట—కాక్క్యులస్, కాల్కేరియా కార్బ, అయోడియం, లైకోపోడియం. ఎడమసగము కనబడకపోవుట-సిక్యూటావిరోసా, నేట్రంకార్బ, కాల్కేరియాకార్బ. పైవైపు సగము కనబడకపోవుట-ఆరం, ఆర్ను, కేంఫ్, డిజ్. క్రిందివైపు కనబడకపోవుట ఆరం, సల్ఫ. ఒకటి రెండుగా కనబడుట - సెనీగా, జెల్సీమియం.

## Pulse–beat నాడిచలనము.

**బలము గలిగి నిండుగా నుండునవి.**—ఎకోనైట్, ఆరం, బెల్, ఓపియం.

**ఎగురుచుండునాడి.**—ఎకోనైట్, ఆర్నికా, ఆరం, ప్లంబం.

**వణుకుచుండునాడి.**—ఆంటిమోనియం టార్టు, కాల్కేరియా కార్బ, స్పైజీలియా, ఆర్సెనికం, సిక్యూటా, విరోసా, బెల్లడోనా, జెల్సీమియం, రూస్టాక్సు, సేపియా.

**జంటదెబ్బలు.**—బెల్లడోనా, ఫాస్ఫరస్, స్ట్రమోనియం.

**లుప్తనాడి**—కార్బోవెజ్, కుప్రంమెట్, ఆర్సెనికం, ఇపెకాక్, విరేట్రంఆల్బం, ఓపియం, సెకేలే, మెర్క్యూరియస్, సిలీషియా, రూస్టాక్సు, ఆసిడ్ఫాసు.

**ఆగిఆగి కొట్టుకొనునట్టినాడి**—(సవిరామనాడి)—కార్బోవెజ్, డిజిటాలిస్, మెర్క్యూరియస్, సెకేలే, లైకోపోడియం,

నేత్రం మూరు, స్పైజీలియా, ఎకోనైట్, బెల్లడోనా, నక్సువామికా, ఆసిడ్ ఫాసు. (మానసికపరిశ్రమ, శోకము, నిరాశ, పనిలేకపోవుట, కోపము మొదలగు వానివలన నాడి విరామమగును.) 3, 4, 5, 6, 7 దెబ్బలు స్పష్టముగా కనుపడనప్పుడు-ఆసిడ్ మూర్, డిజిటాలిస్.

**విషమనాడి.**—(హెచ్చుతగ్గులు)-ఆర్నికా, ఆర్సెనికం, ఆరం మెట్, కేక్టస్, డిజిటాలిస్, లెకెసిస్, లైకోపోడియం, ఆసిడ్ ఫాసు, నేత్రంమూరు, స్పైజీలియా.

**వేగముగలనాడి.**—ఎకోనైట్, ఆంటిమోనియం టార్, బెల్లడోనా, జెల్సీమియం, లైకోపోడియం, ఫాస్ఫరస్, డిజిటాలిస్, ఉదయమున వేగము-ఆర్సెనికం, సల్ఫరు. మెల్లగ కొట్టుకొనుట-కేంఫర్, డిజిటాలిస్, జెల్సీమియం. ఒకప్పుడు వేగము, మరియొకప్పుడు మెల్లన-జెల్సీమియం, డిజిటాలిస్.

**నాడిమృదువు, అణచబడుట.**—ఆర్సెనికంఆల్బం, జెల్సీమియం, ఫెరంమెట్, ఫాస్ఫరస్.

**కఠినమగునాడి.**—ఎకోనైట్, బెల్లడోనా, బ్రయోనియా, హయోశ్యామస్, స్ట్రమోనియం, ఆంటిమోనియం, టార్టు, కేంథారిస్, కేక్టస్, చైనా, డిజిటాలిస్, లెకెసిస్. హెపార్ సల్ఫు, మెర్క్యూరియస్, సల్ఫరు, నక్సువామికా, ఫాస్ఫరస్, సేపియా, సిలీషియా.

**క్షీణమై చంచలమై దారమువలె నుండునాడి.**—ఆర్సెనికం ఆల్బం, ఆరంమెట్, ఆసిడ్ఫాసు, కేక్టస్, కేంఫరు, డిజిటాలిస్, ఫెరంమెట్, జెల్సీమియం, లెకెసిస్, ఫాస్ఫరస్, స్పైజీలియా, విరేట్రంఆల్బం. హృదయచలనము కంటె నాడీచలనము మృదువైనప్పుడు—డిజిటాలిస్, డల్కమరా, సెకేలే, విరేట్రం ఆల్బం.

## వ్యాధినిరోధక ఔషధములు.

కొన్ని కొన్ని వ్యాధులలో వ్యాధినిరోధకౌషధములను వ్రాసియుంటిని. అవియేగాక ఏతరుణమున పెక్కండ్రయందు **ఏసమానలక్షణములు,** కలరోగములు జనించునో యాసమాన లక్షణములకు సారూప్యతకలమందు వ్యాధినిరోధకౌషధముగా పనిచేయును. లక్షణములు కుదరనిచో వ్యాధినిరోధకౌషధమని చెప్పబడినమందు కూడ పనిచేయజాలదు.

## వస్తుదోషములకు విరుగుళ్లు.

తేయాకు—చైనా.

కాఫీ—ఇగ్నేషియా, టీ.

పంచదార—అర్జెంటం నైట్రికం

ఉప్పు—ఫాస్ఫరస్.

లోహము—పల్సటిల్లా.

లోహములు—హేపార్సల్ఫ్.

సీసము—ఎల్యూమినా.

సిల్వర్ నైట్రేట్—నేట్రం మూరు.

క్వైనా—ఆర్సు, ఇపెకాక్, పల్సు, నేట్రంమూరు.

నాభి—సల్ఫరు.

మూలికలు—నక్సువామికా.

పాదరసము—హెపార్ సల్ఫు, నైట్రిక్ ఆసిడ్, అయోడియం.

పాషాణము—కేంఫరు, చైనా, హెపార్ సల్ఫు. అయోడియం,ఇపెకాక్,నక్సువామికా,విరేట్రం ఆల్బం.

నల్లమందు—అవెనసటీవా (ఇది అలవాటును కూడ తగ్గించును) బెల్, ఇపెకాక్, నక్సువామికా.

మత్తుగలిగించువానికి—యెసెటిక్ ఆసిడ్.

పొగాకు—ప్లాంటాగో (వాడుకను కూడ తగ్గించును.)

## పైకివాడుమందులు—(మదరు టించర్లు.)

1. Amyl-Nitrosum ఎమిల్ నైట్రోసం—దీనిని దూదిపై 2 చుక్కలు వేసి హిస్టీరియా, మూర్ఛ, యీడ్పువాతము మొదలగువాటిలో వాసనచూపిన మత్తు వదలివేతును, మత్తుపదార్థముల మత్తునుకూడ తొలగించును.

2. Apis ఎపిస్.—తెల్లనివాపులు, యెఱ్ఱనివాపులు, విషపురుగులకుట్లు, గట్టిబడినవ్రణములు వీనికి టించరునుగాని

1 భాగంమందు 1 భాగం నీరు కలిపి(1—1)గాని పట్టించవలెను.

3. Arnica ఆర్నికా.—దెబ్బలు, గాయములు, పడకపుండ్లు, చెప్పువత్తుళ్లు,త్వరలో పెరుగని కురుపులు, ఆనికాయలు, స్వారివలన కల్లువాపులు వీటికి 10 రెట్లు కాగి చల్లారిన నీళ్లలో కలిపిగాని, టించరునేగాని పట్టించవలెను. చర్మము చితికినవాటిలో దీనిటించరును పట్టించరాదు. ఇది కొబ్బరినూనెలో కలిపి తలకు వాడుకొనిన అకాలమున వెంట్రుకలు నెరియుట, రాలిపోవుట, బట్టతలయిగుట మాన్పును. వెంట్రుకలను కోమలముగ పెంచును.

4. Belladonna బెల్లడోనా.—ఎత్తునివాపులు, మాంసగ్రంథులవాపులు, గాలిబిళ్లలు, చీముపట్టనికురుపులు వీటికి పట్టించిన తగ్గును.

5. Bellis–Perennis బెల్లిస్ పెరిన్నిసు.—ఎముకలు స్వస్థానము తప్పినను, విరిగినను పట్టించి కట్టుకట్టవలెను. దీనిని అందముచెరుచు పుట్టుమచ్చలకు పట్టించిన క్రమముగా హరించును. దీనిని 1వ పొటెన్సీలో లోపలికి వాడిన బెణుకునొప్పులు ఇరుకునొప్పులు, మేహవాతపునొప్పులు, హస్తప్రయోగము చేయువారిదోషములు, శరీరమంతటను కురుపులులేచుట, చితుకగొట్టినట్లు నొప్పులు తగ్గును.

6. Badiaga బేడియాగా.—మాంసగ్రంథులవాపునకు దూది తడిపి పైనవేసి కట్టవలెను. దీనిని పొటెన్సీలలో లోనికి వాడిన మాంసగ్రంథులవాపులు, స్తనములపై బయలు దేరు పుట్టవ్రణము (కోనియం, కార్బోయనిమలిస్) కండరములు నలుగగొట్టినట్లు నొప్పులు తగ్గును.

7. Bryonia బ్రయోనియా.—మెడ వంగకపోవుట, నడుము కీళ్లు ఛాతీసంబంధ మగు మేహవాతపు నొప్పులు హరించును.

8. Calendula కేలెండ్యులా.—పుండ్లు, వ్రణములు, నరుకులు బొబ్బలు మొదలగునవి. చీముపట్టినపుడు ఈమందు తో (1-10) లోషనుచేసి కడిగి కట్టుకట్టిన చీము హరించును. దీనిని కొబ్బరినూనెలోగాని, గ్లిసరైనులోగాని (1-4) కలిపి వాటికి పట్టించవచ్చును.

9. Camphor కేంఫర్.—ఫిట్టు వచ్చి పడిపోయినపుడు దీనిని దూదిపై కొద్దిగ వేసి వాసనచూపినయెడల తెలివి వచ్చును. అరిచేతులు, అరికాళ్లు మిక్కిలి చల్లగానున్నప్పుడు, పిక్కలు లాగుచున్నప్పుడు, తిమ్మిరెక్కినపుడు దీనిని పట్టించి మర్దించవలెను. జలుబుచేసిన ముక్కుపై పట్టించవలెను. దీనిని పొటెన్సీలలో లోపలికివాడిన శరీరమంతయు మంచువలె చల్లగానగుట, కలరాలక్షణములు, నీళ్లవిరేచనములు, కలరాలో మూత్రము బంధించుట, జలుబుయొక్క ప్రథమావస్థ, చలి, తుమ్ములువచ్చుట, ముక్కునుండి రక్తముకారుట మొదలగునవి తగ్గును.

10 Euphrasia యూఫ్రేషియా.—దీనిలోషనుతో కండ్లు కడిగినను, కండ్లలో లోషనుచుక్కలు వేసినను, ప్రసి కట్టుట, నీరుకారుట, వాపులు, ఎఱుపులు, కలకలు, పువ్వులు మొదలగునవి మాన్పును-లోపలికి వాడినచో పైన వ్రాయబడిన కంటివ్యాధులు, ముక్కునుండి నీళ్లు కారుట, జలుబుతోకూడిన తలనొప్పి, విరేచనబద్ధకము తగ్గించును.

11 Hydrastis హైడ్రాస్టిస్.—సవాయి, కొరుకుపుండ్లు చెవి రోగములు వీటిలో నీళ్లలో (1-10) కలిపిగాని (1-4) కొబ్బరినూనెలో కలిపిగాని, గ్లిసరైన్ (1-4) కలిపిగాని పూయవలెను. దీనిని లోపలికి వాడుచో నెమ్మదిగా జీర్ణ మగుట, విరేచనబద్ధకము, స్తనములలో పుట్టువ్రణములు బయలుదేరుట, కత్తితో పొడిచినట్లు బాధలు కల్గుట, పసుపుపచ్చని చిక్కనితీగవలె సాగుకుసుమ, శ్లేష్మములు వెడలుట, నాసికారంధ్రములు పుండ్లుపడుట, బహిష్టుకు పిమ్మట అధికమగు కుసుమ మొ॥ తగ్గును. కుసుమ, శెగరోగములలో దీనిలోషనును పిచికారీ చేయవలెను.

12. Iodium అయోడియం.—బుడ్డ, ప్లీహామువాచుట, వీనికి 3 రోజులకొకసారి పైకిరాచిన తగ్గును.

13. Plantago ప్లాంటాగో.—పుప్పి, పంటినొప్పి, చెవిపోటు, పాముకాటు, ఆసనముతీపులకు దీనిటించరును వీలు ననుసరించి వాడవలెను. దీని లోపలికివాడిన పైవ్యాధు లును, లాలాజలము హెచ్చుగా పూరుచుండుటను,

6. పొగాకు వాడుకచే కల్గు నరములదోషములను తగ్గించును. ఇది పొగాకుఅలవాటును మాన్పును.

14. Rhus-Tox రూస్టాక్సు.—మేహవాతపునొప్పులు తగ్గించును.

15. Thuja తూజా.—మెత్తనికాయలు, పులిపిరికాయలు,
7. ప్రమేహరోగులలో కల్గు మేహవాతపునొప్పులు, కీళ్లనొప్పులు మొదలగువానికి అమోఘముగా పని చేయును.

8. Liniments.—లినిమెంట్లు.—

ఆర్నికా
బ్రయోనియా } మేహవాతపునొప్పులను తగ్గించును.
రూస్టాక్సు

కోనియం
9. నక్సువామికా } వెన్నెముకదోషములు హరించును.

ఎకోనైట్
బెల్లడోనా } గొంతునొప్పి, ముఖము నరములనొప్పుల నణచును.

జెల్సిమియం— మెడనరము బిగింపు తగ్గించును.

క్రైసరోబీనం—ఏనుగగజ్జి, తామర నివారించును.

హెమామిలిస్, లినిమెంటు రక్తస్రావములకు, మొలలకు అత్యుత్తమమైనది.

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1941